మట్టి పొరల మధ్య

# మహో చరిత్ర

( చరిత్ర వ్యాసాలు )

డా// వేంపల్లి గంగాధర్




# మట్టి పొరల మధ్య మహా చరిత్ర ( చరిత్ర వ్యాసాలు ) శీర్షిక తో వెలువడుతున్న ఈ పుస్తకం లో వివిధ సందర్భాలలో వివిధ పత్రికల్లో నేను రాసిన వ్యాసాలన్నీ యధాతదంగా 'డిజిటలైజేషన్' చేయడం మా ప్రయత్నం. గమనించగలరు .ధన్యవాదాలు .

- డా// వేంపల్లి గంగాధర్

01జూన్ 2020

## ఇందులో ...

# మట్టి పొరల మధ్య మహా చరిత్ర

*వేంపల్లి గంగాధర్*



**న**మ్మగలరో... లేదో... గానీ జిల్లాలో మనకు తెలియని మన ప్రాచీన చరిత్ర గురించి చెప్పాల్సివస్తే... టి. సుండుపల్లె మీదుగా రాయవరం బయలుదేరి అక్కడ్నుంచి దేవాండ్లపల్లె పైనుండి కొంత దూరం కాలినడకన కొండ దారిలో నడక సాగిస్తే ఒక చారిత్రాత్మక విశేషం సాక్షాత్కరిస్తుంది. అవును... ఆ కొండ బండల మాటున విప్పారిన అడవి పుష్పంలా చరిత్ర బృహత్ శిలా సంపద బయటపడుతుంది.

ఆదిమానవుని అవశేషాలతో నిర్మితమైన రాతి సమాధులు యాభైకి పైగా అక్కడ దర్శనమిస్తాయి. ప్రత్యేకంగా సేకరించబడిన సహజసిద్ధమైన పెద్ద పెద్ద బరువైన బండరాళ్ళతో ఈ నిర్మాణాలు తయారు చేశారు. ఈ రాతి సమాధుల నిర్మాణంలో సుమారు పది అడుగుల ఎత్తున్న బండరాళ్ళను నిలబెట్టి పై కప్పుగా మరో బండరాయిని ఉపయోగించిన పద్ధతి కన్పిస్తుంది.

పాండవ గుళ్ళుగా పిలిచే ఇలాంటి పురాతన కాలంనాటి మానవ సమాధుల అవశేషాలను చిన్నకుడాల, ఎర్రబల్లి, పోరుమామిళ్ళ, శంఖవరం, కోడూరు ప్రాంతాల్లో కూడా వున్నట్లు లార్డ్ సీవెల్ రచనలు చెప్తున్నాయి.

క్రీ.పూర్వం మూడవ శతాబ్దానికి చెందిన పాండవగుళ్ళుగా వీటిని పేర్కొంటారు. చనిపోయినవారి ఆత్మలను శాంతింపజేయడం కోసం, వారికి ఆహారాలు అందివ్వడం కోసం సమాధులకు రంధ్రాలు చేశారు. సమాధుల లోపల భాగాన్ని చిన్నచిన్న గులకరాళ్ళతో నింపారు. ఇవన్నీ ఒకే కొండపైన గుంపులు గుంపులుగా నిర్మించబడి వుండడం విశేషం.

వీటి గోడలపై వేటగాడు, ఏనుగు, తాబేలు, పాత్రల బొమ్మలు చెక్కబడి వున్నాయి. చరిత్రపైన ఆసక్తి వున్న వారెవరైనా వీటిని గురించి మరింత పరిశోధించవచ్చు.

ఈ రవాణా సాధనాలు ఏవీలేని కాలంలో పూర్వులు కేవలం కాలినడకన సుదూర ప్రాంతాలు పర్యటించి శ్రమించి ప్రయాణించి జ్ఞానతృష్ణ తీర్చుకునే వారని చరిత్ర చెప్తుంది. గౌతమ బుద్ధుడు, వర్ధమాన మహావీరుడు లాంటివారు సైతం ఇలాగే చేశారు.

ఒకసారి చరిత్ర పుటల లోతుల్లోకి వెళ్ళిచూస్తే అనిర్వచనీయమైన ఆనందం, అనుభూతి కల్గించే కడప నేల పూర్వయుగ సంస్కృతికి ప్రతీక. ఎంతో ప్రశస్తమైన చరిత్ర పరిఢవిల్లిన పుణ్యభూమి.

ఇక్కడి మట్టిపొరల మధ్య దాగివున్న మహాచరిత్రకు వందనం... అభివందనం...

## చరిత్ర సంతకం

గతానికి, వర్తమానానికి మధ్య
సంభాషణే - చరిత్ర.
మన సంస్కృతి ఎప్పటికీ
ఇంద్రధనుస్సు
మన చారిత్రక ప్రాభవ వైభవం
నిత్య ఉషస్సు
ఈ స్వచ్ఛమైన నేలకు
నమస్సు...



కడపజిల్లాలో పాండవగుళ్లు

## ఆదిమానవుడి చరిత్రకు ఆధారాలు

# మెగాలిథ్స్

**కొండబండల మాటున విప్పారిన చరిత్ర కుసుమాలు 'మెగాలిథ్స్'. వీటికి పాండవ గుళ్ళు... రాక్షస గుళ్లు... కల్లోరీలు... అని రకరకాల పేర్లు ఉన్నా అవి ఆదిమానవుడి చరిత్రకు ఆధారాలనేది స్పష్టం. చరిత్ర పుటల్లో 'బృహత్ శిలా సంపద'కు ఇవి తార్కాణాలు.**

మెగాలిథ్స్ ప్రధానంగా నదీ పరివాహక ప్రాంతాల్లో లేదా చెరువుల పరిసర ప్రాంతాల్లో కనిపిస్తాయి. ఇవి అలనాటి రాతి సమాధులు. హైదరాబాద్‌లో, రాయలసీమలో, గుంటూరు జిల్లా గారపాడులో, దండకారుణ్య ప్రాంతంలో ఇవి కనిపించాయి. ఆదిమానవుడి విశ్వాసాలు, మనిషి మృతి చెందాక నాడు పాటించిన పద్ధతులను ఈ పాండవగుళ్లు తెలియచేస్తాయి.

మెగాలిథ్స్‌లో మృత దేహాలను సమాధి చేయడానికి ఒక ప్రత్యేక విధానం ఉంటుంది. వీటిలో సాధారణంగా మూడు మీటర్ల లోతుతో విశాలమైన గొయ్యి ఉంటుంది. ఆ గోతికి నాలుగు వైపులా రాతి ఫలకాలు ఉంటాయి. ఒక రాతి ఫలకానికి వృత్తాకారంలో రంధ్రం ఉంటుంది. ఆ రంధ్రంలో నుంచే మృత దేహాన్ని పడేసేవారు. ఆ తర్వాత ఆ మనిషి జీవించి ఉండగా ఉపయోగించిన వస్తువులను కూడా అందులో వేసి పై కప్పుగా మరో రాతి ఫలకాన్ని పెట్టి గొయ్యి పూడ్చేవారు. ఆ మొత్తం నిర్మాణాన్ని 'రాక్షసగుళ్ళు'గా వ్యవహరించేవారు. సహజంగా లభ్యమయ్యే పెద్ద పెద్ద బండరాళ్ళతో సమాధులు నిర్మించి వీటి లోపల మట్టి పాత్రలు, లోహపు పనిముట్లు ఉంచి మూసేసేవారు.

కొన్ని చోట్ల ఈ రాతి సమాధులు సుమారు ఏడు, ఎనిమిది అడుగుల ఎత్తుంటే మరి కొన్ని చోట్ల చిన్న రాళ్లతో కట్టబడి ఉన్నాయి. కొన్ని రాతి సమాధులకు రంధ్రాలు ఉంటే, మరికొన్నింటికి రంధ్రాలసలు లేవు. అయితే ఎక్కువగా రంధ్రం ఉన్నవే కనిపిస్తాయి. ఇవన్నీ గుంపుగా ఒకేచోట ఉండడం విశేషం. వీటి గోడలపై రకరకాల బొమ్మలు చెక్కబడి ఉంటాయి. కరీంనగర్ జిల్లాలో పది నుంచి ఇరవై వరకు రాతి గుళ్ళు ఒకేచోట కనిపించాయి. వీటిని ఆ ప్రాంతీయులు 'కుచ్చె గుడిసెలు'గా వ్యవహరిస్తున్నారు. కర్నాటక ప్రాంతంలో 'కల్లోరీ'ల పేరుతో పిలవబడే రాతి సమాధులు క్రీ. పూ. 900–200 నాటి లోహ యుగపు బృహత్ శిలా సంపదగా చెప్తారు.

### ఐరోపాతో పోలిక

హైదరాబాద్ పొలిమేరల్లోని హస్మత్‌పేట, లింగంపల్లి, మాంకాళ మహేశ్వరం, మౌలాలీలలో మెగాలిథ్స్ బయటపడ్డాయి. సిక్ విలేజ్, మనో వికాస్



నగర్‌లోని చాలా ఇళ్ళ కింద రాక్షస గుళ్ళు ఉన్నాయని పురావస్తుశాఖ పరిశోధనల్లో వెల్లడైంది. ఈ ప్రాంతాల్లో లభించే మెగాలిథ్స్ పిట్‌సర్కిల్, కెరెన్ సర్కిల్ రకాలకు చెందినవిగా చెప్తారు. వీటిని పోలిన సమాధులే ఐరోపా దేశాల్లోనూ ఉన్నట్లు చరిత్రకారుల విశ్లేషణ.

**రాష్ట్ర వ్యాప్తంగానూ...!**

మెగాలిథ్స్ కరీంనగర్ జిల్లా బుడిగేపల్లి, సింగాపూర్, పాలమాకుల, పోరండ్ల, ఏటూరు ప్రాంతాల్లోనూ, నల్లగొండ జిల్లా భువనగిరి, మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల, గుంటూరు జిల్లా నాగార్జునకొండ, ప్రకాశం జిల్లా గిద్దలూరు, కంభం ప్రాంతాల్లోనూ, ఖమ్మం జిల్లా భద్రాచలం పరిసర ప్రాంతాల్లోనూ, చిత్తూరు జిల్లా పలమనేరు దగ్గరి బాపలసత్తం ప్రాంతాల్లోనూ ఉన్నట్లు చరిత్రకారుల రచనలు ఆధారాలతో వెల్లడిస్తున్నాయి.

**రాయలసీమ ప్రాంతంలో...**

కర్నూలు జిల్లాలోని బనగానపల్లి వద్ద గుహలలో 1880 ప్రాంతంలో తవ్వకాలు జరిపిన బ్రిటిష్ భూగర్భ శాస్త్రజ్ఞుడు హెన్రీబ్రూస్ పుంటే, ఆయన కుమారుడు రాబర్ట్ బ్రూస్ పుంటే ఈ గుహలలో ఆదిమానవుడి ఆనవాళ్ళు గుర్తించారు. ఈ గుహలలో రాతి యుగంనాటి పనిముట్లు, రాతి గొడ్డలి, రాతి కత్తి వంటివి దొరికాయి.

**అనంతపురం జిల్లాలో ఇలాంటి సమాధులు గూళ్ళపాళ్యం నుంచి కర్నూలు జిల్లా పత్తికొండ వరకు దాదాపు వందకు పైగా ఉన్నాయి. స్థానికులు ప్రస్తుతం వీటిని 'కావలిగట్లు'గా పిలుస్తున్నారు.**

కడప జిల్లాలో 'పాండవ గుళ్ళు'గా పిలిచే మెగాలిథ్స్‌ను చిన్న కుంటాల, ఎర్రబల్లి గ్రామాల వద్ద 1882లోనే గుర్తించారు. పోరుమామిళ్ళ, శంఖవరం, కోడూరు ప్రాంతాల్లోనూ ఆదిమానవుడి ఆనవాళ్లు బయల్పడ్డాయి. పులివెందుల నియోజకవర్గంలోని లింగాల మండలం కుందేటి చెర్లోపల్లి గ్రామంలో వేటగాళ్ళ కారణంగా ఒక ప్రాచీన బిలం వెలుగులోకి వచ్చింది. సుండుపల్లి మండలం మండలం రాయవరం ప్రాంతంలోని గుట్టల్లోనూ బృహత్ శిలాసంపద వెలుగులోకి వచ్చింది.

కడప జిల్లాలో యర్రగుంట్ల, వెల్గటూరు, ముక్రావులపల్లె, సరస్వతి పల్లె, వేముల, సుండుపల్లి పరిసర ప్రాంతాల్లోనూ ఆదిమానవుడికి సంబంధించిన మెగాలిథ్స్ బయటపడుతున్నాయి. ఈ ప్రాంతాలలో పాతరాతి పనిముట్లు, ఇనుప పనిముట్లు, ఆయుధాలు, ఎముకలు, ఆభరణాలు, బొమ్మలు, వస్తువులు బయటపడగా వాటిని జిల్లాలోని మ్యూజియానికి చేర్చారు.

అనంతపురం జిల్లాలో ఇలాంటి సమాధులు గుంతకల్లుకు ఐదు కిలోమీటర్ల దూరంలోని గూళ్ళపాళ్యం నుంచి కర్నూలు జిల్లా పత్తికొండ వరకు దాదాపు వందకు పైగా ఉన్నాయి. స్థానికులు వీటిని 'కావలిగట్లు'గా పిలుస్తున్నారు. ఇవి పది అడుగుల ఎత్తు, పది మీటర్ల చుట్టుకొలతతో గుండ్రంగా లేదా దీర్ఘ చతురస్రాకారంగా ఉన్నాయి. ఇంకా ఈ జిల్లాలోనే ముదిగల్లు, దేవాదుల బెట్ట, మాల్యవంతం, కొండాపురం, పూలేరు, పాలవాయి, కొత్తపేట, మిదెపనకల్లుకోట, వేల్పుమడుగు, లత్తవరం, కురుకు ముక్కల ప్రాంతాల్లోనూ ఆదిమానవుడి ఆధారాలు



చరిత్రకు ఆనవాలు శిథిలాలపాలు



ఇటువంటి రంధ్రాల నుంచి శవాల్ని లోపల పడేసేవారు

కనిపించాయి.

చిత్తూరు జిల్లాలో చంద్రగిరివద్ద ఒక మెగాలిథ్ బయటపడింది. శ్రీ వెంకటేశ్వర అభయారణ్యంలోని 'మొగిలిపెంట' పరిధిలోని యుద్ధగళ తీర్థం ప్రాంతంలోనూ, గంగులోడికోన ప్రాంతంలోనూ రాతియుగం నాటి ఎన్‌గ్రేవింగ్స్, పెయింటింగ్స్, రాతి పనిముట్లు సేకరించగలిగారు.

**రాతియుగం నాటి రహస్యాలు**

దండకారుణ్య ప్రాంతంలో పరిశోధనలు చేయడం దండగని అధికారులు నిద్రపోతుంటే మనసు ఉండబట్టలేక ఒక పర్యావరణ వేత్త వరంగల్లు నుంచి హైదరాబాద్ బయలుదేరాడు. అక్కడే రెండు రోజులుండి యంత్రాంగంలో చలనం తెచ్చి ఏటూరు నాగారం మండలంలోని తూర్పు సర్వాయి వద్ద వారిని అడవుల్లోకి నడిపించుకొని వచ్చి వీటిని కొంచెం పట్టించుకోమని విన్నవించుకున్నాడు. ఎప్పుడో 14 వేల మిలియన్ సంవత్సరాల క్రితం వాతావరణంలో చెట్లు శిలలుగా మారిన తీరు (ఫాజల్స్) చూసి అధికారులు ఆశ్చర్యపోయారు. రాకాసి దిబ్బలుగా పిలువబడే ఈ గుహల వద్ద రాళ్ళను కంకరగా మార్చడం మరోవైపు జరిగిపోతున్న దారుణం.

తాడ్వాయి మండలంలోని దామెరవాయి ప్రాంతంలోనూ ఆదిమానవుడి మెగాలిథ్స్ బయటపడ్డాయి. ఈ దండకారుణ్య ప్రాంతంలో మరిన్ని పరిశోధనలు జరిగితే జీవ పరిణామ రహస్యాలు సైతం ఆవిష్కారం కావచ్చు. వీటి ప్రాధాన్యతను సరిగ్గా గుర్తించకపోవడం నిరాశ కలిగిస్తుంది. ఇక్కడి వృక్ష శిలాజాలకు 110 మిలియన్ సంవత్సరాల చరిత్ర ఉంది. వాస్తవానికి ఇలాంటి ఫాజిల్స్‌ని అద్దాల గదుల్లో ఉంచి ప్రదర్శనకు పెట్టాల్సి ఉంది. ఆ ప్రాంతాన్ని రక్షిత ప్రాంతంగా ప్రకటించి పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దాల్సి ఉంది. కానీ అంత శ్రద్ధ మనకెక్కడిది?

**చివరగా...!**

"మానవ జాతి పరిణామ క్రమాన్ని ఒక గంట సినిమాగా తీస్తే... అందులో 59 నిమిషాలు ఆదిమ దశ నుంచి పైకి ఎదిగిన తీరును చూపించడానికే సరిపోతుంది. నాగరిక మానవ జీవితం మొత్తం ఒక్క నిమిషంలో గడిచిపోతుంది. యంత్రయుగం నుంచి ఈనాటి వరకు వచ్చిన అభివృద్ధి ఒకటిన్నర సెకన్ల కంటే ఉండదు" అన్నాడు హైమైన్ లైవీ తన రచన 'సోషల్ థింకింగ్'లో.

నిజమే.. మానవ మొదటి దశ గురించిగానీ అంతకు పూర్వ స్థితి గురించి కానీ ఎక్కడో అమెరికాలోనో... ఆసియాలోనో కాదు... మన ఆంధ్రప్రదేశ్‌లో మనకు అందుబాటులో ఉన్న ప్రాంతాల్లోనే ఆధారాలు అందించే 'మెగాలిథ్స్' గురించి ఆలోచించరెందుకు? కార్పొరేషన్ చెత్తకుప్ప కింద, ఆక్రమిత భూముల అట్టడుగున, నిధినిక్షేపాల కోసం వెదికే వారి గునపాల దెబ్బకు నామరూపాలు లేకుండా పోతున్న 'మెగాలిథ్స్'ను కాపాడి రక్షించుకోరెందుకు...?

– వేంపల్లి గంగాధర్

## భారతదేశంలోని ఏకైక సహజసిద్ధ శిలాతోరణం

# తిరుమల శిలాతోరణం

కలియుగ ప్రత్యక్షదైవంగా పేరుపొందిన చిత్తూరు జిల్లా తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి సన్నిధిలోని ప్రతి కట్టడంలో ఒక్కో విశేషం, చారిత్రిక ప్రాశస్త్యం కన్పిస్తాయి. కానీ శ్రీవారి పుట్టుకకు ముందే శేషాచల పర్వత శ్రేణులకు 11కిలోమీటర్ల దూరంలోని దుర్గమైన తాంత్రికకోనలోనూ ఆదిమానవుడి ఉనికి బయటపడింది. తిరుమల ఆలయానికి తూర్పున దాదాపు ఏడు కిలోమీటర్ల దూరంలోని గంగులోటి కోనలోనూ ఆదిమానవునికి సంబంధించిన ఆధారాలు దొరికాయి. ఆనాటి మానవుడు ఉపయోగించిన రాతి పనిముట్లను, గీసిన చిత్రాలను తిరుపతికి చెందిన బి.వి. రమణ ఆధ్వర్యంలోని మొజాయిక్ అడ్వంచర్స్ క్లబ్ (మ్యాక్) పరిశోధించగలిగింది.

ఆనాటి కాలంలో శేషాచలం అడవుల్లో పలుచోట్ల పశుపెంటలు, దొడ్లు వుండేవి. మొగలి పెంట, పులగూర పెంట, గొల్లోళ్ళ రచ్చ. తిమ్మయ్య గుంట, ఎర్రిగుంట్ల, పెద్ద బండ్ల చేను మొదలైన ప్రాంతాలు వుండేవి. ఇప్పటికీ తిరుమలలోని శ్రీవారి ఆలయంలోని తలుపుల్ని గొల్లవారే తెరిచే ఆచారాన్ని మనం గమనించవచ్చు.

ఆనాడు దట్టమైన అటవీ ప్రాంతంగా, కీకారణ్యంగా పేరు గాంచిన శేషాచలం అడవులు ఏనుగులు, చిరుతపులులు, ఎలుగు బంట్లకు నిలయంగా వుండేవి. యానాదుల జీవనానికి అడవే ప్రధాన ఆధారంగా నిలిచేది. అడవుల్లో నిరంతరంగా కురిసిన వర్షాలు, వరదల కారణంగా శేషాచల ప్రాంతంలోని నైసర్గిక స్వరూపాల్లో కూడా మార్పులు వచ్చాయి.

### సహజ సిద్ధ శిలా తోరణం

తిరుమలలోని ఆనంద నిలయానికి 1.5 కిలోమీటర్ల దూరంలో వున్న తిరుమల శిలాతోరణం ఏర్పడ్డానికి వెనుక ఎంతో పరిణామక్రమం వుంది. తిరుమల ఏడు కొండల్లోని ఏడవ కొండపైన ఈ తోరణం దర్శనమిస్తుంది. ఇది పూర్తిగా క్వార్ట్జైట్‌రాయితో నిర్మితమైనది. సహజ భౌగోళికాంశం అయిన ఈ శిలాతోరణం 150 కోట్ల సంవత్సరాలనుండి ప్రకృతి వైపరీత్యాలను తట్టుకొని నిలవగలిగి వుండడం విశేషం. శిలాతోరణం పొడవు 25 అడుగులు. ఎత్తు 10 అడుగులు వుంది. దీనిని 1977లో జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియావారు కనుగొన్నారు. నిశ్చల చిత్రంగా వున్న ఈ భూమిపైన ఏర్పడిన వాతావరణ పరిస్థితుల వలన దాదాపు

(మిగతా 3వ కవరులో...)







(2వ కవరు తరువాయి)



250 కోట్ల సంవత్సరాలకు పూర్వమే ఈ శిలలు నిర్మాణం చెందినట్లు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. శిలాతోరణం ప్రక్కనే చక్రతీర్థం అనే పేరుతో వున్న ప్రదేశంలో పెద్దవాగు ప్రవహిస్తోంది. అక్కడే కొద్దిపాటి ఆధారంతో నిల్చొని వున్న మరో పెద్ద బండరాయి కూడా వుంది. ఇవన్నీ ఏర్పడడానికి అప్పట్లో సంభవించిన భారీ నీటి ప్రవాహాలే కారణంగా చెప్తారు. కాలినడకన నడకసాగిస్తే తిరుమల మొదటి ఘాట్‌రోడ్డుకు సమీపంలోనూ పైకప్పుకూలిన శిలా తోరణం మరొకటి కన్పిస్తుంది.

ప్రపంచంలోని అరుదైన శిలాతోరణాలలో తిరుమల శిలాతోరణం మూడవదిగా నిర్ణయించారు. అమెరికాలోని ఉటా సమీపంలో వున్న ఆర్చెస్ ఆఫ్ నేషనల్ పార్క్‌కు చెందిన లాండ్ స్కేప్ ఆర్చ్ ప్రపంచంలో మొదటి స్థానాన్ని ఆక్రమిస్తోంది. దీని పొడవు దాదాపు 300 అడుగులు. అలాగే ఇంగ్లాండ్‌లోని డార్ల్టాడియన్ శిలా నిర్మాణం రెండవ స్థానంలో వుండగా, తిరుమలలోని శిలాతోరణం మూడవస్థానాన్ని పొందుతోంది.

అమెరికాలోని మరిన్ని శిలా తోరణాల గురించి నేచురల్ ఆర్చస్ అండ్ బ్రిడ్జెస్ సొసైటీ (NABS) పరిశోధనలు చేస్తోంది. అరిజోనాలోని టొరంటో శిలాతోరణం 150 అడుగుల పొడవు, 183 అడుగుల ఎత్తు కలిగి వుంది. అక్కడే వున్న రెయిన్‌బో తోరణం 275 అడగుల పొడవు, 290 అడుగుల ఎత్తు కలిగి వుండడం మరో విశేషం. ఈ శిలాతోరణాలు మాత్రమే తిరుమలలోని సహజ శిలా తోరణంతో భౌగోళికంగా సరితూగగల చరిత్ర కలిగి వున్నాయి. జల ప్రవాహపు ఒరిపిడి చర్యలు, ఉధృతమైన వాతావరణం శిధిలత్వం కారణంగానే ఈ శిలాతోరణాలు తయారయ్యాయి. తిరుమల తోరణాన్ని ఎపార్చియన్ అసహజతగా భౌగోళిక చరిత్రలో దీనికి ప్రత్యేక స్థానం కేటాయించారు.





## పరిశోధనలు జరగాలి

శేషాచలం అడవుల పరిసర ప్రాంతాల్లో ఇలాంటి శిలా తోరణాలు మరిన్ని బయటపడటానికి అవకాశం వుంది. అయితే పరిశోధనలు జరగాల్సివుంది. తలకోనకు దాదాపు పది కిలోమీటర్ల దూరంలో వున్న వేయిలింగాలకోన నుంచి ప్రారంబమై తల కోనలో రెండువందల అడుగుల నుంచి జలపాతంలా కురుస్తూ చివరికి వాగుల రూపంలోనూ, సెలయేళ్ళ రూపంలోనూ ఎనిమిది కిలోమీటర్లు ప్రవహిస్తూ సిద్దుల గంటి చెరువులో కలిసే ప్రవాహాలు వున్నాయి. వీటి వెంబడి సర్వేచేస్తే మరిన్ని శిలా తోరణాలు కనిపించే అవకాశం వుంది. అలాగే శేషాచలం కొండల్లోనే కడపజిల్లా రైల్వే కోడూరుకు పశ్చిమంగా 11 కిలోమీటర్ల దూరంలోనూ 244 అడుగుల ఎతైన గుంజన జలపాతం ప్రాంతంలోనూ శిలాతోరణాల ఉనికిపై పరిశోధనలు జరగాల్సివుంది. శ్రీ వేంకటేశ్వర అభయారణ్యం పరిసర ప్రాంతంలోనూ 'సర్వే నిర్వహించి ప్రాచీన శిలా తోరణాలపై సమగ్ర అధ్యయనం జరిపి వాటిని వెలుగులోకి తీసుకురావాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## రక్షించుకోవాలి

మన దేశంలో వున్న ఏకైక అరుదైన సహజ శిలాతోరణాన్ని రక్షించుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. తిరుమల తోరణం కేవలం రెండు అడుగుల మందాన్ని మాత్రమే కలిగి వుంది. దానికి కూడా పైకప్పులో పగుళ్ళు ఏర్పడ్డాయి. నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే రానున్న కాలంలో ఈ తోరణం మిగలక పోవచ్చు. దీనిపై వెంటనే స్పందించి రక్షించుకోవాల్సిన అవసరం వుంది.

**- వేంపల్లి గంగాధర్**










# అందాలకోన - తలకోన

"సహజమైన ప్రకృతి గురించి మనకు ఎవరో పాఠాలు చెప్పనవసరం లేదు. మాటల కందని భావాలను అవి అందంగా, అపూర్వంగా, అపురూపంగా ఆవిష్కరిస్తాయి. చెట్ల కొమ్మల సందుల్లోంచి ప్రభాత కిరణాలు కురవడం, పచ్చని వెచ్చని ప్రకృతి పాట, పక్షులు రెక్కలు విదిల్చి గగనానికి ఎగరడం.. వేకువ గీసిన అపురూపదృశ్యం. అరణ్యాల హరిత గీతాలకు, ప్రవహించే సెలయేటి గలగలలు, పయనించే పక్షి పల్లవులు, చెంగున దూకే జలపాతాల చరణాలు, అడవిపూల అందాల ప్రబంధాలు, సప్తవర్ణ శోభితమైన హరివిల్లుల సరిగమలు, కోనలో కోకిల రాగాల గీతాలాపన, వసంతం వనంలో పరవశిస్తూ... పరిమళిస్తున్న వేళ... ప్రకృతిని చుంబించే గీతం... కోన వీణ పలికించే సంగీతం.. 'తలకోన'. శేషాచలం కొండ బండల మాటున విప్పారిన అడవి పుష్పం 'తలకోన'. ప్రకృతివైపు మళ్ళండి అంటూ నినదించే సుందర స్వప్న రాగం 'తలకోన'." చిత్తూరు జిల్లా తిరుపతికి సమీపంలో గల వాయల్పాడు తాలూకాలోని నెరబైలు గ్రామం పరిధిలో వుంది 'తలకోన'. శ్రీ వేంకటేశ్వర అభయారణ్యం రక్షణలో వుంటూ ఆహ్లాదపరుస్తోంది. 200 అడుగుల ఎత్తునుంచి కుప్పించి దూకే జలపాతం యిక్కడి ప్రధాన ఆకర్షణ.

### సిద్ధోదర తీర్థం

తలకోనకు దాదాపు పది కిలోమీటర్ల దూరంలో వున్నటువంటి వేయిలింగాల కోన నుంచి ప్రారంభమయ్యే ఒక తీర్థం తలకోనలో సుమారు రెండు వందల అడుగుల ఎత్తు నుంచి జలపాతంగా పడుతూ వుంటుంది. ఈ తీర్థాన్ని 'శిరోద్రోణ తీర్థం' అని అంటారు. దీనినే 'సిద్ధోదర తీర్థం' అని కూడా పిలుస్తారు. సెలయేళ్ళ రూపంలోనూ, వాగులరూపంలోనూ ఈ విధంగా ప్రవహిస్తూ సాగే తీర్థం తలకోన అడవుల్లో సందడి చేస్తూ, ఆహ్లాదకరంగానూ, స్వచ్ఛంగానూ ప్రవహిస్తూ, చివరకు దాదాపు ఎనిమిది కిలో మీటర్ల దూరంలో వున్న 'సిద్ధలగంటి' చెరువులో కలుస్తుంది. పూర్వీకులు తలకోన నుంచి కర్నూలు జిల్లా వరకు వున్న కొండల వరుసను ఆదిశేషుని పవళింపుతో పోల్చారు. శిరోభాగం వున్న ప్రాంతం కాబట్టి ఇది 'తలకోన' గా పిలువబడుతున్నట్లు ఒక అభిప్రాయం వుంది. శేషాచలం కొండల్లోనే తిరుమలకు వెనుకవైపుగా ఈ తలకోన వుంది. పశ్చిమం వైపు నుంచి తిరుమలకు తలవాకిలిగా ఉన్నందువల్ల తలకోన మీద ఈ అభిప్రాయం ఏర్పడింది.

### సిద్ధేశ్వర స్వామి ఆలయం

తలకోనలోకి ప్రవేశించగానే జలపాతం కొండ క్రింద భాగానే విశాలమైన స్థలంలో దట్టమైన చెట్ల నీడల్లో నిర్మితమైన అత్యంత పురాతనమైన సిద్ధేశ్వర స్వామి ఆలయం కనిపిస్తుంది. ఈ స్వామి వారి సన్నిధిలోనే తీర్థం వుండడం కారణంగా తలకోనకు విచ్చేసే భక్తులు పైనున్న తీర్థంలో పవిత్ర స్నానాలు ఆచరించి వచ్చి క్రింద కొలువైవున్న సిద్ధేశ్వరుణ్ని పూజిస్తారు. సిద్దేశ్వరుని మహిమకారణంగా సిద్ధించిన తీర్థం కాబట్టి దీనిని 'సిద్ధోదర తీర్థం' అంటున్నట్లు కథనం. ప్రతి సోమవారం నాడు భక్తులు యిక్కడికి పెద్ద సంఖ్యలో విచ్చేస్తారు. అలాగే శివరాత్రి సందర్భంగానూ ఈ తలకోనకు ఎక్కువ మంది భక్తులు విచ్చేసి పూజలూ, పునస్కారాలూ జరిపిస్తారు. రాత్రంగా జాగరణ చేసి జలపాత స్నానం ఆచరిస్తారు. దీని వలన పాపాలు ప్రక్షాళన చెంది పవిత్రులుగా తయారవుతామని భక్తుల నమ్మకం.

### ఎన్నో విశేషాలు

తలకోనలో అరుదైన వృక్షజాతుల్లో తీగ జాతికి చెందిన అతి పురాతన తీగ కూడా కనిపిస్తుంది. ఎత్తైన చెట్లకు చుట్టుకొని ఆ చెట్ల కణజాలాన్ని బలంగా స్వీకరించి, వాటిని కూల్చే తీగ జాతి చెట్లు ఇక్కడ కనిపిస్తాయి. అలాగే తలకోన పైన ఆకాశకోన కూడా దుర్భేద్యంగా ఉండి ఆకట్టుకుంటుంది. ఇలాంటి ఎన్నో విశేషాలు తలకోనకే సొంతం.

ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక, డిసెంబర్ 2002.









### శేషాచలం కొండల్లో..

మన రాష్ట్రంలో మొదటి సహజసిద్ధమైన ఏకైక జాతీయ పార్కు శ్రీ వేంకటేశ్వరా నేషనల్ పార్క్. ఇది కడప-చిత్తూరు జిల్లాల సరిహద్దు అడవుల్లో సుమారు 354 చదరపు కిలో మీటర్లు పరిధిలో విస్తరించి వుంది. ఇది 1985లో ఏర్పాటు చేయబడింది. ఈ నేషనల్ పార్క్‌లో 1500 రకాల వృక్షజాతులు, 1200 రకాల పక్షి జాతులు వున్నాయి. ఎర్ర చందనం ఈ అడవుల్లో లభించే ఖరీదైన సంపద. 120 సంవత్సరాల క్రితమే అంతరించి పోయిన జాబితాలోకి చేరిన బంగారుబల్లి (గోల్డెన్ గెకో) ఈ అభయారణ్యంలోనే లభించింది. 1652లో బాప్టిస్ట్ ట్రావనీర్ అనే ఫ్రెంచి దేశస్తుడు ఈ శేషాచలం కొండల్లో పర్యటించి అరుదైన వింతల్ని, విశేషాల్ని తన రచనల్లో వర్ణించాడు. 1950లో అరుదైన జాబితాలోకి చేరిన చీటా కూడా ఈ అడవుల్లోనే సంచరించినట్లు ఆధారాలున్నాయి. అరుదైన జంతు సంపదగా గుర్తించిన దేవాంగ పిల్లి, బెట్టుఉడత, మూషిక జింకల్ని అభయారణ్యంలో రక్షిస్తున్నారు. అభయారణ్యం పరిధిలోని గుండాలకోన, గుంజన జలపాతం, కపిల తీర్థం, తుంబురు తీర్థం, రామకృష్ణ తీర్థం, సీతమ్మ తీర్థం ప్రకృతి పచ్చదనానికి నిలయంగా, స్వచ్ఛంగా విరాజిల్లుతున్నాయి. వీటిల్లో ప్రత్యేకంగా చెప్పుకోదగ్గదే తలకోన జలపాతం.

### ఎకో టూరిజం లోనూ..!

ప్రకృతి సౌందర్యాన్ని చెక్కుచెదరకుండా పరిరక్షించేందుకు జలపాతాలు, పచ్చని చెట్లు, వన్య ప్రాణులుగల అటవీ ప్రాంతాలను 'ఎకో-టూరిజం' గా మన రాష్ట్ర ప్రభుత్వం అభివృద్ధి చేస్తోంది. రాష్ట్రంలో అయిదు చోట్ల ప్రయోగాత్మకంగా పర్యాటకాభివృద్ధి శాఖ అమలు చేస్తున్న ప్రాజెక్టుల జాబితాలోకి 'తలకోన' చేరడం విశేషం. శిఖరాల అధిరోహణ, పిక్నిక్‌లు, సైక్లింగ్ వంటి అనుభూతులకు త్వరలోనే 'తలకోన' సిద్ధం కాబోతోంది. కాలుష్యానికి, నగరీకరణకు దూరంగా ప్రకృతి ఒడిలో పరవశించాలని తపించేవారు తప్పనిసరిగా సందర్శించాల్సిన స్థలం 'తలకోన'. పచ్చటి ప్రకృతి అందాలను ఆస్వాదిస్తూ అనుభూతులను ఇతరులతో కలిసి పంచుకునే అరుదైన అవకాశం 'తలకోన' సందర్శనతో లభిస్తుంది.

### కలుషితం లేని పర్యావరణం

తలకోనకు వెళ్ళే పర్యాటకులు అక్కడి ప్రకృతిలో పచ్చని అందాల్ని, ఆనందాల్ని అందుకోండి. ఆస్వాదించండి. అంతేగానీ వాటికి ప్రమాదాన్ని గానీ, ముప్పుగానీ కల్గించకండి. మనం మన భావితరాల కోసం కలుషితం లేని పర్యావరణం అందించుదాం.

### ఎలా వెళ్ళాలి..!

తిరుపతి 40కిలో మీటర్ల దూరంలో వున్న తలకోనకు తిరుపతి నుంచి సరాసరి బస్సులు వున్నాయి. అయితే బస్సు సౌకర్యం ఎక్కువ సార్లులేదు. కాబట్టి తలకోనకు వెళ్ళాలనుకున్న తర్వాత  రాష్ట్ర రవాణశాఖ వారి కౌంటర్లో బస్సు సమయాలు ముందుగా తెలుసుకోవడం ఉత్తమం.

తలకోనకు డైరక్టుగా బస్సు దొరకని పరిస్థితి కలిగితే తిరుపతి నుంచి పీలేరు, మదనపల్లె, హిందూపురం వైపు వెళ్ళే బస్సు ఎక్కి భాకరాపేటలో దిగి అక్కడి నుంచి ఆటోల ద్వారా తలకోన చేరుకోవచ్చు. భాకరాపేట నుంచి తలకోనకు సుమారు ఇరవైనాలుగు కిలోమీటర్ల దూరం వుంది.

మరో ముఖ్యవిషయం ఏమిటంటే బస్సు గానీ, ఆటోలు గానీ, టాక్సీ గానీ తలకోన లోపలిదాకా వెళ్ళలేవు.. ఆగిన ప్రాంతం నుంచి దాదాపు ఒక కిలోమీటరు దూరం అందమైన ప్రకృతి వేసిన అడవి దారి నుంచి తలకోనకు నడిచి వెళ్ళాల్సిందే.

- వేంపల్లి గంగాధర్

## కవర్ స్టోరి

కాలంతోపాటు చరిత్ర కరిగిపోతోంది
ప్రసిద్ధ కోటలు బీటలు వారుతున్నాయి
శాసనాలు రాతి బండలవుతున్నాయి
కట్టడాలు కుప్ప కూలి పోతున్నాయి
నాటి శిల్పాలు నేడు శిథిలాలుగా మిగిలాయి
విద్రోహుల డేగ చూపు నీడల్లో చరిత్ర విల విల లాడుతోంది.
నిధుల వేట పేరుతో బలవంతుల చేతుల్లో
చరిత్ర భస్మం అవుతోంది
మన వాళ్ళే మన చరిత్రను కొల్లగొట్టి
విదేశీయులకు అమ్మేస్తున్నారు.
చరిత్రతో వ్యాపారం చేస్తున్నారు.



# చరిత్రను కాపాడండి

మనకు చరిత్ర వుంది. ఆ చరిత్రను కాపాడుకునే సంస్కృతి మాత్రం లేదు. శాతవాహనులు, కాకతీయులు, విజయనగరరాజులు, మౌర్యులు, పల్లవులు, గుప్తులు, తెలుగు చాళుక్యులు, రాష్ట్రకూటులు, రేనాటి చోళులు, బాదాములు, మల్లరాజులు, గోల్కొండ నవాబులు, హైదరాలీ, టిప్పుసుల్తాన్, ఆర్కాటినవాబులు, మొగలులు, మరాఠాలు, పాలెగాండ్రు, ఆంగ్లేయులు... ఎందరో ఇక్కడ చారిత్రక పాత్రలయ్యారు. గతించిన కాలానికి తార్కాణంగా అప్పటి కట్టడాలు, శిల్పాలు, స్థలాలు ఎన్నో తెలుగునేల గుండె పొరల మధ్య [illegible] కగా, ప్రతిరూపాలుగా నిలిచిన ఈ చరిత్ర ఆధారాలు ఒక ప్రక్క అధికారుల నిర్లక్ష్యానికి, మరో ప్రక్క విద్రోహుల నిధుల వేటకూ గురై నామ రూపాలు లేకుండా పోతున్నాయి. పరిశోధనల ద్వారా తవ్వకాల ద్వారా బయటపడ్డ చారిత్రక ఆధారాలు నేడు సరైన ఆదరణ లేక మౌనంగా రోదిస్తున్నాయి. ఎన్నో పురాతన కట్టడాలు, స్థలాలు, శిల్పాలు, శాసనాలు గుర్తింపునకు నోచుకోక మరుగున పడి పోతున్నాయి. 1960లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'పురావస్తు ప్రదేశాల పరిరక్షణ చట్టం' ఏర్పాటుచేసి దాదాపు ఐదు వందల ప్రాంతాలను పరిరక్షించాలని ఒక జాబితా రూపొందించినప్పటికీ అవన్నీ కేవలం కాగితాలకే పరిమితం అయ్యాయి. నానాటికీ చరిత్ర సమాధి అవుతున్నా పట్టించుకునే వారు లేరు. చరిత్ర పుటల్ని తిరిగేసేందుకు ఆ కట్టడాల శకలాలే సాక్ష్యం అనే విషయం మరచి పోతున్నారు.

గత చరిత్రకు ఆనవాళ్లుగా మిగిలిన ఎన్నో కట్టడాలు, కోటలు కరిగి పోతున్నాయి. తరిగి పోతున్నాయి. నామ రూపాలు లేకుండా నశించి పోతున్నాయి. అయినా పట్టించుకునే వారెవరు? పరిరక్షించే వారెవరు? అనంతపురం జిల్లా గుత్తి కోటలో ఎక్కడ చూసిన గోతులు కనిపిస్తాయి. కంకర రాళ్ళ కోసం కోటను తవ్వి పోస్తున్నారు. దాదాపు 4250 అడుగుల ఎత్తులో నిర్మించిన ఈ కోట చాళుక్యులు, హరిహర రాయులు, శ్రీకృష్ణదేవ రాయులు, టిప్పు సుల్తాన్ వంటి వారి ఆధీనంలో ప్రకాశించింది. నేడు ఈ వైభవం విహీనం అయింది. కోటను చూడడానికి వచ్చే వాళ్ళు వారి పేర్లను చెక్కడం, ఏవైనా దొరుకుతాయేమోనని గోతులు తీయడం వల్ల ఒక శిధిల భవన సముదాయంగా మారుతున్నది.

రాయలసీమ జిల్లాలకే తలమానికంగా భాసిల్లిన కడప జిల్లాలోని గండికోటను క్రీస్తు శకం 1106లో కాకతీయ రాజులు నిర్మించారు. 14వ శతాబ్దంలో గండికోట ఢిల్లీ సుల్తానుల వశమైంది. తర్వాత మూడు శతాబ్దాల పాటు విజయనగర రాజుల ఆధిపత్యంలో విరాజిల్లింది. దూర్పు దక్షిణం నాలుగున్నర మైళ్ళ విస్తీర్ణం కలిగిన కోట గోడ 101 బురుజులతో 40 అడుగుల ఎత్తుతో అభేద్యంగా వుంది. కాలక్రమంలో హైదర్‌అలీ, టిప్పుసుల్తాన్, నిజాం, కడప నవాబులు స్వాధీనం చేసుకుంటూ 1800లో బ్రిటీష్ వారి చేతికి అప్పగించారు. ఈ కోటలో నిరుపమాన శిల్పకళతో శోభిల్లే సన్నెందు దేవాలయాలు వున్నాయి. ఇప్పుడు కోట, కోటలోని దేవాలయాలు శిథిలావస్థకు చేరుకున్నాయి.

కోటను సందర్శకులు చేరుకోవడానికి సరైన దారి కూడా లేదు. మణులు, మాణిక్యాల కోసం కోట గోడలను, ఆలయాలను కొల్లగొట్టారు. దీంతో కట్టడాలు మరింత శిథిలమయ్యాయి. నిధి నిక్షేపాల కోసం ధ్వంసమయిన కోటల్లో నెల్లూరు జిల్లాలోని నావూరు కోట కూడా ఒకటి. క్రీ.శ. 1608లో విజ[illegible] అయిన వెలుగోటి యాచమనాయుడు ఈ కోటను నిర్మించాడు. విజయనగర రాజుల తర్వాత రాపూరు సీమ సేనాని హైదర్ ఉల్ ముల్క్ ఆధీనంలోకి వచ్చింది. ఎంతో చరిత్రవున్న రాపూరు కోట బురుజులు శిధిలమై పోయాయి. గతంలో యిక్కడ వున్న శాసనాలు కూడా నిధుల మార్గాలు చూపే ఫలకాలుగా భావించి కొందరు దుండగులు తస్కరించినట్లు తెలుస్తోంది. కోటలోని రాళ్ళ కూడా గృహ నిర్మాణాలకై వాడుకుంటున్నారు. రహస్య తవ్వకాలు కూడా చాలా చోట్ల జరిపారు.

కడప జిల్లాలోని సిద్దవటం కోటకు చరిత్రలో ప్రత్యేక స్థానం వుంది. సిద్ధవటాన్ని రాజధానిగా చేసుకుని మొత్తం 18 రాజవంశాలు దీనిని పరిపాలించారు. క్రీ.శ. 1233లో ఈ కోటను మట్ల రాజులు నిర్మించినట్లు తెలుస్తోంది. శిధిలావస్థలో వున్న సిద్దవటం కోట అందులోని బురుజులు, కోటలో నుంచి ఏటిలోకి తీసిన సొరంగ మార్గం, మహమ్మదీయుల సమాధులు, దర్గా మొదలైనవి ఆనాటి చరిత్రకు అద్దం పడతాయి. కోటలో మూడదగిన అతి పెద్ద నంది ఇటీవల నిధుల కోసం వచ్చిన వారిచే ధ్వంసం అయింది. 1904లో ఇద్దరు భార్యలతో వున్న సూర్యుడి విగ్రహం లభించినట్లు రికార్డుల్లో వున్నప్పటికీ ఆ విగ్రహం లేదు. కోటలోని శివలింగం కింద నిధి వుందని తెలిసి ఆరు అడుగుల ఎత్తు గల శివలింగాన్ని గది నుంచి బయటకు తెచ్చి వుంచారు. కోటలోని శిలా శాసనాలకు సరైన రక్షణ లేనందున సందర్శకులు అడ్డంగా చెక్కి వేశారు. దీంతో శాసనాలు బండరాళ్ళలాగా మిగిలి పోయాయి. కృష్ణా జిల్లాలోని కొండపల్లి కోట క్రమక్రమంగా కనుమరుగై పోతోంది. క్రీ.శ. 1360లో అనవేమారెడ్డి నిర్మించిన ఈ కోటలోని పురాతన నిర్మాణాలలోని రాళ్ళు అక్రమంగా తరలిపోతున్నాయి. ఆనాడు కోట రక్షణ కోసం నిర్మించిన బాహ్య ప్రాకారపు గోడ అక్రమ ఆక్రమణలకు, గృహ నిర్మాణాలకు గురవుతోంది. వీర పోరాటాలతో చరిత్ర సృష్టించిన బొబ్బిలి కోటకు కూడా అవస్థలు తప్పడం లేదు. గత చరిత్రకు సజీవ సాక్ష్యంగా నిలిచిన బొబ్బిలి కోటలోని రంగారావు, తాండ్ర పాపారాయుడి విగ్రహాల సమీపంలో చెత్తా చెదారాలతో పాటు, మూత్ర విసర్జనలకు చోటుగా చేసుకుని మన వాళ్ళు కూడా చరిత్ర సృష్టిస్తున్నారు. అనంతపురం జిల్లాలోని పెనుకొండ కోటలో గుప్త నిధులున్నాయని భావించి తవ్వకాలు కూడా జరిగాయి. యిక్కడి ప్రాచీన దేవాల యాలను కూడా వదిలి పెట్టకుండా ధ్వజస్తంభం కింద, గర్భ గుడిలోని విగ్రహాల క్రింద నిధుల కోసం గునపాలతో తవ్వారు.

రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లోని గోల్కొండ కోటకే రక్షణ లేదు. కోట ప్రాంతంలో చాలా భాగం భూకబ్జకు గురైన విషయం తెలిసిందే. కోటలోని రాళ్ళను సైతం పట్టుకెళ్ళి ఇళ్ళు నిర్మించుకున్నారు. రాష్ట్ర రాజధానిలోని ప్రాచీన కట్టడాలకే సంరక్షణ లేకపోతే మారుమూల ప్రాంతాల్లోని చారిత్రాత్మక కట్టడాలకు ఏ మాత్రం హామీ ఇవ్వగలరు?

## ఇదీ విజయనగర వైభవం!

చరిత్రలో విజయనగర రాజులకు ఎంతో ఖ్యాతి వుంది. వారు నిర్మించిన కట్టడాలు, శాసనాలు యిప్పుడు ధ్వంసమవుతున్నాయి. కర్నాటక రాష్ట్రంలోని బళ్ళారికి 70 కిలోమీటర్ల దూరంలో 'హంపి' వుంది. విజయనగర రాజ్యానికి రాజధానిగా స్వర్ణయుగాన్ని అనుభవించిన హంపి నేడు ఇటు అధికారుల నిర్లక్ష్యానికి, అటు విద్రోహుల నిధుల వేటకు బలవుతోంది. తవ్వకాల ద్వారా, పరిశోధనల ద్వారా బయట పడ్డ చరిత్ర చెరిగి పోతోంది యిక సప్త స్వరాలు పలికే స్తంభాలు సైతం వచ్చిన పర్యాటకుల పరిశోధనల వల్ల మూగబోతున్నాయి. గతంలో రాతి రథంపై గోపురం వుండగా నేడు అది నేల కూలింది.

అనంతపురం జిల్లాలోని హిందూపూర్‌కు పది హేను మైళ్ళ దూరంలో వున్న లేపాక్షి కూడా ప్రభుత్వ ఆదరణకు నోచుకోవడం లేదు. విజయనగర రాజు వంశస్థులలో ఒకరైన అచ్యుత దేవరాయలు 1530లో యిక్కడ ఆలయ నిర్మాణం చేశారు. యిక్కడి శిల్పకళకు శతాబ్దాల చరిత్ర వుంది.

వెల్లూరు జిల్లాలోని ప్రభుగిరిపట్నం దేవాలయంకు నాలుగు శతాబ్దాల చరిత్ర వుంది. నేడు ఇది నిధుల వేటలో శిధిలమై పోతున్నది. విజయనగర చక్రవర్తులకు సామంతరాజుగా వుండే ప్రభాకర వర్ధనుడు క్రీ.శ. 1600 శతాబ్దంలో ఈ ఆలయాన్ని నిర్మించారు. గతంలో పశువుల కాపరికి ఈ ప్రాంతంలో ఒక బంగారు విగ్రహం దొరికింది. దీంతో ఈ ప్రాంతంలో నిధులు వున్నాయనే విషయం ప్రచారం అయింది. అనేక మంది నిధుల కోసం, ఖరీదైన విగ్రహాల కోసం తవ్వకాలు కూడా చేశారు. ఇష్టమొచ్చినట్టు గోతులు తవ్వడం వల్ల దేవాలయం మరింత శిధిలమైంది. ప్రాచీన 'రామాలయం' గర్భ గుడి కప్పు కూలిపోయింది. మూల విరాట్టును మాయం చేశారు. ఇక్కడే వున్న పెరుమాళ్ళ స్వామి ఆలయం కూడా ధ్వంసమైయింది. యిక్కడ నిధుల కోసం చేసిన ప్రయత్నానికి నిదర్శనంగా గోతులు వున్నాయి. ఈ ప్రాంతంలోని దేవాలయాల్లో చాలా చోట్ల విగ్రహాలను పెకిలించి పక్కన పడేశారు. అనంతపురం జిల్లా రాయదుర్గం పరిధిలోని ఏళంజి, వీరాపురం గ్రామాలకు విజయనగర రాజుల కాలంతో ఎంతో అనుబంధం వుంది. ఏళంజి గ్రామం విజయనగర రాజులతో గొప్ప వైభవాన్ని అనుభవించింది. కాలంతోపాటు యిక్కడి చరిత్ర కూడా కరిగిపోతోంది. అందుకు తార్కాణంగా నేటికి ఏళంజి గ్రామంలో ఇసుక దిబ్బల కింద శిధిలాలు కనిపిస్తాయి. నాటి వైభవానికి సాక్షిగా ఎన్నోశిథిల భవనాలు మిగిలిపోయాయి.

రాయల కాలంలో పాలెగాండ్ల ఆధీనంలో వుండి చరిత్ర సృష్టించిన వీరాపురం నేడు వెలవెల పోతోంది. అప్పట్లో ఈ గ్రామం చుట్టూ ఏడు ప్రాకారాలు వుండేవి. నాటి శిథిలాలు నేటికీ మనకు కనిపిస్తాయి. యిక్కడ వున్న శిలాఫలకం కూడా ఎక్కువ భాగం శిధిలమైంది. ఈ ప్రాంతాల్లోని రాళ్ళను, ఇటుకలను, శిల్పాలను కొందరు తరలించుకుపోగా, మిగిలినవి మాత్రం మౌనంగా రోధిస్తున్నాయి. అనంతపురం జిల్లా తాడిపత్రి ప్రాంతంలోని యల్లనూరు, యాడికి, పెద్దపప్పూరు, పుట్లూరు, తాడిపత్రి ప్రాంతాల్లోని ప్రాచీన కట్టడాలు ఆదరణ కరవై భూగర్భంలో కలిసి పోతున్నాయి. శిథిలమవుతున్న శిల్పసంపద కోవలోనే గోరంట్ల పరిధిలోని ప్రాచీన మాధవరాయ దేవాలయం కూడా వుంది. తమిళనాడులోని మహాబలిపురంలో పల్లవుల కాలం నాటి శిల్పాలను, ప్రదేశాలను పరిరక్షిస్తున్నారు తప్ప విజయనగరం కాలం నాటి కోటలను సైనా, మండపాలసైనా శ్రద్ధ చూపడం లేదు. యిక్కడ ఆరో శతాబ్ద కాలం నాటి స్నానఘట్టం వుంది

ప్రకాశం జిల్లాలోని 'కంభం చెరువు'కు చరిత్ర వుంది. క్రీ.శ. 15వ శతాబ్దంలో గజపతుల ఆధిపత్యంలో ఈ ప్రాంతం వుండేది. రాయలు రుచీదేవిని రెండవ భార్యగా యిక్కడే వివాహం ఆడినట్లు చరిత్రకారులు అంటారు. నాటి నవాబుల స్మృతి మందిరాలు, బురుజులు ఎన్నో ఈ ప్రాంతంలో ఆలనా పాలనా కరువై కడు దీనంగా నలిగి పోతున్నాయి. చారిత్రాత్మక కట్టడాలకు, శిల్పకళా నైపుణ్యానికి తార్కాణరిగా నిలిచిన ఎన్నో కట్టడాలు చీకట్లో కలిసి పోతున్నాయి.

## ముక్కలవుతున్న శిలా శాసనాలు

ఎన్నో శాసనాలు ఎండకు ఎండి, వానకు తడుస్తూ ముక్క చెక్కలై పోతున్నాయి. రాబోయే తరాల వారికి గత చరిత్ర ఆనవాళ్ళు మిగలకుండా పోతున్నాయి. అనంతపురం జిల్లా కదిరి పట్టణానికి రెండు కిలోమీటర్ల దూరంలో వున్న ప్రాచీన లఘులమ్మ ఆలయంలో 'శిలాశాసనాలు' బయల్పడినా, పట్టించుకునే వారు లేరు. యిక్కడ గుప్త నిధుల కోసం పెకలించిన రాళ్ళ మనకు కనిపిస్తాయి. కొండలోని గుహలో సప్త ఋషుల విగ్రహాలు వుండాల్సి వుండగా, ఆ విగ్రహాల్లో మూడు విగ్రహాలు దొంగల పాలయ్యాయి. కాల గర్భంలో కలిసి పోతున్న 'కదిరి' శిలా శాసనాలను చరిత్రకారులు, అధికారులు పట్టించుకోక పోవడం దురదృష్టకరం. కొందరు నిధుల కోసం గుంతలు కూడా తీశారు. ఆలయంలోని విగ్రహాలను పెకలించిన సందర్భాలు కూడా వున్నాయి. కర్నూలు జిల్లాలో చాలా చోట్ల శిలా శాసనాలు కోకొల్లలుగా లభిస్తుంటాయి. వాటి వివరాలు తెలియక వాటిని మామూలు రాళ్ళగానే భావించి నిర్లక్ష్యం చేస్తుంటారు. పత్తికొండ నియోజక పరిధిలోని కప్పట్రాళ్ల, రాజులమండేగిరి, కుంకనూరు, మద్దికెర, అటికెలగుండు... గ్రామాల్లో రోడ్లపై శిలాశాసనాలు పడి వున్నాయి. కొన్ని శిలాశాసనాలు పశువులను కట్టి వేయడానికి ఉపయోగించడం వల్ల వాటిపై వున్న అక్షరాలు అర్థం కాకుండా పోయాయి. అశోకుని 'పాలి' భాషలోని శాసనాలు సైతం జొన్నగిరి వద్ద రక్షణ లేకుండా పడి వున్నాయి. చారిత్రాత్మక విశేషాలను చాటి చెప్పే శిలా శాసనాలు బయట పడినా ప్రయోజనం లేకుండానే శిధిలమవుతున్నాయి.

## ఉనికి కోల్పోతున్న 'బౌద్ధారామాలు'

కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలోని బౌద్ధారామం ఉనికి కోల్పోతున్నది. బౌద్ధ సంస్కృతికి కీలక ప్రాంతంగా నిలిచిన ఈ ప్రాంతం నేడు రక్షణ కరవై స్మగ్లర్ల గుప్పిట్లో విలవిలలాడుతోంది. బౌద్ధ చరిత్రకు చిహ్నంగా వున్న విగ్రహాలను, కట్టడాలను కొందరు సందర్శకులు పగుల గొట్టి పాడు చేశారు. గతంలో బౌద్ధ స్తూపంపై కనిపించిన స్త్రీ, పురుష బొమ్మల చిత్రాలు నేడు కనిపించడం లేదు.

రాయలసీమలో బయల్పడిన తొలి బౌద్ధారామం కడప జిల్లాలోని బైరాగిగుట్ట. 1979లో యిక్కడ జరిగిన తవ్వకాల్లో 15 చిన్న సైజు బౌద్ధారాములు బయల్పడ్డాయి. క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దానికి చెందిన బౌద్ధారామాలుగా వీటిని గుర్తించారు. మరింత పరిశోధన చేస్తే మరిన్ని వివరాలు, స్తూపాలు బయల్పడే అవకాశం వుంది. పరిశోధన చర్యలు తీసుకోక పోగా కనీసం వాటిని రక్షించే ప్రయత్నం చేయడం లేదు. గత అసెంబ్లీ ఎన్నికల్లో ఈ బౌద్ధ ఆరామాల్లో భారీ సంఖ్యలో బాంబులు లభించాయి. విద్రోహుల వల్ల స్తూపాలు, గుహలోపలి భాగాలు శిధిలమైపోతున్నాయి.

చాలా చోట్ల ప్రాచీన దేవాలయాలకు ఆలనాపాలనా కరువ్వడంతో దేవాలయాల్లోని కీలక ప్రదేశాల్లో అక్రమ తవ్వకాలు జరుగుతున్నాయి. మరికొన్ని చోట్ల మూల విరాట్టుకే ముప్పు వాటిల్లుతోంది. శివాలయాల్లోని శివలింగాల కింద నిధులుంటాయనే నమ్మకంతో లింగాలను పెకలిస్తున్నారు. గుప్త నిధుల ఆనవాళ్ళు తెలుసుకోవడం కోసం శాసనాలను, నిర్మాణాల శిధిలాల పునాదులు తవ్వుతున్నారు. వరంగల్‌లోని కాకతీయుల కళా సంపద నిర్లక్ష్యం నీడలో నశించి పోతోంది. చరిత్ర జ్ఞాపక చిహ్నాలుగా ఉంటూ వున్న కళాఖండాలను పరిరక్షించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చిత్త శుద్ధితో కృషి చేయడం లేదు. పురావస్తు శాఖ నియమ నిబంధనలకు వ్యతిరేకంగా నిర్మాణాలు చేపట్టిన వారిపై చర్యలు తీసుకోవడం లేదు.

భావితరాల వారికి జాగరూకతతో చరిత్రను అందించాల్సిన బాధ్యతను విస్మరిస్తున్నారు. శిల్పాలలో అత్యంత అరుదుగా వుండే 'చతుర్ముఖ శివలింగ విగ్రహం' కడప జిల్లా రాజంపేట మండలంలోని మదనగోపాలపురం గ్రామంలో దిబ్బలో పడి వుంది. అలాగే లింగాల మండలంలోని కుందేలు చెర్లోపల్లి గ్రామం వద్ద అనూహ్య రీతిలో బయల్పడ్డ బిలం క్రీస్తు పూర్వం 2,500 సంవత్సరాల కిందటి చరిత్రను వివరిస్తున్నా అక్కడ యింతవరకు సరైన పరిశోధన లేదు. బిలంలో మట్టిపాత్రలు, పూసలు, చెక్కలు, రాతి పనిముట్లు, మట్టి మూతె దీపాలు తదితర వస్తువులు బయల్పడ్డాయి. వీటిని పరిశీలించిన శాస్త్రజ్ఞులు ప్రాచీన కాలం నుంచే ఈ ప్రాంతంలో మానవ సంచారం వున్నట్టు భావిస్తున్నారు. యిక్కడ యింకా తెలుసు కోదాల్సిన రహస్యాలు ఎన్నో వున్నాయి. కాకతీయ కళకు కాణాచిగా నిలిచిన ఎన్నో చారిత్రక కట్టడాలు శిధిలమవుతున్నాయి. ప్రాచీన కట్టడాలకు సందర్శకుల నుంచి కూడా ముప్పు వాటిల్లుతోంది. గోడల మీద, శిల్పాల మీద పేర్లు చెక్కడం వంటి చర్యలు చేస్తుండడం వల్ల విలువైన కట్టడాలు మరింత శిధిలావస్థకు చేరుకుంటున్నాయి. ప్రాచీన కట్టడాలు చరిత్రకు సజీవ సాక్ష్యాలు. ఈ ఆధారాలు సైతం అంతరించి పోతే రేపటి తరానికి చరిత్ర ఒక కట్టుకథగా మిగిలిపోయే ప్రమాదం వుంది.

— వేంపల్లి గంగాధర్

ఫొటోలు: పి.దశరథ్‌కుమార్, వి.గంగాధర్
(కవర్ పేజీ ఫొటోలు: టూరిజం పాలసీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ 1994 సౌజన్యంతో)




అతడి పేరు తిమ్మప్ప మునియప్ప. చిత్తూరు జిల్లా నూవు వంద పేటకు సమీపంలోని సువర్ణ ముఖీ నదికి కాలకృత్యాలు తీర్చుకోవడం కోసం వెళ్లాడు. అక్కడి ఇసుకలో మెరుస్తున్న విగ్రహం ఏదో కనపడింది. వెళ్లి చూస్తే ఇసుక లోపల మరిన్ని విగ్రహాలు వున్నట్లు తెలిసింది. సంతోషం. పట్టలేని ఆనందం. వాటిని అమ్మి సొమ్ము చేసుకోవాలని ఆరాటం. గుట్టు చప్పుడు కాకుండా ప్రాచీన సంపదను విదేశాలకు విక్రయించే ఒక ముఠాతో చేతులు కలిపాడు. అంతే ... ఎంతో విలువైన ప్రాచీన సంపద ... తరతరాల కళా సంస్కృతి ... తీరాలు దాటి పోవడానికి సిద్ధమైంది

అయితే పై సంఘటనలో తిమ్మప్ప వేసిన పథకం విజయవంతం కాలేదు. ఎస్.పి. రుద్రప్రతాప్ ఠాగూర్ రంగ ప్రవేశం చేసి ముఠాను మూసేశారు. అంతర్జాతీయ మార్కెట్‌లో రెండు కోట్లు విలువ చేసే తొమ్మిది పంచలోహ విగ్రహాలు ఈ సందర్భంగా స్వాధీనం చేసుకున్నారు. 16వ శతాబ్దానికి చెందిన కళాసంపదగా వీటిని గుర్తించారు. కడప జిల్లా ఓబులవారి పల్లె మండలం వై. కోట గ్రామ సమీపంలోని గుండాల కోనేశ్వర స్వామి దేవస్థానానికి చెందిన పంచలోహ విగ్రహాలను ఆలయ ధర్మకర్త వారసులు విక్రయిస్తుండగా గత సంవత్సరం నవంబర్‌లో తిరుపతిలో పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. వాటి విలువ సుమారు 15 లక్షల రూపాయలకు పైగా వుంటుందని అంచనా. మద్రాసుకు చెందిన ఓ మార్వాడికి విగ్రహాలను విక్రయించే ముందు శాంపిల్‌గా పార్వతిదేవి విగ్రహానికి వున్న జడను కోసి ఆ ముక్కను తీసుకెళ్లి చూపించారని పోలీసుల విచారణలో తేలింది.

## ప్రపంచ వ్యాప్త సమస్య

మ్యూజియాల నుంచి, దేవాలయాల నుంచి అతివిలువైన పురాతన విగ్రహాలు, ప్రాచీన సంపదలను విక్రయించడం అనేది ప్రపంచ వ్యాప్తంగా జరుగుతూనే వుంది. అందులోనూ భారత్, పాకిస్తాన్, నేపాల్, శ్రీలంక, బర్మా దేశాలలోనే ఎక్కువగా ప్రాచీన సంపద చోరీకి గురవుతోంది. విదేశాలలోని పలు మ్యూజియాల్లో వున్న విగ్రహాలలో దాదాపు 60 వేలకు పైగా విలువైనవి మన దేశం నుంచి తస్కరించబడినవే అంటే గుండెలు దడ పుట్టక మానవు. మన దేశం నుంచి విద్రోహులు స్మగ్లింగ్ చేసే ప్రాచీన కళా సంపద ముఖ్యంగా అమెరికా, స్విట్జర్లాండు, ఇంగ్లండ్, ఆస్ట్రేలియా దేశాలకు వెళ్తున్నట్లు తెలుస్తోంది. విదేశాల్లో వీటి దిగుమతులపై ఎలాంటి ఆంక్షలూ లేవు. ఈ మధ్య కాలంలో మన దేశం చేసిన ఆందోళనకు దారికొచ్చిన పశ్చిమ దేశాలు ప్రాచీన సంపదను రక్షించడానికై ఒక ఒప్పందంపై సంతకాలు చేశాయి.

విగ్రహాలను అమ్మే విద్రోహులు ముఠాలుగా ఏర్పడి ప్రాచీన సంపద వివరాలను సేకరించి వాటిని తస్కరించడానికి పథకాలు ఏర్పరుస్తారని బొంబాయిలోని పెద్ద ముఠాకు దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాల్లోని చిన్న చిన్న ముఠాలతో సంబంధాలు వుంటాయి. ఇక్కడి స్థానిక ముఠాలు ఎక్కడైనా ప్రాచీన సంపద కనపడితే వెంటనే దానిని స్వాధీనం చేసుకుని కొంత మొత్తానికి బొంబాయి ముఠాకి అందిస్తే వాళ్ళు విదేశీయులతో దీనికి నాలుగైదు వంతుల రెట్టింపు మొత్తం రాబడుతారని తెలుస్తోంది. బొంబాయిలోని మహాలక్ష్మి నగర్‌లో నివాసమున్న లాకేష్ లాంబాలు అంతర్జాతీయ స్థాయిలో ప్రాచీన కళాఖండాలను అక్రమంగా రవాణా చేస్తు గత సంవత్సరం మద్రాసులో విగ్రహాల అక్రమ రవాణా నిరోధక శాఖకు చిక్కారు. అతనికి మద్రాసు నగరంలో మోహన్, లక్ష్మీనరసింహన్ అనే ఏజెంట్లు వున్నట్లు కూడా పోలీసులు కనుగొన్నారు. తమిళనాడులోని తంజావూరు, పుదుకోటలలో దేవాలయ విగ్రహాలు దొంగతనం చేసి బొంబాయికి తరలించే వారు. కాలిఫోర్నియాకు 40 విగ్రహాలు, ఫ్రాన్స్‌కు ఒక విగ్రహంతో పాటు కోట్లాది రూపాయల విలువగల అనేక విగ్రహాలను అక్రమంగా రవాణా చేశారని పోలీసుల విచారణలో తేలింది.

## రాష్ట్రంలో పరిస్థితి

గత సంవత్సరం రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లోని ప్రాచీన సంపదను, అత్యంత ప్రాచీన విగ్రహాలను అపహరించి విదేశాలకు ఎగుమతి చేస్తున్న స్మగ్లర్ల ముఠాను విజయవాడ పోలీసులు అక్టోబర్‌లో అరెస్టు చేశారు. వీరివద్ద పట్టుబడిన విగ్రహాలలో కొన్ని 18వ శతాబ్దం కుతుబ్‌షాహీ కాలానికి చెందినవి కాగా మిగిలినవి 13, 14, 15 శతాబ్దాలకు చెందినవిగా గుర్తించారు. తాకితే లోహ శబ్దం ప్రతిఫలించే ఈ విగ్రహాలు 13వ శతాబ్దం కాకతీయుల కాలం నాటివిగా భావిస్తున్నారు. గతంలో హైదరాబాద్ – కాచిగూడాలోని ఒక లాడ్జిలో పురాతన విగ్రహాలను అమ్మేందుకు ప్రయత్నిస్తున్నారని తెలియడంతో నగర టాస్క్ ఫోర్స్ సిబ్బంది దాడి చేసి పట్టుకోవడంతో దాదాపు వేయి సంవత్సరాల ప్రాచీనమైన విగ్రహాలు, క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దం నాటి బుద్ధ శిలాలు వారి వద్ద దొరికాయి.

దొంగలు విక్రయిస్తున్న విగ్రహాలన్నీ 12వ శతాబ్దం నుంచి 18వ శతాబ్దం మధ్య కాలానికి సంబంధించినవి కావడం విశేషం. శ్రీ కృష్ణ దేవరాయల కాలం నాటి చాలా విగ్రహాలను స్మగ్లర్లు విదేశీయులకు అమ్మివేసినట్లు తెలుస్తోంది. గుంటూరు, ప్రకాశం, మహబూబ్‌నగర్ జిల్లాలలోని ప్రాచీన సంపదను విక్రయిస్తున్న నేరగాళ్లను గతంలో పోలీసులు పట్టుకున్న సంగతి తెలిసిందే. కడప జిల్లా నుంచి హైదరాబాద్ మీదుగా బొంబాయికి 400 సంవత్సరాల నాటి వెంకటేశ్వరుని విగ్రహాన్ని స్మగ్లింగ్ చేస్తున్నప్పుడు ఒక ముఠాను పోలీసులు గతంలో పట్టుకున్నారు.

# గుప్తనిధుల వేటలో శి

చరిత్ర ఇప్పుడొక
వ్యాపార వస్తువు.
ప్రాచీన కట్టడం అయితే చాలు
క్షణాల్లో అక్కడ తవ్వకాలు జరుగుతాయి
గుప్త నిధుల పేరుతో విధ్వంసం!
మనమే మన చరిత్రను
కుప్పకూల్చుకుంటున్న నీచ వైభవం
కాపాడుకోవాల్సిన వారసత్వాన్ని
విదేశీయులకు అమ్ముకుంటున్న వైనం
ఇదీ... నేటి చరిత్ర!

★★★

గతమెంతో ఘనకీర్తి. నాడు వైభవాన్ని పొందిన చరిత్ర నేడు కాల గర్భంలో కలిసిపోయి గతకాలపు స్మృతిగా మిగిలింది. ఆశ్చర్యపరిచే కట్టడాలు నేడు శిథిలాలు అవుతున్నాయి. పదును లేని చట్టాల కారణంగా కళాఖండాలు ఎన్నో ఎల్లలు దాటుతున్నాయి. నిధుల కోసం అన్వేషణలు జోరుగా సాగుతున్నాయి. వైభవాన్ని... కనుమరుగవుతున్న శిల్ప కళాసంపదను గురించి తెలుసుకుందాం. చరిత్రపైన మనిషి పగబట్టాడు. తన మూడో కన్ను తెరిచాడు. ఆ తర్వాత పరిణామాలేమిటో పరిశీలిద్దాం.

## గుప్తనిధుల వేట!

అధికారుల అశ్రద్ధ, నాయకుల నిర్లక్ష్యం కారణంగా గత చరిత్ర ఉనికిని, శిల్పకళా వైశిష్ట్యాన్ని చాటి చెప్పే శిలలు, శిల్పాలు, ప్రాచీన సంపదంతా గుప్తనిధుల వేట పేరుతో బలై పోతోంది. పురావస్తు శాఖ అధికారులు ఒకవైపు చరిత్రను పరిశోధిస్తూ, అలనాటి వైభవాలెన్నింటినో వెలుగులోకి తెచ్చేందుకు తవ్వకాలు సాగిస్తుండగా మరోవైపు విద్రోహులు తమ స్వార్థం కోసం గుప్తనిధుల వేటలో అపురూప శిల్పకళా సంపదకు తీవ్ర ముప్పు వాటిల్లుతోంది. చట్ట నిబంధనలకు పదును లేక, ఉన్నవాటిని సరిగా అమలుచేసే వారు లేక వెలకట్టలేని అరుదైన చారిత్రాత్మక కళాసంపద సరిహద్దులు దాటిపోతోంది. ఆస్ట్రేలియా, స్విట్జర్లాండ్, ఫ్రాన్స్, అమెరికా,



గుత్తికోట స్వాగత ద్వారం

ఇంగ్లండ్‌లలోని పలు మ్యూజియాలలో యాభై వేలకు పైగా కళాఖండాలు మన దేశం నుంచి అక్రమంగా తరలించినవే అంటే ఆశ్చర్యం కలుగక మానదు. ఆ చరిత్ర సంపద విలువ కనీసం 90 కోట్ల డాలర్లుండవచ్చని అంచనా. లండన్‌లోని విక్టోరియా, ఆల్బర్ట్ మ్యూజియాలలోనే 33,000 భారతీయ వస్తు, శిల్పకళా, వస్త్ర విశేషాలతోపాటు మరెన్నో విగ్రహాలు ఉన్నాయి.

ప్రాచీన కట్టడాలు, దేవాలయాలకు, ఆలనా పాలనా లేకపోవడంవల్ల కీలక ప్రదేశాలలో అక్రమ తవ్వకాలు జరుగుతున్నాయి. కొన్నిచోట్ల మూల విరాట్టులను, విగ్రహాలను నిధుల కోసం పెకలిస్తున్నారు. కొన్ని చోట్ల విగ్రహాలు పగిలిపోగా, మరికొన్నిచోట్ల విగ్రహాలే మాయమై పోతున్నాయి. శివాలయాలలో శివలింగాల కింద నిధులు లభిస్తాయనే నమ్మకంతో చాలాచోట్ల లింగాలను పెకలిస్తున్నారు. దేవాలయాలను, ఇతర నిర్మాణాలను గుప్తనిధుల కోసం పడగొడుతున్నారు. కొన్ని నిర్మాణాల శిథిలాల పునాదులు కూడా తవ్వేస్తున్నారు.

ప్రాచీన కళా వస్తువులను అక్రమంగా తరలిస్తే 1972 నాటి చట్ట నిబంధనలలో శిక్ష ఎంత కాలమనేది కచ్చితంగా నిర్దేశించలేదు. ఒక కళావస్తువు దగ్గరుంటే నేరం కాదు. అది ఎగుమతి/దిగుమతి చేస్తేనే నేరమని చట్టం చెబుతోంది. ఏ వ్యక్తిపైన అయినా కేసు నమోదు చేయాలంటే ముందుగా అది పురాతన వస్తువేనా అనే అంశం నిర్ధారణ చేసుకోవాలి. ఈ నిర్ధారణకూ, కేసు నమోదుకు ఆర్కియాలజీ సర్వే విభాగం అనుమతి కూడా తప్పనిసరి. ఈ నేరాలకు పాల్పడే వారికి బెయిలు కూడా లభిస్తోంది. దేవాలయాల నుంచి, మ్యూజియాల నుంచి అతి విలువైన పురాతన

పంచలోహ విగ్రహాల
దొంగిలించి, విదేశాల
తరలించే ముఠా
రాష్ట్రంలో కూడా సంచ
స్తున్నాయి. నిరాట
కంగా సాగుతున్న
ముఠాల కార్యకలా
లను పోలీసు శాఖ అ
ట్టలేక పోతోంది. స్రై
భద్రతా ఏర్పాట్లు లేక
వడం వలన వీరు సు
యాసంగా విగ్రహాల
దొంగిలిస్తున్నారు.

విగ్రహాలను
మాండును బట్టి విదే
లలో లక్షల రూపాయలకు అమ్ముతున్నారు. గత పదేళ్ళలో అయి
దారు కోట్ల రూపాయల విలువగల విగ్రహాల దొంగతనాలు జరి
నట్లు అంచనా. గుంటూరు, ప్రకాశం, మహబూబ్‌నగర్ జిల్లాల్లో
వివిధ దేవాలయాలలో నుంచి విగ్రహాలను దొంగిలించిన నేరగా
ళ్ళను గతంలో పోలీసులు పట్టుకొని ఎంతో విలువగల ఆ ప్రాచీ
పంచలోహ విగ్రహాలను స్వాధీనం చేసుకున్నారు. విగ్రహాలన
దొంగిలించే ముఠాలు వారి స్థావరాలను హైదరాబాద్, విశా
పట్నం, విజయవాడలలో ఏర్పాటు చేసుకొని కోస్తా జిల్లాలో
వివిధ ఆలయాల నుంచి పంచలోహ, ఇత్తడి విగ్రహాలను హైదరా
బాద్‌కు చేర్చి ఆ తర్వాత అమ్మేస్తున్నట్లు తెలుస్తోంది. కర్నూలు,
నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని పంచలోహ విగ్రహాలను
దొంగిలించి అమ్ముతున్న ముఠాల కోసం అధికారులు గాలిస్తు
న్నారు. వరంగల్, ఖమ్మం, గుంటూరు, చిత్తూరు జిల్లాల నుంచి
కూడా ఈ ముఠాలు ప్రాచీన సంపదను కొనుగోలు చేస్తున్నట్లు,
అక్రమంగా తరలిస్తున్నట్లు అధికారుల దృష్టికి వచ్చింది.

విగ్రహాలను దొంగిలించే ముఠాలు దేవాలయాలలోని విగ్రహా
లను ఎత్తుకెళ్ళి వాటిని అట్టపెట్టెలలో భద్రపరచి వాహనాల ద్వారా
వారి ప్రధాన స్థావరాలకు చేర్చి అక్కడ పథకాలను రూపొందించు
కొని వాటిని బొంబాయికి తీసుకెళ్ళి విగ్రహాలను కొనే ముఠాలకు
అమ్మేసి వ్యాపారం సాగిస్తుంటారు. డిమాండును బట్టి విగ్రహాలను
స్మగ్లర్లు కొనుగోలు చేసి విదేశీయులకు అమ్ముతున్నారు. మూడు
వందల సంవత్సరాల క్రితం నాటి దీప సుందరి, లక్ష్మీ నరసింహ
స్వామి, విష్ణుమూర్తి, లక్ష్మీనారాయణ స్వామి, వేణుగోపాలస్వామి,
కోదండ రామస్వామి తదితర దేవతల విగ్రహాలను స్మగ్లర్లు విదేశీ
యులకు అమ్మేసినట్లు విచారణలో బయటపడింది. కడప జిల్లా
నుంచి హైదరాబాద్ నగరం ద్వారా ముంబాయికి నాలుగు వందల
సంవత్సరాల కాలంనాటి విగ్రహాన్ని తరలిస్తున్నట్లు సమాచారం
అంది గతంలో ఓ ముఠా నుంచి ఆ విగ్రహాన్ని స్వాధీనం చేసుకు
న్నారు.

ఇలాంటి సంఘటనలపై ఆర్కియోలాజికల్ సర్వే అధికారులు కూడా తమ నిస్సహాయతను వ్యక్తం చేస్తున్నారు. దేశవ్యాప్తంగా ఐదువందలకు పైగా మ్యూజియాలు ఉన్నాయి. వీటిలో ఎన్ని కళావస్తువు లున్నాయో తెలుస్తుంది కానీ పొలాల్లో, ఆలయాలలో, భూగర్భంలో దాచి ఉంచినవి కొన్ని వేలకు పైచిలుకు ఉండవచ్చు. ఆఫీసుల్లో కూర్చున్న మేం వాటిని ఎలా కాపాడగలం? దేశం నుంచి విదేశాలకు దారితీసే మార్గ ద్వారాల వద్ద పకడ్బందీ ఏర్పాట్లు వుంటే

వేంపల్లి



జొన్నగిరిలో అశోకుని కాలంనాటి శాసనం

# శిథిలమవుతున్న చరిత్ర

గానీ పురావస్తు స్మగ్లర్ల ఆట కట్టించలేమని అధికారులు అభిప్రాయపడుతున్నారు. బరువుతో పాటు, ఎత్తును బట్టి స్మగ్లర్లు, విదేశీయులకు విగ్రహాలను అమ్మేస్తున్నట్లు తెలుస్తోంది. ఈ విధంగా ప్రాచీన సంపదను తరలిస్తున్న ముఠాలను ఎన్నింటిని పట్టుకుంటున్నా ప్రయోజనం కనపడటంలేదని, విగ్రహాల దొంగతనాలు యధావిధిగా జరుగుతూనే ఉన్నాయని అధికారులు అంటున్నారు. విగ్రహాలను విక్రయించే నిమిత్తం ప్రాచీన పార్వతీదేవి విగ్రహానికున్న జడను కోసి ఆ ముక్కను శాంపిల్ చూపించడానికి తీసుకెళ్తున్నప్పుడు ఓ ముఠాను పట్టుకున్నారు.



గుత్తికోటలో ఒకప్పటి 'రాణివాసం'

అనంతపురం జిల్లాలోని పెనుకొండ విజయనగర రాజుల కాలంలో వైభవంగా వెలిగింది. ఆనాటి రాజులు నిర్మించిన రాజప్రాసాదాలు, గగన్ మహల్, ఉయ్యాల గోపురం, రామ బురుజు, తిమ్మరసు బందిఖానా, సమాధి, ఖిల్లా వంటి ఎన్నో చారిత్రాత్మక ప్రత్యేకతలు కల్గి ఉంది. ఈ ఖిల్లాలో గుప్త నిధులు ఉన్నాయని తవ్వకాలు సాగించడంవల్ల పలుచోట్ల చరిత్రకు ముప్పు వాటిల్లింది. ధ్వజ స్తంభం కింద, గర్భగుడిలోనూ గునపాలతో తవ్వారు.

## చట్టాలు ఏం చెబుతున్నాయి?

ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాని 1981లో స్థాపించారు. అప్పటి నుంచి శిథిలాలలో లభించినవి, వివిధ ప్రదేశాల నుంచి సేకరించినవి వీటిని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు మ్యూజియాలలో భద్రపరిచి సంరక్షిస్తున్నాయి. ఈ వస్తువులలో చారిత్రాత్మక వివరాలు, పరిణామ దశలు పరిశోధనలకు పరిశీలన అంశాలుగా ఉన్నాయి. 1978లో ప్రవేశపెట్టిన 'ఇండియన్ ట్రెజర్ ట్రోల్ యాక్ట్' ద్వారా ప్రభుత్వం కళాఖండాలను, నాణాలను, రాగి ఫలకాలను, ఇతర సామాగ్రిని సేకరించ గలిగింది. 1904లో ప్రభుత్వం 'ఏన్షియంట్ మాన్యుమెంట్ ప్రిజర్వేషన్ యాక్ట్' చేసింది. ఫలితంగా పురావస్తు ప్రదేశాల నుంచి, కట్టడాల నుంచి, కళాసంపదను మ్యూజియాలకు చేర్చారు. కళాఖండాల స్మగ్లింగ్‌ను అరికట్టడానికి ఏంటిక్విటీస్ అండ్ ఆర్ట్స్ ట్రెజర్ యాక్ట్ 1972లో కొన్ని నిబంధనలు చేశారు. ప్రాచీన వస్తువుల ఎగుమతిపై ఆంక్షలు విధించారు. పురావస్తువుల అక్రమ తరలింపు కేసులు పోలీసులకు అందుతూనే ఉంటాయి. ఇలాంటి కేసులు చూడడానికి సిబిఐలో ముగ్గురు సభ్యులు వున్న ప్రత్యేక విభాగం ఉంది. వీరికి రోజూ వందలాది ఫిర్యాదులు అందుతుంటాయి. తగిన సాక్ష్యాధారాలు లేకపోవడం వల్ల కూడా కేసులు ముందుకు సాగవు. ఒక్కోసారి పోయిందని చెప్పే వస్తువు అసలుందో లేదో నిర్ధారించుకోవల్సిన అవసరం వస్తుంది.

దీనికి సంబంధించి ముందుగా కేసు నమోదుకు పురావస్తు సర్వే విభాగం అనుమతి ఇవ్వాలి. అది పురాతన వస్తువేనని నిర్ధారించినా అది వ్యక్తిగతమైతేనో, కుటుంబ ఆస్తిలో భాగమైతేనో కేసు నమోదు సాధ్యం కాదు. ప్రభుత్వంతోపాటు ఇతర స్వచ్ఛంద, సాంఘిక సంస్థలు, ప్రాచీన కట్టడాల గురించి ప్రజలలో అవగాహనను పెంపొందించాల్సి ఉంది.

ంగాధర్

## పరిరక్షణ!

ప్రపంచవ్యాప్తంగా గుర్తించిన 288 వారసత్వ కట్టడాలు, స్థలాలలో మన దేశానికి చెందినవి 13 కట్టడాలు, 4 స్థలాలు ఉన్నాయి. క్రీస్తు పూర్వం 200, క్రీస్తు శకం 700 కాలం నాటి శిల్ప చిత్రలేఖనాలున్న అజంతా గుహలు, 5-13 శతాబ్దాలకు చెందిన ఎల్లోరా గుహాలయాలు, కైలాస నాథాలయం, 6వ శతాబ్దికి చెందిన పట్టడకల్‌లోని చాళుక్య ఆలయాలు, అదే శతాబ్దికి చెందిన ఎలిఫెంటా గుహాలయాలు, 6-8 శతాబ్దాలకు చెందిన మహాబలిపురంలోని రాతి రథాలు, 10-12 శతాబ్దాలలో చాందెల్ల రాజులు నిర్మించిన ఖజురహో దేవాలయాలు, 10-11 శతాబ్దాలలో రాజరాజ చోళుడు నిర్మించిన తంజావూరులోని బృహదీశ్వరాలయం, 1250లో తూర్పు గంగరాజు మొదటి నరసింహ దేవుడు నిర్మించిన కోణార్క్ సూర్య దేవాలయం, 16-17 శతాబ్దాలకు చెందిన హంపీలోని విజయనగర కట్టడాలు, 16వ శతాబ్దికి చెందిన ఆగ్రా కోట, మొఘల్ సిటీగా పేరొందిన ఫతేపూర్ సిక్రీ, 17వ శతాబ్దికి చెందిన తాజ్‌మహల్, 16-17 శతాబ్దాల నాటి గోవా చర్చిలు, ఇంకా వివిధ ప్రదేశాలు ఈ జాబితాలో ఉన్నాయి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఎల్లోరా గుహల సమీపంలో క్రీ.పూ. రెండో శతాబ్దానికి చెందిన శాతవాహన కాలం నాటి ప్రాచీన నగర అవశేషాలు బయల్పడ్డాయి. ఈ నగరం ఎల్లోరా గుహల ముందు కాలానికి చెందినది కావడంతో అత్యంత ప్రాధాన్యతను సంతరించుకుంది. ఎల్లోరా గుహల్లోని 16వ నెంబరు కైలాష్ గుహకు పశ్చిమాన జరిపిన తవ్వకాల్లో బయల్ప... ఈ నగరం 250 మీటర్ల పొడవు గలది. ఇటుకలతో ఈ కట్టడాని... నిర్మించారు.

ఈ ఇటుకలు అత్యంత పెద్ద సైజువి కావడం విశేషం. ... కాలానికి చెందిన వివిధ రకాల మృణ్మయ పాత్రలు, తదితర అ... శేషాలు కూడా తవ్వకాలలో వెలుగు చూశాయి. కైలాష్‌కు సమీపంలో ఒక కందకం తవ్వుతుండగా ఈ నగరం అవశేషాలు వెలుగులోకి వచ్చాయి. నాలుగు దిక్కులకు ఈ కట్టడం వ్యాపించి ఉంది... కందకానికి ఉత్తరాన 15 మీటర్ల దూరంలో మూడు నుం... నాలుగు బావులు కూడా బయల్పడ్డాయి. ఇక్కడే కొన్ని పొయ్యిల... కూడా కనుగొన్నాడు. క్రీ.పూ. 2వ శతాబ్దం నుంచి 5వ శతాబ్ద... మధ్య విలసిల్లిన శాతవాహన కాలంనాటి సంస్కృతిని ఇవి ప్రతిబి... బిస్తున్నాయి. ప్రముఖ మైస్మాల్ యంత్ర కేంద్రం సమీపంలో... మరిన్ని కొత్త గుహలు వెలుగు చూసే అవకాశం ఉంది. ఈ పర్వత... ప్రాంతాల్లో కొందరు విచ్చలవిడిగా భవన నిర్మాణాలు సాగించడం... వలన ఈ ప్రాచీన గుహలు ధ్వంసమౌతున్నాయి.

మహాబలిపురంలో ఎంతో కాలంగా ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారు తవ్వకాలు కొనసాగిస్తున్నారు. విజయ నగర... కాలంనాటి కొలను, మండపాలు, మరిన్ని ఆధారాల్ని వారు కనుగొన్నారు. ఈ కొలను చతురస్రాకారంలో వుండి చుట్టూరా ఏనుగుల... చెక్కిన బండరాళ్ళు మెట్లుగా ఉన్నాయి. ఈ కొలనుకు ముందు... ఒక మండపం ఉంది. దేవాలయాల్లో ఉత్సవాలు జరిగినప్పుడు... ఉత్సవమూర్తి ఈ కొలను దగ్గరికి వచ్చి స్నాన పానాదులు చేయడానికి గాను ఈ మండపాన్ని కట్టి ఉంటుందని చరిత్రకారుల అభిప్రాయం. ఈ కొలను చుట్టూ ఉన్న మెట్లపై కూడా ఆ కాలపు కట్టడాలపై కనిపించిన శైవ, వైష్ణవ సంప్రదాయాలకు చెందిన శిల్పశైలి... కనపడుతోంది. అక్కడి రాష్ట్ర ప్రభుత్వం మహాబలిపురంలో ఉన్న... పల్లవుల కాలంనాటి శిల్పాలను, ప్రదేశాలను కాపాడుతున్నారు. గానీ, విజయనగర కాలం నాటి కొలను, మండపాలపై శ్రద్ధ చూపడంలేదు. ఫలితంగా అవి శిథిలమౌతున్నాయి.

## 'బాహుబలి'కి ముప్పు!

జైనులు అతి పవిత్రంగా భావించే పుణ్యక్షేత్రాలలో కర్నాటక రాష్ట్రంలోని శ్రావణ బెళగొళ ముఖ్యమైనది. ఈ క్షేత్రానికి 2000 సంవత్సరాల చరిత్ర ఉంది. 24 మంది జైన తీర్థంకరులతో సమాన గౌరవం పొందుతున్న భగవాన్ బాహుబలి 58 అడుగుల ఏకశిలా విగ్రహానికి ప్రతి 12 ఏళ్ళ కొకసారి నఖశిఖ పర్యంతం జరిపే అభిషేకాన్ని మహామస్తకాభిషేకం అంటారు. 1993 డిసెంబర్ 19వ తారీఖున ఇది జరిగిన విషయం తెలిసిందే. 470 అడుగుల



శాసనాలు బయటపడ్డ ఏనుగునల్లకొండ ఇదే

ఎత్తున్న ఇంద్రగిరి శిఖరం మీద 58 అడుగుల ఎత్తున ఉత్తరాభిముఖంగా నిలిచి వున్న ఈ ఏకశిలా విగ్రహానికి ముప్పు వాటిల్లుతోంది. 101 మహామస్తకాభిషేక పురస్కారాన్ని అందుకున్న ఆ విగ్రహం చుట్టుపక్కల జరుగుతున్న నాపరాయి గనుల పేలుళ్ళకు గురవుతోంది. ఈ క్షేత్రం చుట్టూ రెండు కిలోమీటర్ల పరిధిలో నాపరాయి గనుల తవ్వకాన్ని, పేలుళ్ళను నిషేధించారు. అయితే రక్షిత వలయంగా ప్రకటించిన ప్రాంతం చుట్టూ కంచెను నిర్మించాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది. అవన్నీ వట్టి మాటలయ్యాయి. అక్రమంగా గనుల తవ్వకాలు సాగుతున్నాయి. గతంలో జరిగిన ఓ పేలుడు కారణంగానే అత్యంత ప్రాచీనమైన జననాథపురంలోని శాంతినాథ ఆలయం కుడివైపు, గర్భగుడి వెనుక భాగాలు బీటలు వారాయి. కొండ ప్రాంతాల్లో కేటాయించిన ఇళ్ళ పట్టాలను రద్దుచేసి శ్రావణ బెళగొళ పట్టణ రెవిన్యూ సరిహద్దు నుంచి అయిదు కిలోమీటర్ల పరిధిలో నాపరాయి తవ్వకాన్ని, దాని కోసం భూగర్భాన్ని పేల్చడాన్ని నిషేధించాల్సిందిగా కర్నాటక జైన యువక సంఘం డిమాండ్ చేసింది. గ్రానైట్ తవ్వకాలపై నిషేధాలను కఠినంగా అమలు చేసేలా గ్రామ, తాలూకా స్థాయి అధికారులను ఆదేశించాలని, ఆంక్షల్ని ధిక్కరించే వారిని కఠినంగా శిక్షించాల్సిందిగా వీరు కోరుతున్నారు.

అనంతపురం జిల్లా రాయదుర్గం ప్రాంతంలో జైనుల ఆనవాళ్ళు మనకు ఎన్నో లభించాయి. జైన సాహిత్యంలో ఈ ప్రాంతానికి విశేష ప్రాధాన్యత ఉంది. రసనిద్దుల గుట్టలో జైన విశ్వవిద్యాలయం వుండేదని చరిత్రకుల భావన. ఇక్కడ చెక్కిన పురాతన 'జంబూ ద్వీప చక్రాన్ని' పరిరక్షించేందుకు సమీపంలో జరిగే క్వారీయింగ్‌ను ఆ ప్రాంత రిటైర్డ్ హెడ్‌మాస్టర్ చక్రవర్తి ఇచ్చిన రిట్ పిటిషన్ ఆధారంగా నిలుపుదల చేస్తూ రాష్ట్ర హైకోర్టు తీర్పు నివ్వడం సంతోషించదగ్గ పరిణామం.

## బయల్పడిన బౌద్ధ శిల్పాలు!

గుంటూరు జిల్లా కర్లపాలెం గ్రామంలో శాతవాహనుల కాలంనాటి బౌద్ధ శిల్పాలు బయల్పడ్డాయి. కర్లపాలెం గ్రామస్థులు ఒక మట్టి దిబ్బను తవ్వుతుండగా బయటపడ్డ ఆరు అరుదైన శిల్పాలు చరిత్రకు ఆధారమయ్యాయి. దాదాపు నాలుగు అడుగులు ఎత్తు వున్న బౌద్ధ శిల్పాలు బుద్ధుని జననం, మహాభినిష్క్రమణం, స్థూపాన్ని ఆరాధించడం, సిద్ధార్థుని నిలువెత్తు శిల్పం, బోధివృక్షం, ధర్మచక్రం, సింహాసనం, బుద్ధపాదాలు, త్రిరత్న మొదలయిన హీనయాన బౌద్ధ సంకేతాలను వెల్లడిస్తున్నాయి. అమరావతి బౌద్ధమత కేంద్రంగా ఉన్నప్పటికీ సముద్ర తీరం వెంట వ్యాపారుల పోషణలో ఘంటసాల నుంచి భట్టిప్రోలు, కనపర్తి, పెదగంజాంల వరకూ బౌద్ధ స్థూపాలు, కట్టడాలను కనుగొన్నారు. కర్లపాలెం బౌద్ధ శిలాఫలకాలపై శాసనాలు కూడా ఉన్నాయి. పాకృతంలో, బ్రాహ్మలిపిలో ఉన్న శాసనాలు 'నవ... హంఘతి సంఘ విభాయ భగవతో అగపోగల' అని బుద్ధుని ఆరాధనను తెలుపుతున్నాయి. మట్టిపెంకులు, సున్నపుగార, ఇటుక ముక్కలు క్రీస్తు శకారంభంలో కర్లపాలెంలో బౌద్ధ ఆవాసాలు గానీ, స్థూప ఆరామాలు గానీ ఉండవచ్చుననే అభిప్రాయాన్ని కూడా చరిత్రకారులు చెబుతున్నారు. గత యాభై సంవత్సరాల కాలంలో ఇటువంటి విలువైన శిల్పాలు రాష్ట్రంలో బయల్పడలేదని పద్మపాణి విగ్రహం, బుద్ధుని జననం, అమరావతి శిలాఫలకాల కంటే పెద్దవి లభించడం ఇదే మొదటిసారని పరిశోధకులు వెల్లడించారు.

బౌద్ధమత చరిత్ర, సంస్కృతికి పేరుగాంచిన కృష్ణా జిల్లాలోని జగ్గయ్యపేట బౌద్ధారామంకు నేడు రక్షణ కరువైంది. స్మగ్లర్లు, దొంగలు చరిత్రను తవ్విపోస్తున్నారు. 1992-93 వరకు బౌద్ధస్తూపంపై కనిపించిన స్త్రీ పురుష యక్షుల చిత్రాలు నేడు కనిపించడంలేదు. ఉన్మాదుల పైశాచికత్వానికి నిదర్శనంగా ముక్కలు చెక్కలయిన ప్రాచీన శిల్పాలు కనిపిస్తాయి. బౌద్ధమత సంస్కృతికి చిహ్నంగా మిగిలి వున్న చిత్రాలను, విగ్రహాలను కొందరు సందర్శకులు రాళ్ళతో పగులగొట్టి పాడుచేశారు. దాదాపు 2000 సంవత్సరాల చరిత్ర కలిగిన ఈ బౌద్ధారామం బ్రిటిష్ వారి పరిపాలన కాలంలో పురాతత్వ పరిశోధకునిగా వుండిన జాన్ బర్గెస్ ఈ ప్రాంతంలో 'ధనంబోడు' గా పిలువబడే ఈ దిబ్బపై తవ్వకాలు సాగించినప్పుడు శిథిలమైన స్తూపాలు బయల్పడ్డాయి. వాటికి నేడు రక్షణ కరువైంది.



కాకతీయుల కాలం నాటి శిల్ప సంపద

## అశోకుని శాసనాలు

మగధ సామ్రాజ్యాధినేత అశోక చక్రవర్తి అనంతపురం జిల్లా పత్తికొండ ప్రాంతంలో పర్యటించినట్లు వివరించే శాసనాలు మగ్గలి మండల పరిధిలోని జొన్నగిరి - ఎర్రగుడి రహదారి మధ్యలో కనిపిస్తాయి. జొన్నగిరి గ్రామానికి సుమారు మూడు కిలోమీటర్ల దూరంలో పడమటి దిక్కున వున్న నల్ల ఏనగుకొండ అనే గుట్టలో ఆరు శిలాఫలకాలపై అశోకుని ధర్మ ప్రబోధనలు పాళీ భాషలో చెక్కబడి ఉన్నాయి. క్రీ.పూ.273-306 సంవత్సరాల మధ్య ఈ శాసనాలను చెక్కినట్లు తెలుస్తోంది. కర్నూలు, అనంతపురం జిల్లాలలో చాలాచోట్ల ఆనాటి శిలా శాసనాలు కోకొల్లలుగా ఉన్నాయి. అయితే ఆ శాసనాలు ఎవరి, కాలంనాటివో, వాటి సారాంశం ఏమిటో అర్థంకాక వాటిని మామూలు రాళ్ళుగానే భావించి నిర్లక్ష్యం చేస్తుంటారు. శాసనాలకు రక్షణ లేదు. కొన్ని శిలా శాసనాలను పశువులు కట్టి వేయడానికి ఉపయోగించడం వలన వాటిపై అక్షరాలు అర్థం కాకుండా పోయాయి. పత్తికొండ పరిధిలోని మండగిరి, మద్దికెర, అటికెలగుండు, కుకంకనూరు, కప్పట్రాళ్లీ తదితర గ్రామాల్లో రోడ్లపై శిలాశాసనాలు పడి ఉన్నాయి.

## విశ్వవిద్యాలయ శిథిలాలు

నాగార్జున సాగర్ దగ్గరి ఆచార్య నాగార్జునుని విశ్వవిద్యాలయ శిథిలాలను సందర్శించేవారు లేరు. నాగార్జున సాగర్‌కు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్న నాగార్జునకొండ పరిస్థితి ఇది. సాగర్ నుంచి బెల్లంకొండవారి పాలెం మీదుగా మాచర్ల వైపుకు వున్న రహదారిలో ఈ నాగార్జున విశ్వవిద్యాలయం ఉంది. ఈ పీఠం నుంచి ఆనాడు వివిధ దేశాల విద్యార్థులు జ్ఞానభిక్ష పొందారు. శిథిల కుడ్యాలలోనే గదుల నిర్మాణం కనిపిస్తుంది. మహాయాన బౌద్ధమతానికి ప్రధాన భూమిక నిర్వహించింది. ఇక్కడి కృష్ణానది లోయలో కేంద్ర పురావస్తు శాఖ 3700 చదరపు ఎకరాలలో జరిపిన తవ్వకాలలో అనేక చారిత్రాత్మక అవశేషాలు వెలుగులోకి వచ్చాయి. ఆచార్య నాగార్జునుడు శాతవాహన చక్రవర్తుల సహకారంతో ఈ విద్యాపీఠం నిర్మించారు. ఇది ఐదు అంతస్తులు కలిగి ఉంది. దీనినే పాతవత విహారం అంటారు. టిబెట్టు, చైనా తదితర ప్రపంచ భాషల్లో బౌద్ధమత గ్రంథాలు రూపొందించడానికి ఈ పీఠమే కారణం. టిబెట్ నుంచి తారానాథుడు వచ్చి ఆచార్య నాగార్జునుని గ్రంథాలను టిబెట్ భాషలోకి అనువదించారు. క్రీ.శ. 4వ శతాబ్దంలో ఫాహియాన్, 7వ శతాబ్దంలో హుయాంగ్‌త్సాంగ్, ఇత్సింగ్‌లు ఇక్కడే మహాయాన బౌద్ధమతం గురించి అధ్యయనం చేశారని చరిత్రకారుల భావన. వీటిని సందర్శించేవారు లేకపోవడంతో వీటి ఉనికే ప్రశ్నార్థకమౌతోంది.

కడప జిల్లా రాజంపేట మండలంలోని మదన గోపాలపురం గ్రామంలోని చతుర్ముఖ ఈశ్వర విగ్రహం వర్షానికి తడుస్తూ, ఎండకు ఎండుతూ ఎంతోకాలంగా దిబ్బలో పడి ఉంది. అరుదుగా వుండే చతుర్ముఖ శివలింగ విగ్రహాన్ని పట్టించుకునేవారు లేరు. ఈ విగ్రహం ఇసుకపల్లె నుంచి తాళ్ళపాకకు వెళ్ళే మార్గంలో కాపు పల్లె సమీపంలో ఉంది. విగ్రహం ఎత్తు దాదాపు నాలుగు అడుగులు ఉంటుంది. ఆ శివలింగం అడుగున నిధి దొరుకుతుందేమో అనే ఆశతో తవ్వకాలు సాగాయి. పురావస్తు శాఖ అధికారులు శ్రద్ధ వహించి కనుమరుగవుతున్న శిల్పకళాసంపదను భద్రపరచవలసిన బాధ్యత ఉంది. పెన్నానది తీరంలో పురాతన రాతి విగ్రహాలు బయల్పడుతున్నాయి. కొండపేట గ్రాగమం వద్ద బయల్పడిన విష్ణుమూర్తి విగ్రహం ఇందుకు నిదర్శనం. ఈ విగ్రహాలకు పూజలు చేయాలని, లేకుంటే కలతలు చెలరేగుతాయని భావించిన గ్రామస్తులు తిరిగి విగ్రహాలను పెన్నానదిలోనే పడేస్తున్నారు. పుష్పగిరి కొండలోని దేవాలయాలలో కొంతమంది దుండగులు రాతి విగ్రహాలను తొలగించి నిధుల కోసం అన్వేషించి, విగ్రహాలను పెన్నానదిలో పడేస్తూ వచ్చారు. అనేక విగ్రహాలు పగిలిపోయి ఉన్నాయి. చరిత్రపై అవగాహన లేనివారు ప్రాచీన కట్టడాల నుంచి తమ నివాసాలకు నిర్మాణ సామాగ్రిని తరలించడం, సందర్శకుల గోడల మీద పేర్లు చెక్కడం వంటి చర్యల వల్ల కట్టడాలను మరింత దీనావస్థకు చేరుస్తున్నాయి. స్థలాల, కట్టడాల చారిత్రక నేపథ్యాన్ని, ప్రాముఖ్యాన్ని ప్రజలకు తెలియజేయాల్సిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఉంది. చర్యలు చేపట్టామని మొక్కుబడిగా జరిపి చేతులు దులుపుకుంటే చాలదు. శిథిలావస్థలో దిక్కూమొక్కూ లేకుండా పడివున్న చారిత్రాత్మక కట్టడాల పరిరక్షణకు సమర్థవంతంగా కృషి చేయాల్సిన అవసరం ఉంది. అప్పుడే చరిత్ర నిలుస్తుంది. మన వైభవం నిలబడుతుంది.

ఫొటోలు: పి. దశరథ్‌కుమార్

వి. గంగాధర్

చరిత్రలో చెరిగిపోని స్థానాన్ని ఆక్రమించుకున్న ఎన్నో కట్టడాలు, కోటల ప్రాంతాల్లోని చారిత్రక చిహ్నాలు కనుమరుగు అవుతున్నాయి. విజయనగర రాజుల కాలంనాటి ఎన్నో ప్రాచీన ఆలయాలు ప్రభుత్వ ఆదరణ లేక అభివృద్ధికి దూరమయ్యాయి. అలనాటి చరిత్ర ఆధారాలన్నీ క్రమక్రమంగా కాలగర్భంలో కలిసిపోతున్నాయి.


నమ్ముతారా, ఇది ఒకరి ఇంటి గోడకి రాయిగా మారినశివలింగం

# చెరిగిపోతున్న

**విజయవిహారం పరిశోధన**

గుప్తనిధులకోసం తవ్వకాలు సాగించే దురాశా జీవులు పురాతన కట్టడాలను, శిలా విగ్రహాలను, దేవాలయాలను ధ్వంసం చేస్తున్నారు. శివాలయాలలో శివలింగాల క్రింద నిధులు లభిస్తాయనే నమ్మకంతో పలు చోట్ల లింగాలను పెకలిస్తున్నారు.

## బయట పడుతున్న భారీ శివలింగాలు

రాయలసీమ ప్రాంతంలో వివిధ చోట్ల తవ్వకాల్లో పెద్దపెద్ద శివలింగాలు బయటపడ్డాయి. కడపజిల్లా నందలూరు మండలం పొత్తపి గ్రామంలోని చెయ్యేరు నదీ తీరం వెంబడి ఉన్న ఓ రైతు పొలంలో గుర్తు తెలియని వ్యక్తులు



గుప్తనిధుల కోసం తవ్వకాలు జరుపుతున్నప్పుడు అద్భుతంగా ఉన్న పెద్ద శివలింగం బయటపడింది. ఈ విధంగానే కొండాపురం ప్రాంతంలోని లావనూరు పరిసర ప్రాంతాల్లో నూటికిపైగా శివలింగాలు వుండేవని తెలుస్తోంది. ప్రస్తుతానికి ఇరవైకి పైగా పెద్ద పెద్ద శివలింగాలు కంపచెట్ల మధ్యన, ఏటిగట్టున కన్పిస్తాయి. ఈ ప్రాంతంలో ఇళ్ళ నిర్మాణం కోసం, పొలం పనుల కోసం గుంతలు తవ్వుతున్నప్పుడు శివలింగాలు బయల్పడుతుంటాయి.

నందలూరు సమీపంలోని ఆడపూరు గుట్టపై బౌద్ధ ఆరామాలు, నాణాలు, పాత్రలు రాయలసీమలోనే తొలిసారిగా లభించాయి. అదే విధంగానే సమీపంలో వున్న తాళ్ళపాకలో ఇటీవల జరిపిన తవ్వకాల్లో పలు ప్రాచీన పాత్రలు బయటపడ్డాయి. క్రీస్తుపూర్వం 300 సంవత్సరాల కాలంనాటి మృణ్మయ పాత్రలు, కట్టడాలు అవశేషాలు లభించాయి. తాళ్ళపాక వద్ద వసంతరాజు అనే వ్యక్తికి చెందిన పొలం పాటి గడ్డపై తవ్వకాలు సాగాయి. చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం శాతవాహన రాజుల కాలంలో అక్కడ ఒక గ్రామం వుండేది. గతంలో ఇక్కడే బౌద్ధపాదం లభించింది. రాతితో మలచిన శక్తి శిలలు కూడా లభించాయి. మట్టి కాగు సుమారు రెండు వందల కిలోల బరువుతో రాయికంటే గట్టిగా వుంది. గతంలో తాళ్ళపాక పాటిగడ్డపై గుప్తనిధుల కోసం గుర్తుతెలియని దుండగులు అనేకసార్లు తవ్వకాలు సాగించారు.

అక్కడ కొందరికి విలువైన నాణేలు లభించాయని చెప్పుకునేవారు. 1408లో ఈ గ్రామంలోనే పదకవితా పితామహుడు అన్నమాచార్యులు జన్మించారు. మౌర్య, చాళుక్య, పల్లవ, శాతవాహన, చోళ, రాష్ట్రకూట, బాణ, వైదంబ, పాండ్యకాయస్థ, కాకతీయ, విజయనగర, మట్లి రాజులకాలంలో తాళ్ళపాక పరిసరాల్లో పలు గ్రామాలు ఉండేవి. ప్రముఖ శైవక్షేత్రం అత్తిరాల, నందలూరు మండలం లంజకనుమ గట్టు కూడా క్రీస్తుపూర్వం నాటి గ్రామాలే. ఈ ప్రాంతాల్లో పొలాలు దున్నుతున్నప్పుడు పలుచోట్ల సొరంగాలు, కట్టడాలు కూడా బయటపడ్డాయి.



అనంతపురం జిల్లాలోని కళ్యాణ దుర్గం కొండ ప్రాచీన చరిత్రకు ఆధారంగా వుంది. ప్రస్తుతం ఈ ఆధారాలన్నీ మట్టి పొరల మధ్యే సమాధి అవుతున్నాయి. కోట ముఖద్వార తోరణం శిథిలమైపోయింది. మిగిలిన రెండు వైపుల గోడలు కూడా కూలిపోవడానికి సిద్ధంగా వున్నాయి. పెద్ద రాళ్ళన్నీ దొర్లిపడ్డాయి. అక్కడక్కడా గోడలు పూర్తిగా పడిపోయాయి. కళ్యాణప్ప అనే పాలేరు పాలించ డంతో ఈ కోటకు కళ్యాణదుర్గం అని పేరు వచ్చిందంటారు. కుందుర్పి మండలంలోని అనేక కోటగోడలు నేడు కనిపించవు. అనంతపురం జిల్లాలోనే తనకల్లు, నల్లచెరువు మండలాల సరిహద్దులో గల ప్రాచీన చరిత్ర స్థావరాల పరిస్థితి కూడా విషమ స్థితిలో వుంది. అక్కడ వున్న బసవేశ్వరుని రాతి విగ్రహాన్ని గుప్తనిధుల కోసం కొందరు కదిలించారు. గోపురాన్ని పగులకొట్టారు. గుడిలోపలి నరసింహస్వామి విగ్రహం ముక్కలైపోయింది. నిధుల కోసం కొందరు గుడి లోపల తవ్వకాలు చేసి పాడు చేశారు. గుడికెదురుగా వున్న ధ్వజస్థంభానికి వున్న శిలాశాసనం కూడా విరిగి పోయింది. విజయ నగర రాజుల కాలంలో ప్రసిద్ధి పొందిన ఈ ప్రాంతంలో ఇప్పటికీ గుప్తనిధులకోసం గుర్తుతెలియని వ్యక్తులు రాత్రిపూట


కుతుబ్‌షాహీల కాలం నాటి కట్టడంపై మొలిచిన మర్రిచెట్టు ఆ కట్టడాన్ని చిన్నాభిన్నం చేసిన దృశ్యం (ముందుభాగం)


మర్రిచెట్టు వేర్లు కట్టడాన్ని కూల్చిన వైనం (వెనుక భాగం)


జాగ్రత్తలు తీసుకోక పోవటంతో మరో కట్టడం మీద మొలుస్తున్న మరో చెట్టు

# చరిత్ర ఆనవాళ్లు

తవ్వకాలు జరుపుతూ పురాతన కట్టడాలను, శిలావిగ్రహాలను ధ్వంసం చేస్తున్నారు. మలయనూరు గ్రామంలోని పంచలింగాల ఆలయంలో కూడా గుప్తనిధులకోసం విగ్రహాలను పగులకొట్టారు.


ప్రాచీన విగ్రహాలు ఏ మ్యూజియానికీ చేర్చకుండా నిర్లక్ష్యంగా పడవేసిన దృశ్యం

## ఉండవల్లి గుహల్లో...

గుంటూరు జిల్లా తాడేపల్లి మండలంలో వున్న ఉండవల్లి గుహలు ప్రాచీన వాస్తు కళానైపుణ్యానికి ప్రతీకలు. క్రీస్తు శకం రెండు, మూడు దశాబ్దాల్లో బౌద్ధమతం మన రాష్ట్రంలో ప్రాచుర్యం పొందుతున్న రోజుల్లోనివి. ఈ కొండల్లో 64 గుహలు వున్నాయి. గుహలో రెండవ అంతస్తులో ఒకే రాతితో చెక్కిన 18 అడుగుల పొడవైన అనంతపద్మ నాభ స్వామి విగ్రహం వుంది. ప్రస్తుతం ఈ గుహలు గబ్బిలాలకు నిలయమయ్యాయి. అనంత పద్మనాభుడి విగ్రహం కూడా లైటు వెలిగించి చూడనిదే కన్పించదు. ఎంతో ప్రాధాన్యం సంతరించుకున్న ఈ పర్యాటక స్థలంపై ప్రభుత్వ శ్రద్ధ చూపడం లేదు.

తూర్పు గోదావరి జిల్లాలోని ఆదుర్రుకు చరిత్రలో విశిష్టస్థాన ముంది. బౌద్ధసంస్కృతీ, విశేషాలు అక్కడ ఎన్నో బయల్పడ్డాయి. అక్కడి బౌద్ధస్తూపం, చైత్యాలు అలక్ష్యానికి చిహ్నాలుగా మిగిలిపోయాయి. ఇప్పటికీ ఆ ప్రాంతానికీ గుర్తింపు రాకపోవడం ప్రభుత్వ అవగాహన లోపానికీ, నిర్లక్ష్యానికి 10 అంగుళాల వెడల్పు, 3 అంగుళాల ఎత్తు కల్గిన ఇటుకలు కూడా ఇక్కడే బయల్పడడం విశేషం.

విశాఖ జిల్లా పాయకరావు పేట మండలంలోని గోపాలపట్నంలో శిథిలమవుతున్న బౌద్ధమత చిహ్నాలు ఎన్నో ఉన్నాయి. 70 అడుగుల ఎత్తులో వున్న సీతమ్మ కొండను తొలచి గుహను నిర్మించారు. బౌద్ధమత ప్రాశస్త్యాన్ని తెలియజేసే శిలాశాసనం కూడా ఇక్కడే వుంది. 1881లో రాబర్ట్ స్టీవెల్ అనే పురాతత్వశాస్త్రవేత్త కూడా ఇక్కడి పాండవుల మెట్టను గురించి తన రచనల్లో రాశారు. ఈ ప్రాంతానికి యింత చరిత్ర ఉన్నప్పటికీ ఆ విషయాలు స్థానికులకు తెలియకపోవడంతో ఈ చరిత్ర ఆధారాలన్నీ నిర్లక్ష్యానికి గురై శిథిలమైపోతున్నాయి.

14వ శతాబ్దంలో విజయనగర పాలనలో వుండిన పుంగనూరు ప్రాంతంలోని చరిత్ర ఆధారాలు అడ్రస్‌ను కోల్పోతున్నాయి. నాటి చారిత్రక కట్టడాలు, కళాకృతులు కనుమరుగై పోతున్నాయి. పశ్చిమ గోదావరి జిల్లాలోని పెదవేగికి చరిత్రలో సుస్థిర స్థానం వుంది. మెగస్తనీస్ తన రచన 'ఇండికా'లో దీని గురించి రాశారు. ఏకాదశ ముఖరుద్ర విగ్రహం, మకర తోరణం, కాలభైరువుడు వంటి, ప్రాచీన విగ్రహాలెన్నో యిక్కడ బయల్పడ్డాయి. 'ధనం దిబ్బ'గా పిలిచే ఒకనాటి బైద్ధారామం ఈ ప్రాంతంలోనే వుంది. తవ్వకాలు సాగిస్తే మరెన్నో చరిత్ర ఆధారాలు వెలుగు చూస్తాయి. కానీ ఈ ప్రాంతం గురించి పట్టించు కునే వారు కానీ, పరిశోధనలు చేసేవారు కానీ ఎవరూ లేరు.

## హంపీలో...!

350 ఎకరాల విస్తీర్ణంలోని హంపీలోని చరిత్ర సంపద శిథిలమైపోతోంది. ఒకవైపు విదేశీ హిప్పీల ఆగడాలు, మరోవైపు స్థానికుల అక్రమ వ్యాపారాలు మాదక ద్రవ్యాలు హంపీ చరిత్రను దెబ్బ తీస్తున్నాయి. హుచ్చప్పయ్య మఠంలోని నల్లరాతి స్తంభాలలో ఒకదాన్ని దుండగులు ధ్వంసం చేశారు. నందులను పెకలించి పడేశారు. విజయనగర రాజుల కాలంలో రాజధానిగా వుండి స్వర్ణయుగాన్ని చూసిన


గుప్త నిధులకోసం ధ్వంసం చేయబడ్డ సిద్ధవటంకోట

## ప్రాచీన కోటల ప్రస్తుత పరిస్థితి

**గోల్కొండ కోట (హైదరాబాదు) :** ఇప్పటికే చాలా ప్రాంతం కబ్జాకుగురైంది. కోటలోని రాళ్ళు తీసుకెళ్ళి ఇంటి నిర్మాణాలకు వాడుకున్నారు.

**కొండపల్లి కోట (కృష్ణా జిల్లా) :** క్రీ.శ. 1360లో నిర్మించిన ఈ కోటలోని రాళ్ళను స్థానికులు పట్టుకెళ్ళి ఇళ్ళు కట్టుకున్నారు.

**పెనుకొండ కోట (అనంతపురంజిల్లా):** గుప్తనిధులకోసం కోటలో తవ్వకాలు సాగాయి. ధ్వజస్తంభం కింద, గర్భగుడిలో తవ్వకాలు జరిపారు.

**చంద్రగిరి కోట (చిత్తూరు జిల్లా) :** కోటలోని చరిత్ర ఆధారాలు మట్టిదిబ్బల మధ్యే సమాధి అవుతున్నాయి. పందులకు నిలయంగా మారుతోంది.

**సిద్ధవటం కోట (కడప జిల్లా):** పెద్దనంది విగ్రహం ముక్కలైంది. సూర్యుడి విగ్రహం పోయింది. శివలింగం కింద నిధులకోసం త్రవ్విపోశారు.

**గండి కోట(కడప జిల్లా):** కోటను చేరుకోవడానికి సరైన దారి కూడా లేదు. గోడలను, ఆలయాలను కొల్లగొట్టారు. కోటలోని చరిత్ర ఆధారాలు శిథిలమైపోయాయి.

**గుత్తి కోట(అనంతపురంజిల్లా):** కంకరరాళ్ళ కోసం, గుప్తనిధుల కోసం కోటలో ఎక్కడ చూసినా గోతులు తీశారు. ఎక్కడ చూసినా సందర్శకుల పేర్లు చెక్కిపెట్టారు.

**రాపూరు కోట (నెల్లూరు జిల్లా):** శాసనాలను నిధుల వివరాలు చెప్తున్నట్లు భావించి తస్కరించారు. రహస్య తవ్వకాలు సాగించారు.


ఇది విజయనగర రాజుల శిల్పకళకు తార్కాణంగా మిగిలిన హంపీ రాతిరథం.

హంపీలో గుప్తనిధుల కోసం జోరుగా వేట జరుగుతోంది. ప్రసిద్ధి చెందిన ఆలయా ల్లోనూ, మండ పాల్లోనూ గత కొంతకాలంగా దుండగులు గుప్తనిధుల కోసం తవ్వకాలు సాగించినట్లు స్థానిక రైతులు వెల్లడించారు. దక్షిణ భారతీయులు పవిత్ర స్థలంగా భావించే హంపీలో హిప్పీల స్వైర విహారంతో మాదక ద్రవ్యాల కేంద్రంగా కూడా ఈ ప్రాంతం తయారయ్యింది.

## కాలుష్యంలో చార్మినార్

వాయు, శబ్దకాలుష్యం నుంచి చార్మినార్‌ను రక్షించడానికి ప్రభుత్వ అధికారులు చేపట్టిన ప్రతిపాదనలు కార్యరూపం దాల్చకముందే చార్మినార్ స్తంభాల అలంకరణ దిమ్మెలు కూలి పోతున్నాయి. లాడ్ బజార్ దిశను సూచించే ఒక మినార్‌పై అంతస్థు అలంకరణ దిమ్మె పెచ్చులూడి పోయింది. కాలుష్యం చేత కట్టడం లేత గోధుమరంగు వర్ణం కూడా మారిపోయి మసి పడుతోంది. చార్మినార్‌ను శబ్ద, వాయు కాలుష్యాల నుంచి కాపాడడమే కాక పరిసరాలను పర్యాటక స్థలంగా తీర్చిదిద్దడానికి గుల్జార్ హౌస్, షాలిబండ రోడ్డును 'నో ట్రాఫిక్ జోన్'గా ప్రకటించే యోచన ఆచరణకు దూరం అయింది.

## చివరగా...!

"ఖజురహో గురించి తెలియని వారుండరు. ఖజురహో వెళ్ళిన ప్రతివారూ 10వ శతాబ్దం నాటి అపురూప కళాఖండాలను తమతో పాటుగా తీసుకవచ్చి తమ ఇళ్ళలో అమర్చుకునేవారు. ప్రస్తుతం అక్కడ కొన్ని శిథిలాలు మాత్రమే మిగిలాయి. ఎన్నో అపురూప శిలా, శిల్పాలు దిక్కూ మొక్కూ లేకుండా పడి వున్నాయి" - ఇదీ నేడు దేశంలోని చరిత్ర స్థితి. తవ్వకాలు జరగక అనేక చరిత్ర ఆధారాలు మట్టి పొరల మధ్యే సమాధి అవుతున్నాయి. బయల్పడిన వాటిని ముఠాలు స్వాధీనం చేసుకొని సరిహద్దులు దాటిస్తున్నాయి. గుప్తనిధుల కోసం మరికొందరు చరిత్ర స్థావరాల్ని ధ్వంసం చేస్తున్నారు. చరిత్ర నుంచి పాఠాలు నేర్చుకోనివారిని చరిత్ర ఏమాత్రం క్షమించదు.

- ఫోటోలు, వ్యాసం:
వేంపల్లి గంగాధర్

## చట్టం 'ఓ.కే.'- నిధులు నిల్

చారిత్రక కట్టడాల మరమ్మత్తులకోసం రిపేర్ ఫండ్ మంజూరు చేయాలని చట్టంలో ఉంది. ప్రభుత్వ ఆధీనంలోని కమర్షియల్ కాంప్లెక్స్‌ల అద్దె, ఇతర స్థిరాస్తుల అమ్మకాల నుంచి వచ్చే ఆదాయంలో రెండు శాతాన్ని ఈ 'రిపేర్ ఫండ్' కోసం కేటాయించాలని అధికారులు ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు. అయితే నేటికీ ఆ ప్రతిపాదనలు ఆమోదానికి నోచుకోలేదు. అందువల్ల శిథిలమైయ్యే స్థితిలో ఉన్న చారిత్రక కట్టడాల మరమ్మత్తులకు ఆర్థిక సహాయం అందటం లేదు.

## చట్టం చేశారు-చర్యలు మరిచారు

చారిత్రక కట్టడాలు, భవనాల పరిరక్షణకు రాష్ట్ర ప్రభుత్వం చట్టం 1996లో రూపొందించింది. మరో ఏడాదికి నిపుణులతో కూడిన 'హెరిటేజ్ కన్సర్వేషన్ కమిటీ'ని మూడేళ్ళ కాలపరిమితితో నియమించింది. ఈ కమిటి చర్చల ద్వారా కాలం వెళ్లబుచ్చటంతో కమిటి కాలాన్ని మరో మూడేళ్ళకు పొడిగించారు.

ఈ కమిటి హైద్రాబాద్ నగరంలో 137 చారిత్రక భవనాలు, 9 చారిత్రక కట్టడాలు, శిల్పసంపదలను, రాష్ట్రంలో 418 చారిత్రక భవనాలు, కట్టడాలను, శిల్పసంపదలను గుర్తించి చర్యలు చేపట్టాలని గుర్తించింది.



మంత్రి మండవ

## శాఖల మధ్య 'ఆర్కియాలజీ' దోబూచులాట

ప్రభుత్వం పైకి చెబుతున్నట్లుగా విధానాలు అమలుకావడం లేదు. అందులోనూ కొన్ని విభాగాలలో అయితే మంత్రులకు కనీస మర్యాద దక్కటం లేదని ఇటీవల జరిగిన ఒక సంఘటన చెప్పకనే చెబుతుంది.

ఆర్కియాలజీ శాఖ గతంలో పర్యాటక శాఖ పరిధిలో ఉండేది. ఈ శాఖ బాధ్యతలు ఎక్కువయినట్లు తోచిన ముఖ్యమంత్రి దాన్ని పాఠశాల విద్యాశాఖకు మార్చారు. ఆ తరువాత మంత్రివర్గ విస్తరణ జరిగింది. పలువురి మంత్రుల శాఖల మార్పులు కూడా జరిగాయి. గతంలో భారీ, మధ్యతరహా నీటి ప్రాజెక్టుల మంత్రిగా వ్యవహరించిన మండవ వెంకటేశ్వరరావుకు పాఠశాల విద్యాశాఖను అప్పగించారు. స్వతహాగా అందర్నీ కలుపుకుపోయే స్వభావం ఉన్న మంత్రి మండవ ఆర్కియాలజీ శాఖ నిర్వాహకులను తనదైన పంథాలో అనేకసార్లు ఆహ్వానించారు. అయితే ఆర్కియాలజీలోని తెలంగాణా, ఆంధ్రా యూనియన్ల మధ్య వివాదం తరచూ అక్కడ అనేక వివాదాలకు దారితీసింది.

మంత్రి మండవ వెంకటేశ్వరరావు బాధ్యతలు తీసుకున్న రెండు నెలల కాలంలో ఆర్కియాలజీ, మ్యూజియం కమీషనర్ ఏ. రామలక్ష్మణ్ కనీసం మర్యాదపూర్వకంగానైనా కలవలేదు. ఈ విషయమై మంత్రి మండవ వెంకటేశ్వరరావును ప్రశ్నించగా - "ఆ అధికారి ఎందుకు కలవలేదో నాకు తెలియదు.... సంబంధిత మంత్రిని మర్యాదపూర్వకంగా కలవాలో...వద్దో ఆయన విచక్షణకు సంబంధించింది" అన్నారు.

- అనంచిన్ని వెంకటేశ్వరరావు


సిద్ధవటం కోటలోని ధ్వజ స్థంభంలో మిగిలినది ఇది మాత్రమే



చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి కోట. విజయనగర రాజుల మూడవ రాజధానిగా చరిత్రలో గొప్ప వెలుగు వెలిగింది. ప్రస్తుతం కోట పరిసరాల్లో పందులు తిరుగుతున్నాయి.

## కాలగర్భంలో కలిసిపోతున్న ఒరిస్సా దేవాలయాలు

భువనేశ్వర్‌లోని ప్రాచీన ఆలయాలెన్నో శిథిలమైపోతున్నాయి. ఎన్నో దేవాలయం చెత్తపారేసే స్థలంగా మారిపోయింది. మిగిలిన ప్రాచీన దేవాలయాలు కూడా నిర్లక్ష్యానికి గురయ్యాయి. 1999లో వచ్చిన తుఫాన్ ఒరిస్సాను అతలాకుతలం చేసినప్పటికీ ప్రాచీన ఆలయాలు చెక్కుచెదరకుండా మిగిలాయి. అప్పటి శిల్పులు వాస్తు సూత్రాలు పాటించడమే ఇందుకు కారణం అన్నారు. నగరంలో 250 కిలోమీటర్లకు పైగా గాలులు వీచినప్పటికీ ఈ దేవాలయాలపై ఉన్న జెండాలు కూడా అలాగే నిలిచాయి. కానీ ఈ ఆలయాల పరిస్థితి క్షీణించిపోతోంది. ముక్తేశ్వరాలయానికి దగ్గర్లోనే మెట్రో టవర్స్ పేరుతో ఏర్పాటైన అపార్ట్‌మెంట్ ఆ పరిసర ప్రాంతాల్ని పాడుచేసింది. మంగళేశ్వర ఆలయం గ్యారేజికి వేదికయ్యింది. 9వ శతాబ్దం నాటి తాళేశ్వర ఆలయం కట్టెల అంగడయ్యింది. ఈ ఆలయాల శిల్పసౌందర్యం, చెక్కడాలు అన్నీ క్రమంగా అదృశ్యమౌతున్నాయి.

### పైసామే పరమాత్మా...

డబ్బులోనే దేవుడున్నాడని చెప్పే సామెత ఇది. పైసాలో పరమాత్ముడు ఉన్నాడో లేదో కానీ, పరమాత్ముడిలో పైసా ఉందని విగ్రహాల దొంగలు కనిపెట్టారు. లక్షలు, కోట్లు విలువ చేసే ప్రాచీన విగ్రహాల మీద కన్నేశారు. ముఠాలుగా ఏర్పడి పురాతనమై, ప్రాముఖ్యత ఉన్న విగ్రహాలను దేవాలయాలనుంచే కాక మ్యూజియంలలో నుంచి కూడా దొంగిలిస్తున్నారు. విగ్రహాలను పక్క రాష్ట్రాలకు ఇతర దేశాలకు చేరవేసి సొమ్ము చేసుకుంటున్నారు.

అమెరికా, బ్రిటన్, స్విట్జర్లాండ్, ఆస్ట్రేలియా దేశాల్లోని మ్యూజియాలలో మన దేశానికి చెందిన చారిత్రక చిహ్నాలు 50 వేల వరకూ వున్నాయి. వీటి విలువ అంతర్జాతీయ మార్కెట్లో సుమారు 450 కోట్ల రూపాయలపైచిలుకే. ఇంతగా మన చారిత్రక సంపద తరలిపోతున్నా ప్రభుత్వంగానీ, ప్రజాప్రతినిధులు కానీ పట్టించుకుంటున్న దాఖలాలు తక్కువే.



మొత్తం మీద, మన సంస్కృతికి, చరిత్రకి, ఆధ్యాత్మిక సంపదకి ఆధారాలైన ప్రాచీన విగ్రహాలను దొంగిలించే ముఠాల కార్యకలాపాలు పెచ్చుమీరిపోయి ఆందోళన రేకెత్తిస్తున్నాయి. ఈ మధ్యకాలంలో పోలీసులు అనేక ప్రాంతాలలో ఇలాంటి ముఠాలను

చేశారు. నిందితుల్లో ఎస్. కుమార్ అనే వ్యక్తి రంజీ ఆటగాడు కాగా, మిగతావారు వివిధ గౌరవనీయవృత్తుల్లో స్థిరపడినవారు అవటం గమనార్హం.

ఈ బుద్ధ విగ్రహం స్మగ్లింగ్‌లో గద్దం రాజేష్ కుమార్ అనే వ్యక్తి కీలక పాత్ర పోషించాడు. బుద్ధ విగ్రహాలకు అంతర్జాతీయ మార్కెట్లో బాగా డిమాండ్ ఉందని తెలుసుకున్న అతను అమరావతి, నాగార్జున కొండ, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, విజయవాడ, అనపర్తి ప్రాంతాలను తరచూ సందర్శించి విగ్రహాల స్మగ్లింగ్‌కు పథకాలు తయారు చేసుకున్నాడు. క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దానికి చెందిన ఈ చారిత్రాత్మక బుద్ధుడి విగ్రహం కోసం పోలీసులు అన్వేషణ సాగించారు. చివరికి హైదరాబాద్‌లో విగ్రహం దొరికింది. దీనితో పాటు నాట్యం చేస్తున్న బాలిక విగ్రహం కూడా పోలీసులు స్వాధీనం చేసుకున్నారు.

### చందవరం ఫలకం

ప్రకాశం జిల్లా చందవరంలో బౌద్ధ కట్టడాల వద్ద లూటీ జరిగి తొమ్మిది అడుగుల పొడవైన బౌద్ధ ఫలకాలను స్థానిక మ్యూజియం నుంచి దొంగిలించుకుపోయారు. ప్రభుత్వం పట్టించుకోకపోవడంతో మరోసారి దోపిడీ చేసి బౌద్ధఛత్రం, బోధివృక్షం వున్న

సైకిల్ గ్రామ సమీపంలోని గుండాల కోనేరు స్వామి దేవస్థానానికి చెందిన పంచలోహ విగ్రహాలను అలయ ధర్మకర్త వారసులు విక్రయిస్తుండగా గతంలో తిరుపతిలో పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. వాటి విలువ సుమారు 15 లక్షల రూపాయలుగా అంచనా వేశారు. మద్రాసుకు చెందిన ఓ

అక్కడ వదిలేసి వెళ్ళిపోయారు.

### పట్టుబడిన ప్రాచీన సంపద

రాయలసీమ ప్రాంతానికి చెందిన పురాతన ఆలయాల్లోని ప్రాచీన విగ్రహాలను దొంగిలించి అమ్ముకునే ముఠాల్ని గతంలో

#### సరిహద్దు దాటిపోతున్న చారిత్రక సంపద

ఎక్కడ నుండి? → ప్రాచీన ఆలయాలు, మ్యూజియాలు, చరిత్ర స్థావరాలు

గ్రామాల్లోని చిన్న ముఠాలు: స్థానికంగా వుండే ప్రాచీన ఆలయాల వివరాలు సేకరించడం... దొంగతనాలకు పథకాలను రూపొందించడం. జిల్లా స్థాయి ముఠాలకు చేర్చడం.

↓

జిల్లాలోని స్థావరాలు: గ్రామాల్లోని ముఠాలను పెంచిపోషించి వారిద్వారా తమ పనులు పూర్తి చేసుకోవడం.

↓

రాష్ట్రస్థాయి ఏజెంట్లు: జిల్లా స్థాయి ముఠాలకు డబ్బు ఆశ చూపి విగ్రహాల వివరాల్ని సేకరించడం

↓

సరిహద్దు దేశాలకు అక్రమరవాణా: నేపాల్, శ్రీలంక, పాకిస్తాన్, బర్మా దేశాలకు చేరితే అక్కడి నుంచి స్మగ్లింగ్ చాలా సులువు.

↓

అగ్రదేశాలకు: అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా, స్విట్జర్లాండ్‌లోని మ్యూజియాల్లో 50 వేల చరిత్ర చిహ్నాలు మన దేశానివే. వీటివిలువ 90 కోట్లడాలర్లు

ఎందుకోసం? → ప్యాలెస్‌లో హోదాకోసం, మ్యూజియాలకు, పరిశోధనలకోసం

వర్తకుడికి విగ్రహాలను విక్రయించే ముందు శాంపిల్‌గా పార్వతీదేవి విగ్రహానికి వున్న జడను కోసి ఆ ముక్కను తీసుకెళ్ళి చూపించారని పోలీసుల విచారణలో వెల్లడైంది.

జమ్మల మడుగు మండలం పెద్దకొమెర్ల గ్రామానికి చెందిన విగ్రహాలు పదేళ్ళ క్రితం దొంగిలించబడ్డాయి. వాటిని అనంతపురంలోని బెంగుళూరు రోడ్డులో శివబాలయోగి ఆశ్రమం

పోలీసులు ఎస్పీహార్స్ల అరెస్ట్ చేశారు. విజయనగర సామ్రాజ్యం తరువాత కాలానికి చెందినవిగా భావిస్తున్న 40 లక్షల రూపాయలు విలువచేసే విగ్రహాలు కూడా లభ్యమయ్యాయి. పట్టుబడిన విగ్రహాలలో శివుడు, విష్ణువు, శ్రీదేవి దేవతల విగ్రహాలు, రెండు పార్వతీదేవి విగ్రహాలు కూడా ఉన్నాయి. వీటి విలువ అంతర్జాతీయ మార్కెట్‌లో కోటి

# విరుచుకుపడుతున్న విగ్రహాల స్మగ్లింగ్ ముఠాలపై విజయవిహారం స్పెషల్ రిపోర్ట్

# దైవ్యాల చేతిలో

పట్టుకొని విగ్రహాలను స్వాధీనం చేసుకోవటమే దీనికి రుజువు.

### ఘంటసాల బుద్ధవిగ్రహం...!

కృష్ణా జిల్లా ఘంటసాల మ్యూజియం నుంచి గత ఏడాది 29వ తేదీన (నవంబరు) చోరికి గురైన ప్రాచీన బుద్ధ విగ్రహాన్ని ఈ మధ్యనే హైదరాబాద్‌లో స్వాధీనం చేసుకున్నారు. విగ్రహ చోరి ముఠాను కూడా అరెస్ట్

ఫలకాల్ని తీసుకపోయారు. అప్పటికీ ప్రభుత్వం మేల్కోకపోవడంతో ఈ ఏడాది మార్చిలో 23వ తేదీన మ్యూజియంలోని ఇద్దరు వాచ్‌మెన్‌లకు మత్తు ఇంజక్షన్లు ఇచ్చి పట్టపగలు నిరాటంకంగా దోపిడి సాగించి మరిన్ని ప్రాచీన చిహ్నాల్ని దోచుకుపోయారు.

### పార్వతీదేవి జడను కోసి...

కడప జిల్లా ఓబులవారి పల్లె మండలం వద్ద కొబ్బరి చెట్టుకు గుర్తు తెలియని వ్యక్తులు రెండు సూట్‌కేసులలో వేలాడదీశారు. ఒక సూట్‌కేసులో శ్రీమహా విష్ణువు, శ్రీలక్ష్మి విగ్రహాలు, మరో సూట్‌కేసులో శ్రీరామ, సీత విగ్రహాలు దొరికాయి. ఈ సూట్‌కేసులపై "బాంబులు ఉన్నాయి జాగ్రత్త... పోలీసులకు తెలపండి'' అని రాసి వుంచి దొంగలు పరారయ్యారు. ఆ విగ్రహాలకు శక్తులు ఉన్నాయని నమ్మడం చేతనే దొంగలు వాటిని

రూపాయలకుపైగా ఉంటుందని అంచనా.

ఈమధ్య అనంతపురం జిల్లాకి చెందిన ఒక ముఠాను, బెంగుళూరు పోలీసులు అరెస్టు చేశారు. వారి వద్దనుంచి 20 లక్షల విలువైన మూడు ప్రాచీన విగ్రహాలను స్వాధీనం చేసుకున్నారు. దొంగిలించిన వారు మరో ముఠాకు విక్రయించారు. ఈ ముఠా మరింత ఎక్కువ ధరకు విక్రయించడానికి విగ్రహాలను బెంగుళూరు తీసుకెళ్ళగా అక్కడే పోలీసులు

## టాస్క్‌ఫోర్స్ నమోదు చేసిన కేసుల, స్వాధీనం చేసుకున్న విగ్రహాల వివరాలు (1995 - జూలై 2001)

అ

**1995** నమోదైన కేసులు : 5, అరెస్టైన వ్యక్తులు : 8 మంది, స్వాధీనం చేసుకున్న విగ్రహాల వివరాలు: సీతా, రామ, లక్ష్మణ పంచలోహ విగ్రహం, లక్ష్మణుడి పంచలోహ విగ్రహం, నంది విగ్రహం, చక్ర పెరుమాళ్, తిరుమంగై ఆళ్వార్, రామానుజా, నమ్మాళ్వార్, భూదేవి, శివ విగ్రహాలు

**1996** నమోదైన కేసులు : 1, అరెస్టైన వ్యక్తులు : 1, స్వాధీనం చేసుకున్న విగ్రహాల వివరాలు : పద్మావతీదేవి పంచలోహ విగ్రహం.

**1997** నమోదైన కేసులు : 1, అరెస్టైన వ్యక్తులు : 5 మంది, స్వాధీనం చేసుకున్న విగ్రహాలవివరాలు:కరీంనగర్ జిల్లా, రామగుండం వద్ద పెద్దంపేటలోని గుడిలో నుండి దొంగిలించబడ్డ రామ, లక్ష్మణ, సీత పంచలోహ విగ్రహాలు (3)

ఇ

ఆ

**1998** నమోదైన కేసులు : 3, అరెస్టైన వ్యక్తులు : 5 మంది, స్వాధీనం చేసుకున్న విగ్రహాలవివరాలు:15వ శతాబ్దం నాటి చంద్రశేఖర మూర్తి విగ్రహాలు(2), చాళుక్య వంశం కాలానికి చెందిన 19వ శతాబ్దం నాటి పార్వతీదేవి విగ్రహం, 18వ శతాబ్దం నాటి భూదేవి విగ్రహాలు(2).

పై విగ్రహాలన్నీ కొల్లాపూర్ మండలం, దాగుడ గ్రామం మరియు అలంపూర్‌లోని గుళ్ళలో నుండి దొంగిలించబడ్డవి. రాముడి విగ్రహం, ఒంగోలులోని గుడిలో దొంగిలించబడ్డ సీతాదేవి విగ్రహం, భైరవ విగ్రహం, దేవత విగ్రహం.

**1999** నమోదైన కేసులు : 6, అరెస్టైన వ్యక్తులు : 8 మంది, స్వాధీనం చేసుకున్న విగ్రహాల వివరాలు: మదనపల్లి నుండి దొంగిలించబడ్డదని అనుమానించిన భూదేవి విగ్రహం, తమిళనాడులోని గుడినుండి దొంగిలించబడ్డ 17వ శతాబ్దంనాటి అల్వార్ కులశేఖర, రామానుజాచార్య విగ్రహం, శ్రీదేవి విగ్రహాలు(2), లక్ష్మీదేవి విగ్రహాలు(3)

- మహబూబ్‌నగర్ జిల్లా, శ్రీకొండ గ్రామంలోని గుడిలో దొంగిలించబడ్డవి (చిత్రం-ఈ).

వెంకటేశ్వర స్వామి, అండాలు, లక్ష్మీదేవిల చిన్న విగ్రహాలు(3)

ఈ

**2000** నమోదైన కేసులు : 7, అరెస్టైన వ్యక్తులు : 19 మంది, స్వాధీనం చేసుకున్న విగ్రహాల వివరాలు: శివుడి విగ్రహం, విష్ణు విగ్రహం, పార్వతీదేవి విగ్రహాలు(2), శ్రీదేవి విగ్రహం

పై విగ్రహాలు రాయలసీమ, కర్నూలు జిల్లాల్లోని అనేక గుళ్ళలో దొంగిలించబడ్డ 16 మరియు 17వ శతాబ్దాలకి చెందినవి (చిత్రం-ఉ).

అమలాపురం, వేటులపాలెంలోని రామాలయం గుడి నుండి దొంగిలించబడ్డ రామ, లక్ష్మణ, సీత మరియు అంజనేయ విగ్రహాలు(4), చంద్రాయన్ గుట్టలోని గుడి నుండి అంబానిడర్ కార్‌తో దొంగిలించబడ్డ చంద్రశేఖర మూర్తి విగ్రహం, రాముడి విగ్రహం, చంద్రశేఖరమూర్తి విగ్రహం, వీరభద్రస్వామి విగ్రహం, పార్వతీదేవి విగ్రహం

పై విగ్రహాలు ఖమ్మం జిల్లా ఎస్.వెంకటాయ పాలెం గ్రామంలోని పార్వతీ రామలింగేశ్వర ఆంజనేయస్వామి గుడి నుండి దొంగిలించబడినవి.

తారాదేవి విగ్రహాలు(6), నగ్నభంగిమలోని ఆడ, మగ విగ్రహాలు(3), ఒరిస్సారాష్ట్రానికి చెందిన జైపూర్‌లోని గుడిలో దొంగిలించబడ్డాయని అనుమానించిన యోగముద్రలో స్త్రీ విగ్రహాలు మరియు 4 జంతువుల విగ్రహాలు(2) (చిత్రం-అ), విష్ణుభగవానుడి పంచలోహ విగ్రహం

నీరిని పట్టుకున్నారు. అదే విధంగా కడప జిల్లా పులివెందులకు చెందిన రాజారెడ్డి, కొండయ్య పాండులు బెంగుళూరులో విక్రయిస్తుండగా పోలీసులు విగ్రహాలను స్వాధీనం చేసుకున్నారు. పది కిలోల బరువుగల విష్ణుమూర్తి పంచలోహ విగ్రహంతో పాటు, ఆరున్నర కిలోల శ్రీదేవి, అయిదున్నర కిలోల భూదేవి విగ్రహాలను మన రాష్ట్రంలోని ఒక దేవాలయం నుంచి దొంగిలించి అమ్మకానికి బెంగుళూరు తీసుకెళ్ళినప్పుడు పోలీసులు వలపన్ని పట్టుకున్నారు. కర్నూలు జిల్లాలో పూజా పునస్కారాలకు నోచుకోకుండా పడివున్న పురాతన ఆలయాలపై కన్నేసిన ముఠాలు గత కొంతకాలంగా విగ్రహాలను తస్కరించడం మొదలు పెట్టాయి. కర్నూలుకు చెందిన మస్తాన్ అనే వ్యక్తి నాయకత్వంలో అరుగురు సభ్యులుగల ముఠాని పోలీసులు రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నారు.

## రాష్ట్రమంతా ముఠాలు

మైసూర్, హంపీలలో ప్రాచీన విగ్రహాలను దొంగిలించి విదేశాలకు విక్రయించే పదిమంది విగ్రహాల దొంగల ముఠాను గతంలోనే చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తి పోలీసులు పట్టుకున్నారు. కడప జిల్లా ప్రొద్దుటూరుకు చెందిన దేవరపల్లి రామ్‌రెడ్డి వీరి నాయకుడుగా గుర్తించారు. వారి ముఠా నుంచి స్వాధీనం చేసుకున్న వాటిలో రుక్మిణి, రాధ, విష్ణువు, పద్మావతి, వేంకటేశ్వర స్వామి విగ్రహాలు ఉన్నాయి. ఈ కాంస్య విగ్రహాలు రెండు అడుగుల ఎత్తు, 70 కిలోల బరువు వున్నాయి. విగ్రహాలతో పాటుగా వెండి కిరీటాలు, ఇత్తడి కాసుల దండలను కూడా వీరి నుంచి స్వాధీనం చేసుకున్నారు.

రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోనూ విగ్రహాలను దొంగిలిస్తున్న ముఠాల కార్యకలాపాలు పెచ్చుమీరిపోయాయి. గుంటూరు జిల్లా దుగ్గిరాల మండలం, పెదకొండూరులోని శ్రీదేవి, భూదేవి సమేత జనార్థనస్వామి ఆలయంలో 30 లక్షల రూపాయల విలువైన నాలుగు పంచలోహ విగ్రహాలు ఈ ఏడాది ఆగస్టులో చోరీకి గురయ్యాయి. ఖమ్మం జిల్లా నేలకొండపల్లి వెంకటేశ్వరస్వామి ఆలయంలో, లక్షలాది రూపాయల విలువ చేసే మూడు పంచలోహ విగ్రహాలను దొంగిలించారు.

మహబూబ్‌నగర్ జిల్లాలోని రాజోలి గ్రామంలోని శ్రీవైకుంఠ నారాయణస్వామి దేవాలయంలో 1992లో చోరీ జరగగా, ఆ మూడు పంచలోహ విగ్రహాలను కర్నూలు జిల్లా నంద్యాల బస్టాండ్‌లో షేక్ బుడేసా నుంచి స్వాధీనం చేసుకున్నారు. అతడు ఆ విగ్రహాలను హైదరాబాద్‌లో వుండే ఓ న్యాయవాదికి వద్దకు తరలించే ప్రయత్నంలో వుండగా దొరికిపోయాడు.

తాకితే లోహ శబ్దం ప్రతిఫలించే 13వ శతాబ్దం నాటి కాకతీయుల కాలం నాటి విగ్రహాలను ఎగుమతి చేస్తున్న ముఠాను విజయవాడ పోలీసులు గతంలో ఒకసారి పట్టుకున్నారు. ఇలా చెప్పుకుంటూ పోతే ప్రతిజిల్లాలోనూ విగ్రహాల దొంగలు తయారయ్యారు.

## పోలీసులకు సవాళ్ళు

విలువైన ప్రాచీన చిహ్నాలను కొత్తకొత్త పద్ధతుల ద్వారా స్మగ్లింగ్ చేస్తూ పోలీసులకు సవాళ్ళు విసురుతున్నారు.

1998లో సంచలనం సృష్టించిన విజయవాడ కనకదుర్గ దేవాలయంలో దొంగతనం సంఘటన తర్వాత రాష్ట్రంలోని ముఖ్యమైన ఆలయాల్లో భద్రతా ఏర్పాట్లను కట్టుదిట్టం చేసేందుకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోలేదు. దీంతో తెలంగాణాలో ప్రసిద్ధిగాంచిన యాదగిరి గుట్ట శ్రీలక్ష్మీ నర్సింహస్వామి దేవాలయంలో ఈ ఏడాది జూన్ 6న దోపిడి యత్నం జరిగింది. ఈ సంఘటనలో సెంట్రీ రాంబహదూర్ ప్రాణాలు కోల్పోయారు.

హైద్రాబాద్ వెంగళరావు నగర్‌లోని ఒక దేవాలయంలో జరిగిన చోరీ కేసులో అనుమానంతో దేవాలయ అర్చకుడిని పోలీసులు అదుపులోకి తీసుకోగా అవమాన భారంతో అతను ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

కర్మన్ ఘాట్‌లో ఆంజనేయస్వామి ఆలయంలోనూ, రాజమండ్రి మార్కండేయ స్వామి ఆలయంలో గత ఏడాది చోరీలు జరిగాయి. విజయవాడ కనకదుర్గ ఆలయంలో దొంగతనానికి పాల్పడ్డ ప్రకాశ్ సాహా దొరికిన తరువాత అరసవెల్లి, పార్వతీపురం, విజయనగరం జిల్లాలలో ఆయన చేసిన చోరీలు వెలుగులోకి వచ్చి పోలీసులను 'షాక్'కు గురిచేశాయి. రాష్ట్రప్రభుత్వం దేవాలయాల భద్రత కోసం నియమించిన కమిటి 1998లో ఒక నివేదిక సమర్పించింది. దీనితో పాటు పలు సూచనలు చేసింది.

రాత్రి వేళల్లో ఆలయాల ప్రధాన ద్వారంతో పాటు మిగతా ద్వారాలను ఎవరైనా ముట్టుకుంటే అలారం (బర్గ్‌లర్) పెట్టుకోవాలని, స్పెషల్ ప్రొటెక్షన్ ఫోర్సు (ఎస్.పి.ఎఫ్)ను ఏర్పాటు చేసుకోవాలని, ఆలయాల్లో 24 గంటలు క్లోజ్‌డ్ సర్క్యూట్ కెమెరాల (సి.సి.టి.వి) ద్వారా గమనిస్తుండాలని నివేదికలో కమిటి సూచించింది.

ఇలా కమిటి చేసిన అనేక సూచనలకు పూర్తి స్థాయిలో చర్యలు తీసుకున్న దాఖలాలు కనిపించడం లేదు. ఆలయంలో ఉన్న ఆభరణాలకోసం వచ్చే ముఠాలు అవి లేనిచోట విగ్రహాలను దొంగిలించటం ఆనవాయితీగా మారింది. అంతేగాకుండ ఒకసారి చోరీకి పాల్పడ్డ ముఠాసభ్యులు మళ్ళీ విడివిడిగా ముఠాలుగా ఏర్పడటం, ఇతర రాష్ట్రాల్లో ఉన్న మధ్య దళారీలతో నేరుగా సంబంధాలు పెట్టుకొని కొత్త వారితో చోరీలు, చేయించడంతో పోలీసులకు నేరస్థులను పట్టుకోవడంలో కొత్త సవాళ్ళు ఎదురవు తున్నాయి.

## అరికట్టే బాధ్యత అందరిదీ

ప్రాచీన చరిత్రకు సంబంధించిన ఆధారాలు దొంగల బారిన పడుతున్న తీరు ప్రభుత్వ అశ్రద్ధకు ప్రత్యక్ష తార్కాణంగా మారుతోంది. అధికారులు నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరించడం బాధాకరం. అయితే కేవలం ప్రభుత్వాన్నే నిందించడం, పోలీసులనే బాధ్యులను చేయడం కూడా సరికాదు. అపురూప చరిత్రను రక్షించుకోవాల్సిన అవసరం సమాజం మీద కూడా వుంది. న్యాయవాదులు, రంజీక్రీడాకారులు, కళాకృతులతో భారీ వ్యాపారాలు చేసేవారు కూడా ప్రాచీన విగ్రహాల తరలింపులో భాగస్వాములవుతున్నారనే విషయం ఆందోళన కలిగిస్తుంది.

- (కడప నుంచి వేంపల్లి గంగాధర్,
హైద్రాబాద్ నుంచి అనంచిన్ని
వెంకటేశ్వరరావు)

# దేవతామూర్తుల విలవిల

## నిఘా పెంచాం, ఎవ్వరినీ వదలం!

### నగర పోలీస్ కమిషనర్ పేర్వారం రాములు

రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో చోరీకి గురవుతున్న విగ్రహాలను నగరానికి చెందిన టాస్క్‌ఫోర్స్ విభాగం చాక చక్యంగా పట్టుకుంటుందని, విగ్రహ చోరీ ముఠాలపై నిఘా పెంచామని, ఈ ముఠాల వెనుకవున్న ఎవ్వరినీ వదలమని హైదరాబాద్ నగర పోలీసు కమీషనర్ పేర్వారం రాములు చెప్పారు. 'విజయవిహారం' ప్రత్యేక ప్రతినిధితో విగ్రహాల చోరీలను అరికట్టేందుకు తీసుకుంటున్న చర్యలపై కొద్దిసేపు ముచ్చటించారు.

**గత ఏడేళ్ళ నుంచి ఇప్పటి వరకు ఎన్ని కేసులలో ఎంతమందిని పట్టుకున్నారు?**

1995 నుంచి ఇప్పటివరకు 27 కేసులలో 48 మందిని పట్టుకున్నాం. ఒక కేసులో ఒక న్యాయవాదిని, మరో కేసులో మాజీ రంజీ క్రికెట్ ఆటగాడిని, మరో 4 కేసులలో రాజకీయచరిత్ర కల్గిన వారిని అరెస్టు చేయడం జరిగింది.

**ప్రధానంగా ఎలాంటి విగ్రహాలను ఈ ముఠాలు స్మగ్లింగ్ చేస్తున్నాయి?**

లక్ష్మి, సీత, రామ, లక్ష్మణ, ఆంజనేయ విగ్రహాలు ఉండగా, ఇటీవల కాలంలో చాలా ముఠాలు శిథిలమవుతోన్న ఆలయాల నుంచి చోరీ చేస్తున్న సంఘటనలు వెలుగులోకి వస్తున్నాయి. కొన్ని గ్రామాల్లో అంతటి ప్రాముఖ్యత గల దేవాలయాలున్న విషయాలు చోరీ జరిగిన తరువాత తమ దృష్టికి వస్తున్నాయని, అందుకు తగ్గ చర్యలు చేపట్టేందుకు ఆయా శాఖల అధికారులతో చర్చిస్తున్నాం.

**ఇతర రాష్ట్రాలకు చెందిన విగ్రహాలను పట్టుకున్నారు కదా? వివరిస్తారా?**

1999లో తమిళనాడులో 17వ శతాబ్దానికి చెందిన ఆల్వార్ కులశేఖర విగ్రహాన్ని పట్టుకోగా అదే ఏడాది సెప్టెంబరు 29 రాత్రి నెల్లూరు జిల్లా చిత్తూరు గ్రామంలోని 18వ శతాబ్దంనాటి చెన్నకేశవ ఆలయం నుంచి సుమారు 3 కోట్లు విలువైన విష్ణువు, శ్రీదేవి, భూదేవి విగ్రహాలను గత ఏడాది ఫిబ్రవరి 1న డైరక్టరేట్ ఆఫ్ రెవిన్యూ ఇంటెలిజెన్స్ (డి.ఆర్.ఐ.) స్వాధీనం చేసుకున్నప్పటికీ ముఠా సభ్యుల కోసం ఈ ఏడాది మే 22 వరకు వేచి వుండి ఢిల్లీలో ముగ్గుర్ని అరెస్టు చేశాం. నగరంలో టాస్క్‌ఫోర్స్‌కు చెందిన షేక్ మహ్మద్ ఇక్బాల్, యోగానంద్ బృందాలు ఇన్‌స్పెక్టర్లు, సూర్యనారాయణ, ధనుంజయ్, చంద్రశేఖర్ తదితరులు కృషి చేస్తున్నారు.

**ఇటీవల ఎన్టీయార్ మ్యూజియం నుంచి విగ్రహాలు దొంగిలించడానికి పోలీసులు ప్రయత్నించారు కదా? దీనిపై మీరు తీసుకున్న చర్యలు ఏమిటి?**

ఇలా జరగటం దురదృష్టకరం. ఎన్టీఆర్ మ్యూజియంను రక్షించడానికి 20 మందితో కూడిన ఎపి.ఎస్.పి. పోలీసులు ప్రతిరోజు డ్యూటీ చేస్తున్నారు. జరిగిన సంఘటనకు వెంటనే స్పందించి, చోరీకి పాల్పడ్డ వారిని సస్పెండ్ చేయటమే కాకుండ చట్ట ప్రకారం చర్యలు తీసుకున్నాం. తప్పుచేసిన వారు ఏ స్థాయిలో ఉన్నా వారిని వదిలేది లేదు.

(చిత్రం-ఉ), నాగకన్య విగ్రహం, మహావీర్ విగ్రహం (పట్టుబడిన ముఠా చిత్రం-ఊ).

**2001** నమోదైన కేసులు : 5, అరెస్టైన వ్యక్తులు : 14 మంది, స్వాధీనం చేసుకున్న విగ్రహాల వివరాలు: శివ,పార్వతి,గంగ విగ్రహాలు(3), శ్రీరామ, సీత, లక్ష్మణ విగ్రహాలు మరియు చక్రం(4) (చిత్రం-అ), వేణుగోపాల స్వామి, రుక్మిణీ, సత్యభామ విగ్రహాలు(3), శివ, పార్వతీ, గంగ విగ్రహాలు(3)

## విగ్రహ చోరీకొచ్చి... తలనీలాలు దోచుకెళ్ళారు

"చచ్చినోడిపెళ్ళికి వచ్చిందే కట్నం' అనే చందాన సింహాచలం అప్పన్న స్వామి ఆలయానికి విగ్రహ చోరీకి వచ్చిన దొంగలకు అక్కడ పోలీసులు పహారా కనిపించింది. ఎలాగో వచ్చాం కదా అని దగ్గరలోని కేశఖండన గోడౌన్ వెళ్ళి అక్కడ భక్తులు సమర్పించిన తలనీలాలను దోచుకెళ్ళారు. తలనీలాలు తీసుకెళితే ఏం వస్తుందోనని అనుకుంటున్నారా?... అదే మరి తెలివితక్కువ తనం అంటే - వాళ్ళు తీసుకెళ్ళిన 847 కేజీల తలనీలాలు సుమారు పదిలక్షల విలువ వుంటుందని అధికారులు గుర్తించారు. దీనిపైన దేవదాయశాఖ దర్యాప్తుకు ఆదేశించింది... తలనీలాలు దోచుకున్న దొంగల ఆచూకీ కనిపెట్టలేకపోయింది.

## ఎన్టీఆర్ మ్యూజియంలో వరుసగా రెండోచోరీ

రాష్ట్రంలో రాజకీయ చైతన్యం కలిగించిన సినీ ఆరాధ్యదైవం కీ॥శే॥ ఎన్టీఆర్ పేరిట ఏర్పాటు చేసిన మ్యూజియం నుంచి ఇప్పటివరకు రెండుసార్లు చోరీకి గురైంది.

రామారావు మరణానంతరం చెలరేగిన వివాదంలో హైకోర్టు ఉత్తర్వుల మేరకు మ్యూజియానికి రాష్ట్ర ప్రభుత్వం 1996, జనవరి 25న పోలీసులను నియమించింది. ఈ మ్యూజియంనుంచి గత ఏడాది సుమారు లక్షన్నర విలువచేసే కలప తొలిసారిగా అపహరణకు గురైంది. ఇక్కడ మ్యూజియం మొదటి అంతస్తులో నాలుగు గదులు ఉండగా అందులో వెండి విగ్రహాలు, బంగారు తాపడంతో చేసిన జ్ఞాపికలు ఉన్నాయి. లక్ష్మీదేవి, గణపతి, వెంకటేశ్వరస్వామి, శివపార్వతి, సాయిబాబ తదితర విగ్రహాలు వెండితో తయారు చేసినవి వందకుపైగా వున్నాయి.

రెండవ అంతస్తులో గంధం, టేకు తదితర విలువైన కలపతో తయారు చేసిన విగ్రహాలు ఉన్నాయి. వీటన్నింటినీ రక్షణగా 20 మంది ఎ.పి.ఎస్.పి. టీఎస్‌పల్లి 10వ బెటాలియన్‌కు చెందిన పోలీసులు విధులు నిర్వహిస్తున్నారు. వీరిలో ఆంజనేయులు, గోవింద్‌సింగ్‌లు గంధం చెక్కతో తయారుచేసిన ఐదు విగ్రహాలను అదే బెటాలియన్‌కు చెందిన వ్యానులో టీఎస్‌పల్లికి తరలిస్తూ మార్గ మధ్యంలోని సెక్యూరిటీలో దొరికి పోయారు. తొలిసారిగా జరిగిన చోరీ విషయంలో పోలీసులు ఇంత వరకు అరెస్టు చేయలేదు. రెండోసారి జరిగిన చోరీని ఏకంగా పోలీసులే చేయడం పోలీసు ఉన్నతాధికారులను కలవరపరిచింది.

# విషసంస్కృతి రొంపిలో హంపి

హంపి...
ఒకప్పటి చరిత్ర స్థావరం
విజయనగర సామ్రాజ్య సంస్థానం
రత్నాల రాశులు
అవన్నీ నేడు అందమైన కలలు మాత్రమే
హంపిలో ఇప్పుడేం జరుగుతోంది?
విలువలు పతనమై
చరిత్ర శిథిలమై
హిప్పీల స్వైర విహారంతో
మాదక ద్రవ్యాల రాశులతో
స్మగ్లింగు కుతంత్రాలతో
చరిత్ర సమాధిపైన
అపరిశుభ్రంగా.... అపవిత్రంగా
ఇదీ నేటి 'హంపి'!

మళ్లీ మరోసారి హంపి వార్తల్లోకి వచ్చింది. చరిత్రపరంగా కాదు. చరిత్ర శిథిలమై...విలువలు పతనమై! విచ్చలవిడిగా అక్కడ సాగుతున్న విందు, వినోదాలతో, హిప్పీల విహారాలతో తన ఉనికిని తాను కోల్పోతూ ప్రపంచ వారసత్వ స్మారక స్థలాల జాబితాలోంచి తొలగిపోతూ మరోసారి వార్తల్లోకి వచ్చింది. యునెస్కో నిర్ణయంతో హంపి చరిత్రకు శాశ్వత సమాధి నిశ్చయమైంది. ఈ పరిణామ క్రమంలో... ఈ వ్యాసం

350 ఎకరాల విస్తీర్ణంలోని హంపి చరిత్ర సంపద కాలగతిలో ఆ వైభవ చిహ్నాలు శిథిలమైపోయాయి. ఇంత సువిశాల వైశాల్యంలో ఖండ ఖండాలుగా పడివున్న శిల్పాలను సంస్కరించి, మునుపటి రూపురేఖల్ని వాటికి అద్దడంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విఫలం కావడంతో ప్రపంచ వారసత్వ స్మారక స్థలాల జాబితాలోంచి హంపిని తొలగించేందుకు యునెస్కో నిశ్చయించింది. ఈ విషయంపై ఆందోళన వ్యక్తం చేస్తూ పారిస్‌లోని భారతీయులు డాక్టర్ వసుంధరా ఫిలోబిజా ఆధ్వర్యంలో కేంద్ర ప్రభుత్వానికి విన్నవించుకోవడంతో హంపి సమస్య వెలుగులోకి వచ్చింది.

గత ఏడాది చివరలో ఆదివారం ఆంధ్రభూమి (26 డిసెంబర్ 1999) సంచికలో 'గుప్తనిధుల వేటలో శిథిలమవుతున్న చరిత్ర' అనే వ్యాసంలో ప్రపంచవ్యాప్తంగా గుర్తించిన 288 వారసత్వ కట్టడాలలో 16-17 శతాబ్దాలకు చెందిన హంపి కూడా వున్నట్టు తెలుసుకుని రెండుమాసాలు కూడా పూర్తికాక ముందే హంపిని జాబితాలోంచి తొలగిస్తూ యునెస్కో నిర్ణయం తీసుకుంది. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలోని యునెస్కో దాని అనుబంధ సంస్థ అంతర్జాతీయ పురాతనకట్టడాలు, స్థలాల పరిరక్షణ సంఘం ఏర్పడింది. 1977లో సంఘంలో చేరిన భారతదేశం పురాతన కట్టడాలు, స్థలాలు, చరిత్రను కాపాడుకోలేక తన అస్థిత్వాన్ని కోల్పోతోంది. అందులో భాగంగానే 'హంపి' తొలగింపు కూడా. ఒకవైపు విదేశీ హిప్పీల ఆగడాలు, అరాచకాలు, మరోవైపు స్థానికుల అక్రమ వ్యాపారాలు, నాణ్యతలేని వస్తువులు, మాదక ద్రవ్యాలు మొత్తంగా ఏకమై హంపి చరిత్రకు ఉరితాడయ్యాయి. ప్రభుత్వాలు మొక్కుబడిగా కార్యక్రమాలు నిర్వహించి చేతులు దులుపుకోబట్టే ఈరోజు హంపికి ఈ దుస్థితి వచ్చింది. మరమ్మతులకు నోచుకోకుండా హంపి చరిత్ర శిథిల దశకు చేరుకుంది. హంపిని సందర్శించి వెళ్లిన యునెస్కో ప్రతినిధి బృందం ఇక్కడ జరుగుతున్న అక్రమ వ్యాపారాలు, హిప్పీల ఆగడాలు, అపరిశుభ్రత, అపవిత్రత, చరిత్ర శిథిలం..వంటి అంశాల్ని ప్రశ్నిస్తోంది? ప్రభుత్వ అదనపు కార్యదర్శి అచలామౌలిక్‌చే తనిఖీలు జరిపించి, ప్రజాభిప్రాయాలు స్వీకరించి అందించిన నివేదిక కూడా చెత్తబుట్టలోకి చేరింది. దీనిని చరిత్రకారులు విమర్శించడంతో మరోసారి మౌలిక్ ఆధ్వర్యంలోనే మరో కమిటీని వేసి ప్రభుత్వం చేతుల దులుపుకుంది. గంజాయి దమ్ము, బహిరంగ ప్రదేశాల్లో శృంగార చేష్టలు, స్థానికుల అక్రమ వ్యాపారాల, నాసిరకం వసతి గృహాలు, హిప్పీల ఆగడాలు, ప్రభుత్వ నిర్లక్ష్యం, అక్రమ భూ ఆక్రమణ వంటి అంశాలు ప్రధానంగా అచలా మౌలిక్ తన నివేదికను ప్రభుత్వానికి అందచేసింది. ఇదిలావుండగా వంతెనల నిర్మాణం వివాదాస్పదమైంది. హంపి-అనెగొంది ప్రాంతాలను కలుపుతు నిర్మితమవుతున్న వంతెనపై పెద్ద గొడవ ప్రారంభమైంది. తుంగభద్ర నదిపై నిర్మితమవుతున్న వంతెనకోసం పురావస్తుశాఖ అనుమతి తీసుకోలేదని, వాణిజ్య వ్యాపారం కోసమే రాజకీయ నాయకుల వత్తిడి మేరకు ప్రభుత్వం ఈ వంతెనలు ఏర్పాటుచేస్తోందని విమర్శలు ప్రారంభమయ్యాయి. ఎత్తుగా నిర్మిస్తున్న వంతెన వలన హంపి సహజ సౌందర్యం దెబ్బ తింటుందని అందుకోసమే అడ్డుకోవాలని ప్రభుత్వానికి సూచనలు అందాయి. అలాగే శిథిలమవుతున్న ప్రాచీన కట్టడాన్ని పరరిక్షించాలని పర్యాటక అభిమానులు, చరిత్రకారులు విన్నవించుకుంటున్నారు. కానీ ఇవేవీ ప్రభుత్వం దృష్టికి వెళ్లడంలేదు. ప్రభుత్వం ఇప్పుడు మా గోడు పట్టించుకోకుంటే హంపి గురించి కేవలం ఫోటోల రూపంలోనే చూడాల్సి వచ్చే పరిస్థితులు దగ్గరలోనే వున్నాయని చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు.హిప్పీల హంగామా!

దక్షిణ భారతీయులు పవిత్రంగా భావించే హంపి క్షేత్రం నేడు హిప్పీల స్వైర విహారంతో మాదక ద్రవ్యాల కేంద్రంగా మారింది. శంకరాచార్యుల తపస్సు చేసిన తుంగభద్రతా నదీ పరివాహక ప్రాంతంలో అపవిత్రత చోటు చేసుకుంది.



## అపరిశుభ్రత ఎక్కువ

హంపి గురించి ఏం చెప్పమంటారు? ఇక్కడ మంచి చరిత్ర వుంది. కానీ వీళ్లు చరిత్రను కాపాడుకుంటున్నట్టు కనపడ్డంలేదు. చరిత్రకు సంబంధించిన కట్టడాలపైనే బట్టలు ఆరేస్తున్నారు. అటుపక్కనే ఉతుకుతున్నారు. చరిత్రకట్టడాలన్నీ చెత్తతోనే నింపేస్తున్నారు. వీటినెవ్వరు శుభ్రపరుస్తున్నట్టు కూడా లేదు. విరూపాక్ష దేవాలయం దగ్గరే ముళ్లచెట్లు, మురికి కాల్వలు వున్నాయి. వెళ్లి చూడండి. నాకు బాధేసింది. కొంచెం కూడా పరిసర ప్రాంతాలన్ని శుభ్రంగా వుంచుకోవడం లేదు. ఆలయాల్లో మురికినీరు ఎక్కడికక్కడ ఆగిపోయి వాసన వేస్తున్నా ఎవరూ పట్టించుకోవడంలేదు. అసలు వీటన్నింటిని పరిశీలించడానికి సంరక్షించడానికి ఏదైనా ట్రస్ట్ లాంటిది ఒకటుందో లేదో కూడా తెలియదు. నిన్న మధ్యాహ్నం కృష్ణ మందిరంలో ఎవరో భోజనం చేసి మిగిలింది అక్కడే వదిలేసి వెళ్లిపోయారు. పురుగులు, దోమలు వాటిపై వాలుతున్నాయి. ఇంతలో కోతులు వచ్చి ఆ పాకెట్‌ను లాగెయ్యడంతో గుడి మొత్తం భోజనం పడింది. అటుగా వచ్చిన కొందరు టూరిస్టులు దానిని తొక్కుతునే మొత్తం తిరిగారు. ఇక చూడండి ఆ వాతావరణం ఎలావుంటుందో?

-జీని ఫామ్మింగ్,(ఇంగ్లండ్)

## హంపిని పరిరక్షించాలి

నాకు చిన్నప్పటినుంచి కూడా చరిత్రపట్ల ఆసక్తి



ఎక్కువ. విజయనగర రాజుల గొప్పతనం గురించి తెలుసుకుని హంపిని చూడ్డానికి వచ్చాను. చాలా బాగుంది. కట్టడాలన్నీ శిథిలమైపోతున్నాయి. కాపాడుకోవాల్సిన కీలక తరుణం ఇది. ఇంకొంత కాలం వీటిని ఇలాగే వదిలేస్తే అసలు ఆనవాళ్లు కూడా మిగలవు. ఇంత చరిత్రను ఎలా గాలికి వదిలేసారో చూడండి! మాదేముంది ఒకసారి వచ్చి అలా చూసి వెళ్లిపోతాం. వీటిని కాపాడుకోవాల్సిన బాధ్యత మీకుండాలి. అలా రక్షించుకోవాలని ఇక్కడెవరికి అనిపించడంలేదు. ఇక్కడి వస్తున్న టూరిస్టులకు కూడా వసతులు సరిగ్గాలేవు. నాణ్యత లోపించినవే అన్నీ అందుబాటులో వుంటున్నాయి. నాసిరకం వసతి గృహాలు ఇక్కడ ప్రధాన సమస్య. ఇక్కడ అన్ని వసతుల్ని చక్కగా ఏర్పాటుచేస్తే టూరిస్టుల సంఖ్య కూడా పెరుగుంది కదా! ఇవన్నీ మేము చెప్పడం కాదు. ఇక్కడున్న మీరే ఆలోచించుకోవాల్సినవి. ఏది ఏమైనా చరిత్రను ఇప్పటికైనా కాపాడుకోవాల్సిందిగా, పరిరక్షించుకోవాల్సిందిగా నా సూచన.

-జోన్యా కోర్టా (అమెరికా)

## కావాల్సినవన్నీ రెడీ

హంపి...బాగానేవుంది. కావలసినవన్నీ ....కోరుకున్నది కోరుకున్నట్టు (?) ధొరుకుతోంది. ఇంకేం కావాలి. మేమం



వచ్చి నాలుగురోజులు దాటింది. ఇక్కడ ఎలాటి ఇబ్బంది లేదు. ఇక్కడ ఎలాంటి ఇబ్బంది లేదు. మాపైన ఏ విధమైన ఆంక్షలు లేవు. హంపి చరిత్రగురించి ఇక్కడ లోయలు, కొండ ప్రాంతాల్లో నిర్మించిన కట్టడాల గురించి, దేవాలయాల్లోని శిల్ప కళా నిర్మాణాల గురించి నిన్న మా గైడ్ వివరిస్తుంటే విని ఆశ్చర్యపోయాము. వెళ్లేలోగా మరోసారి అన్ని ప్రాంతాల్ని సందర్శించి వెళ్లాలని అనుకున్నాం. టూరిస్టులకు ఇక్కడ సరైన వసతులు లేవు. భోజనం కూడా ఇబ్బంది అవుతోంది. వీటిని దృష్టిలో పెట్టుకుని ఏవైనా ఏర్పాట్లు చేస్తే బాగుంటుందని మా సూచన. ఇక్కడున్న ప్రతి కట్టడానికి చరిత్రవుంది. చిన్న చిన్న అంశాలు కూడా తెలుసుకోదగ్గవే. ఇక్కడికి వచ్చిన తర్వాత మాకు చాలామంది మిత్రులు పరిచయం అయ్యారు. చాలాదేశాలనుంచి చాలామంది వచ్చారు. అందరు బాగా కలిసిపోతున్నారు. అందరం బాగా విడమరిచి మాట్లాడుకుంటున్నాం. చర్చించుకుంటున్నాం. మాకు ఈ హంపి పర్యటన సంతోషంగా వుంది. కావాల్సినంత మజాగా కూడా వుంది

-జుర్పికో, ష్లింగ్మార్ (ఫ్రాన్స్)

విలాస జీవితానికి అలవాటు పడ్డ విదేశీయుల రాకతో విరూపాక్ష ప్రాంతంలోని తుంగభద్ర నది ఒడ్డు మినీ గోవా బీచ్‌ను మరపిస్తుంది. బ్రాంది, సారా, హెరాయిన్, గంజాయి దగ్గరనుంచి ప్రతి విలాస వస్తువు అక్కడ లభిస్తుంది. గోవా ద్వారా సరిహద్దు దాటిన హిప్పీలు హంపికి చేరుతారు. ఇక్కడే వీరు వారాలు, నెలల తరబడి వుండిపోతారు. వీరికోసం ప్రత్యేకమైన రెస్టారెంట్స్, వసతి గృహాలు కూడా పుట్టుకొచ్చాయి. చిన్న చిన్న గదులను కూడా ఎనభై రూపాయలనుంచి వెయ్యి రూపాయల వరకు అద్దె వసూలు చేస్తుంటారు. స్వదేశీయులకు గదులు దొరకడం చాలా కష్టం.

హిప్పీలు ఇక్కడికి రావడానికి ప్రధాన కారణం ఎలాంటి ఇబ్బందులు లేకపోవడమే. పోలీసుల వేదింపులుగానీ, చట్టపరమైన ఇబ్బందులుగానీ అసలుండవు. మాదక ద్రవ్యాలు యధేచ్ఛగా లభించడంవలన. ఎలాంటి ఆంక్షలు లేకపోవడంవల్ల రానురాను వేలసంఖ్యలో హిప్పీలు ఇక్కడికి బెంగుళూరు నుంచి, గోవానుంచి వచ్చేస్తున్నారు. మత్తుపానీయాలు ఎక్కడైనా దొరుకుతాయి. మాదక ద్రవ్యాలు సేవించవచ్చు. ఆ మత్తులో ఆడ, మగ హద్దులు దాటి ప్రవర్తించనూ వచ్చు. ఇదే అభిప్రాయాన్ని జుర్పికో, ష్లింగ్మార్ (ఫ్రాన్స్) కాస్త గుంభనంగా వ్యక్తం చేసింది.

స్వదేశీయులు ఏవీ దొరక్క ఇబ్బంది పడుతుంటే విదేశీయులు మాత్రం సర్వభోగాలు అనుభవిస్తారు. తీసుకున్న వసతి గృహాలలో కూర్చుని రాత్రంతా నచ్చినంత తాగుతు, మెచ్చినంత సుఖాన్ని అనుభవిస్తూ, తింటూ, కౌగిలింతలతో, ముద్దులతో శృంగారంలో గడిపేస్తుంటారు. వీదేశీయులకు కావాల్సినన్ని మాదక ద్రవ్యాలు కూడా అతి సులువుగానే లభిస్తాయి. వాటి విక్రేతలు నది ఒడ్డున అక్కడక్కడ గుడిసెలు నిర్మించుకున్నారు. స్వదేశీయులు అక్కడికెళ్లి అడిగితే తిట్లు తినాల్సిందే. అవి కేవలం విదేశీయులకోసమే ఇలాంటి వ్యాపారాలు సాగుతున్నాయి. ఇలాంటి వ్యాపారాలు సాగిస్తున్న అనేకమందికి చదువు రాదు. కానీ ఆ వ్యాపారంకోసమే వారు ఇంగ్లీషు నేర్చుకున్నారు. విదేశీయులు హంపిలోని స్థానికులతో త్వరగా ఆత్మీయతను, ప్రేమాభిమానాన్ని కురిపించి పరిచయం పెంచుకుంటారు. తర్వాత వారాలు, నెలల తరబడి ఇక్కడే వుండిపోతారు.

అర్ధనగ్నంగా తిరిగే ఈ విదేశీ స్త్రీ, పురుషులు ఆనందం కలిగినపుడు, కొత్తగా కలుసుకున్నప్పుడు ఎక్కడపడితే అక్కడ దారుల్లో, ఆలయాలలో తమప్రేమను పంచుకుంటు ఉంటారు. కౌగలించుకోవడం, ముద్దులాడడం వంటి దృశ్యాలు అత్యంత సహజం. హంపిలోకి ప్రవేశిస్తున్నప్పుడు ఒంటినిండా బట్టలు కట్టుకుని వున్న విదేశీయులు ఆ తర్వాత ఒంటిమీది బట్టలు తగ్గించుకుని పేలికల్లాంటి రెండు వస్త్రాలను కట్టుకుని తొడలు, ఎదను ప్రదర్శించుకుంటూ పురుషులతో తిరుగుతుంటారు. అక్కడి స్థానిక బ్రోకర్లు హిప్పీలు బస్‌లోంచి దిగడంనుంచి ఎరవేసి వసతి గృహాలకు తీసుకువెడతారు. టూర్‌పై వచ్చిన వివిధ విద్యాసంస్థల విద్యార్థులు విదేశీయుల వెనకపడి వారిని గమనిస్తూ ఆనందపడుతుంటారు.

### గుప్తనిధుల అన్వేషణ

అంగళ్లలో రత్నాల రాసులుపోసి అమ్మిన నగరం హంపి. ఇక్కడికి సందర్శనార్థం వచ్చే స్వదేశీయులు, విదేశీయులు వివిధరకాల పరిశోధనలు, పరిశీలనల పేరుతో సందర్శిస్తూ గుప్తనిధులకోసం అన్వేషణ సాగిస్తున్నారు. ఇలా ఎంతోకాలంగా సాగుతునే వుంది. అమెరికా, స్విట్జర్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, ఇంగ్లండ్ దేశాలకు చెందిన విదేశీయులు ఈ ప్రదేశాన్ని ఎక్కువగా సందర్శిస్తుంటారు. 1995లో సోనాపురం, విరూపాపుర గడ్డలప్రాంతాల మధ్యలో తవ్వకాలుజరిగాయి. ఆ సమయంలో స్థానికులు విదేశీయులన్ని పసిగట్టి పట్టుకుని పోలీసులకు అప్పగించిన సంఘటన వెలుగులోకి వచ్చింది. పోలీసుల విచారణలో ఒక పథకం ప్రకారం ఈ సంఘటన జరిగినట్టు వెల్లడైంది. విరూపాపుర గడ్డ ప్రాంతంలో మొదట డాక్యుమెంటరీ ఫిలిం చిత్రీకరణను మొదలుపెట్టి ఆ తర్వాత నిధికోసం అన్వేషించి తవ్వకాలకు శ్రీకారం చుట్టమని పట్టుపడిన జర్మనీ దేశస్తులు చెప్పారు. కేసు నమోదైంది లేనిదీ తెలియరాలేదు. స్థానికులు మాత్రం ఇప్పటికీ ఈ సంఘటనను మరిచిపోలేదు. ఇలాంటి సంఘటనలు అక్కడితోనే ఆగిపోలేదు. ఇప్పటికీ నిరాటంకంగా సాగుతునే వున్నాయి. హంపి సంస్థానంలో కొందరు దుండగులు గుప్తనిధులకోసం తవ్వకాలు సాగిస్తునే వున్నారు. అనెగొంది ప్రాంతంలోని హయ్యాళ కాలానికి చెందిన నల్లరాతి స్థంభాల కట్టడం వద్ద, ఆలయ మండపంలో గుర్తుతెలియని వ్యక్తులు గుప్తనిధులకోసం తవ్వకాలు జరిపినట్టు ఆధారాలు లభించాయి. ప్రసిద్ధి చెందిన ఈ ఆలయాల్లోనూ, మంటపంలోనూ గత కొంతకాలంగా దుండగులు గుప్త నిధులకోసం తవ్వకాలు జరుపుతున్నట్టు సమీప ప్రాంతాల రైతులు వెల్లడించారు. విజయనగర సామ్రాజ్యాధీశుల కాలంలో శ్రీకృష్ణదేవరాయలు నిర్మించినట్టు చెపుతున్న ఈ పురాతన ఆలయంలో గుప్తనిధులు వున్నట్టు భావించి దుండగులు తవ్వకాలు జరిపినట్టు స్థానికులు వివరిస్తున్నారు.

హచ్చప్పయ్య మఠంలోని నల్లరాతి స్తంభాల్లో ఒకదాన్ని దుండగులు ధ్వంసం చేసారు. నందులను పెకలించి పక్కన పడేసారు. హంపిలోని పలు ఆలయాల్లో చారిత్రాత్మక కట్టడాలలో ఇప్పటికే గోతులు కనిపిస్తాయి. విజయనగర సామ్రాజ్య చరిత్ర గురించి స్వదేశీయులు కంటే విదేశీయులే ఎక్కువగా తెలుసుకుంటారు. ముందుగా విదేశీయులు ఇక్కడికి రాగానే హంపి గురించి పరిశోధన, చరిత్ర అంశాలను అధ్యయనం చేస్తారు. ఆ తర్వాత గుప్తనిధుల అన్వేషణ ప్రారంభిస్తారు. మకాంను హంపినుంచి హోస్పేటకు మారుస్తారు. ఆలయాల ప్రాంగణంలోని శాసనాలను పరిశీలిస్తారు. ఆ శాసనాల్లోని లిపిని అధ్యయనం చేసి అసలు కార్యక్రమంలోకి అడుగుపెడతారు. గుప్తనిధుల అన్వేషణకు శ్రీకారం చుటతారు. హంపినుంచి అనగొండికి వెళ్లి దారిలో తుంగభద్ర నది గట్టుపైన వున్న తల్వారి గట్టు ప్రాంతంలో 1996 ఫిబ్రవరిన ఫ్లేమ్స్ ఇన్ ప్యారడైజ్ ఇంగ్లీషు సినిమా షూటింగ్ ప్రారంభమైంది. ఫ్రాన్స్, స్విట్జర్లాండ్ దేశాలకు చెందిన ఈ సినిమాకు మార్కోస్ దర్శకత్వం వహించాడు. షూటింగ్‌కోసం స్థానికులు పూజలు చేసే దేవత గుడి దగ్గరే మకాం వేయడం వివాదాస్పదమైంది. షూటింగ్ సిబ్బంది దగ్గర డ్రిల్లింగ్ యంత్రాలు, పారలువుండడం పలు అనుమానాలకు తావిచ్చింది. షూటింగ్ జరుగుతున్న ప్రాంతంనుంచి ఫర్లాంగ్ దూరంలో రోడ్డు బ్లాకుచేసి వుండడంతో షూటింగ్‌పై కన్నేసి వుంచిన స్థానికులు ఆందోళనకు దిగడంతో షూటింగ్ ఆగిపోయింది.

గతంలో ఓ పశువుల కాపరికి ఈ ప్రాంతంలో బంగారు ముక్క దొరకడంతో ఈ విషయం ఆనోట, ఈనోటా దేవాలయాల్లో నిధులు వున్నాయనే ప్రచారం జరిగింది. దాంతో అనేక మంది నిధులకోసం లంకెబిందెలకోసం ఈ ఆలయాల్లో తవ్వకాలు మొదలుపెట్టారు. అసలే ఆలనా పాలనా కరువైన చరిత్ర కట్టడాలు ఈ నిధులకోసం జరిపే వేటలో మరింత శిధిలమయ్యాయి.

ప్రాచీనుల చరిత్ర, సంస్కృతికి సంబంధించిన ఆనవాళ్లను కాపాడుకోవాల్సిన బాధ్యత పురావస్తు శాఖపైవుంది. కానీ ఆ శాఖకు ఏదీ పట్టదు. ఆలయాల్లోని ఎన్నో విగ్రహాలు దొంగలపరమయ్యాయి. భారతీయ ధార్మిక జీవనానికి, సంస్కృతికి ఆధ్యాత్మికతకు గుళ్లు, గోపురాలు, శాసనాలు గీటురాళ్లు. పూర్వీకుల పరిపాలన విధానాన్ని కీర్తి ప్రతిష్టలను మరో తరానికి అందించడానికి చరిత్ర అసలైన ఆధారం. గుప్తనిధులకోసం ఆలయాల్లోకి వెళ్లడం అక్కడి విగ్రహాలను పెకలించడం జరుగుతోంది. హంపికి తలమానికంగా, చరిత్రలో ప్రాభవ వైభవాలు చవి చూసిన ఈ అపూర్వ కట్టడాలు నేటు ముళ్ల మొక్కల మధ్య మోడుబారివున్నాయి. కళాత్మకమైన శిల్పసంపద కంపచెట్ల చాటున కనుమరుగైపోతోంది. ప్రధాన నిర్మాణాలు ఎన్నో శిధిలావస్థకు చేరుకున్నాయి. అధికారుల నిర్లక్ష్యానికి నిదర్శనంగా చారిత్రాత్మక ఆనవాళ్లు ఎన్నో చోరీకి గురయ్యాయి. పర్యవేక్షణలో లోపంగా విగ్రహాలు, కట్టడాలు శిధిలం కావడం చూడవచ్చు. విరిగిపోయిన విగ్రహాలు అలాగే వున్నాయి. ఇవి మరమ్మతులకు కూడానోచుకోలేదు.

ప్రాచీన శిల్ప కళా సౌందర్యానికి ఒకప్పటి సామ్రాజ్య ఘనతను చాటి చెప్పే హంపిని పురావస్తు శాఖవారు అభివృద్ధి పరిచి భద్రతను పటిష్టం చేసి, చరిత్రను సంరక్షించాల్సిన అవసరం ఎంతైనా వుందని స్థానికులు కోరుతున్నారు.

-వేంపల్లి గంగాధర్

ముఖచిత్ర కథనం

# ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధక్షేత్రాలు

వేంపల్లి గంగాధర్


నాగార్జున కొండపై బుద్ధప్రతిమ

తెలుగునాట పర్యాటక ప్రాంతాల్లో బౌద్ధక్షేత్రాలది ప్రత్యేకస్థానం. క్రీస్తు పూర్వమే బౌద్ధం ఈ నేలపై విస్తరించింది. బుద్ధుని బోధనల వెలుగులు ఇక్కడ ప్రసరించాయి. తెలుగునేల బౌద్ధాన్ని స్వాగతించింది. అక్కున చేర్చుకుంది. గుంటూరు, కృష్ణ, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం, ప్రకాశం, కడప, కరీంనగర్ మొదలైన జిల్లాల్లో లభించిన బౌద్ధం ఆనవాళ్ళే ఇందుకు సాక్ష్యం. ఇవాళ బౌద్ధాన్ని తన సైద్ధాంతిక భూమికగా దళితవాదం స్వీకరించింది. అయినప్పటికీ బౌద్ధం ఏ ఒక్కరికో పరిమితం కాదు. ఇది మానవాళికి వెలుగుచూపే జీవితదర్శనం. అందుకే బౌద్ధఆరామాలు, బౌద్ధస్థూపాలు, బౌద్ధం విలసిల్లిన ప్రాంతాలకు అన్నివర్గాల నుంచి ఆదరణ లభిస్తోంది. కేంద్ర, రాష్ట్ర పురాతత్వశాఖలు ఈ బౌద్ధకేంద్రాల్ని సంరక్షిస్తున్నాయి. కాగా వీటిని పర్యాటకప్రాంతాలుగా తీర్చిదిద్దడానికి రాష్ట్ర పర్యాటక శాఖ కృషి చేస్తోంది. ఈ దిశలో బౌద్ధం విస్తరణకు దోహదం చేస్తోంది. ఈ నేపథ్యంలో తెలుగునాట బౌద్ధక్షేత్రాల చరిత్రను, వర్తమాన స్థితిగతుల్ని ప్రతిఫలించే కథనమిది.

మౌర్యులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు చరిత్రలో బౌద్ధమతాన్ని ఆదరించారు. ఆచరించారు. బౌద్ధం పశ్చిమాన కొంకణ, అపరాంత దేశాల్లో, తూర్పున కళింగ, ఆంధ్రదేశాల్లో వ్యాపించి క్రమక్రమంగా కావేరీ మైదానంపైనున్న చోళ, పాండ్య, చేర దేశాల్లోకి విస్తరించింది. దక్షిణ భారతదేశంలో బౌద్ధానికి కేంద్రం ఆంధ్ర ప్రాంతం. అందువలన ఇక్కడి విహారాల్లోనే ప్రణాళికలు, నిర్మాణాల నమూనాలు రూపు దిద్దుకొని అనంతరం తమిళ, కర్ణాటక ప్రాంతాల్లోకి పరివ్యాప్తమయ్యాయి. శాతవాహనుల కాలంలో బౌద్ధమతం ఉన్నతిని పొందింది. ప్రపంచప్రసిద్ధి చెందిన అమరావతి స్థూపాన్ని వీరి కాలంలోనే నిర్మించారు. థాయ్‌లాండ్, జావా, సుమత్రా వంటి దేశాల బౌద్ధులు అమరావతి స్థూపాన్నే నమూనాగా తీసుకున్నారు. శాతవాహన రాజుల


అమరావతి బౌద్ధస్థూపం (నమూనా)



ఉండవల్లి గుహలు ఇవే!



శాలిహుండం స్థూపం

సహకారంతో ఆచార్య నాగార్జునుడు కృష్ణానదీ లోయలో అయిదు అంతస్తుల 'పారవత విహారం' నిర్మించడం విశేషం. క్రీస్తు శకం నాలుగో శతాబ్దంలో పాహియాన్, ఏడో శతాబ్దంలో హుయాంగ్‌త్సాంగ్, ఇత్సింగ్‌లు నాగార్జునకొండను సందర్శించారు.

రాష్ట్రవ్యాప్తంగా 52 బౌద్ధ ప్రాంతాలను రాష్ట్ర పర్యాటకశాఖ గుర్తించి (వివరాలు మేప్‌లో వున్నాయి.) వాటి అభివృద్ధికి కృషి చేస్తోంది. సిరిపల్లి, కళింగపట్నం, శాలిహుండం, రామతీర్థం, మంగమ్రిపేట, బావికొండ, శంకారం, కొత్తూరు, లింగరాజుపాలెం, పిఠాపురం, కొడవలి, కాపవరం, ఆదుర్రు, గుట్టపల్లి, అశ్వరావుపేట, అల్లూరు, గుమ్మడిదుర్రు, గుడివాడ, ఘంటశాల, జగ్గయ్యపేట, నేలకొండపల్లి, తిరుమలగిరి, ధూళికట్ట, కొండాపూర్, గాజులబండ, ఫణిగిరి, ఏలేశ్వరం, నాగార్జునకొండ, అమరావతి, రెంటాల, భట్టిప్రోలు, చందవరం, దూపాడు, చిన్నగంజం, పెద్దగంజం, కనుపర్తి, నందలూరు, బుద్ధమ్, కోటిలింగాల, గోపాలపట్నం, పావురాలకొండ, ధారపాలెం, దంతపురం, ఆరుగొలను, పాసిగాం, గోలి, మంచికల్లు, ఉప్పుగుండురు మొదలైన ప్రాంతాల్లోని బౌద్ధం ఆనవాళ్ళను సంరక్షించడానికి, వాటిని ప్రచారం చేయడానికి కృషి చేస్తున్నారు.

బౌద్ధ యాత్రాస్థలాల అభివృద్ధి కోసం ఇటీవల కూడా కొన్ని ప్రతిపాదనలు తయారుచేశారు. విశాఖపట్నం, మెదక్, శ్రీకాకుళం, గుంటూరు, కృష్ణా, ప్రకాశం జిల్లాల్లో వీటి సంరక్షణ కోసం కేంద్ర ప్రభుత్వానికి నివేదిక అందజేశారు. కాగా, కొన్ని చోట్ల ఎవరికీ పట్టని చరిత్ర శిథిలాలుగానే బౌద్ధం ఆనవాళ్ళు కనుమరుగు అవుతున్నాయి. మట్టిపొరల మధ్యే మహాచరిత్ర సమాధి అవుతోంది.

## తొలి బౌద్ధారామం 'బైరాగి గుట్ట'

రాయలసీమలో తొలిసారిగా బౌద్ధసంస్కృతికి చెందిన అవశేషాల ఆనవాళ్ళు బయల్పడిన ప్రాంతం కడప జిల్లాలోని నందలూరు. 1912-13లో ప్రప్రథమంగా నందలూరునుంచి పొత్తపి గ్రామానికి వెళ్ళేమార్గంలో బైరాగిగుట్ట (లంజకనుమగుట్ట) వద్ద బౌద్ధారామాలు వున్నట్లు తెలిసింది. 1963లో తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఇక్కడ సర్వే నిర్వహించిన తర్వాత రాష్ట్ర పురావస్తుశాఖ ఆధ్వర్యంలో 1979లో ఈ బైరాగిగుట్ట దక్షిణ ప్రాంతంలో జరిగిన తవ్వకాల్లో 15 చిన్న సైజు బౌద్ధారామాలు వెలుగులోకి వచ్చాయి. కొన్ని బౌద్ధ స్థూపాలు, ఒక దీర్ఘచతురస్రాకారపు విహారం, బుద్ధుని పాదం, పెద్దపెద్ద ఇటుకలు, శాసనం, నాణాలు మౌర్యుల కాలంనాటివి లభించాయి. వీటిని క్రీస్తుపూర్వం రెండు, మూడు శతాబ్దాలకు చెందినవిగా గుర్తించారు.

బైరాగిగుట్ట దక్షిణంవైపు బాహుదా నది ప్రవహిస్తుండడం వల్ల పలువురు బౌద్ధ బిక్షువులు ఈ నదిలో స్నానమాచరించి బైరాగి గుట్టలో పడమటివైపు ఏడడుగుల ఎత్తులో రాతిలో మలచిన రహస్యగుహలో వుండేవారని కథనం. కేవలం అయిదు అడుగుల ఎత్తు వున్న ఈ గుహలోపల విశాలమైన గది వుండి, కూర్చునే వేదికలుకూడా వున్నాయి. ఈ గుహలోపల రెండడుగుల వ్యాసం కలిగిన బిలం రూపంలో వున్న మరో రహస్య సొరంగ మార్గం కూడా వుండడం విశేషం. ఇక్కడ బౌద్ధారామాలతోపాటు 30 వెండి నాణాలు, 116 చిన్న రాతి బొమ్మలు, పెంకులు కనుగొన్నారు. వీటిని కడపలోని భగవాన్ పురావస్తు శాఖ మ్యూజియంలో భద్రపరిచారు.

నందలూరు మండలంలోని పొత్తపి, టంగుటూరు, ఇసుకపల్లి తదితర ప్రాంతాల్లో చరిత్ర అవశేషాలు బయల్పడుతుంటాయి. పదకొండవ శతాబ్దిలో ఈ ప్రాంతాన్ని పాలించిన చోళరాజులు నందలూరులో సుప్రసిద్ధ సౌమ్యనాథ ఆలయాన్ని నిర్మించారు. పన్నెండవ శతాబ్దంలో పల్లవులు, కాకతీయులు, సాళువ, తుళప, విజయనగర రాజులు ఈ ప్రాంతాన్ని పాలించినట్లు చారిత్రక ఆధారాలున్నాయి. వీరి

### ఆర్యాసత్యాలు

జీవితంలోని దుఃఖాన్ని చూసి విసిగిపోయిన బుద్ధుడు దాన్ని నివారించడానికి ఆర్యాసత్యాలు ప్రవచించారు. ఇవి నాలుగు.

*1. దుఃఖం:* జీవితమే దుఃఖసాగరం.

*2. దుఃఖ హేతువులు:* కోరికలు దుఃఖాన్ని కలిగిస్తాయి. కోరికల వల్ల పునర్జన్మ కోరుతున్నాడు.

*3. దుఃఖ నిరోధం:* కోరికలకు మూలకారణం అవిద్య.

*4. నిరోధనోపాయాలు:* దుఃఖం మనిషిలో విస్తరించకుండా వుండాలంటే అష్టాంగమార్గాల్ని ఆచరించాలి. సమ్యక్‌దృష్టి, ఆలోచన, వాక్కు, క్రియ, జీవనం, శ్రమ, నిశ్చయం, ధ్యానం కలిగి వుండడం వల్ల దుఃఖ నిర్మూలన జరుగుతుంది.



నాగార్జునకొండ మీది బౌద్ధశిల్పకళా వైభవమిది. బోధివృక్షం కింద తపస్సుని ఆచరించిన అనంతరం జ్ఞానసిద్ధుడైన బుద్ధుడు. దు:ఖానికి హేతువుని కనుగొని దాని జయించడానికి అష్టాంగమార్గాలను ప్రబోధించాడు. ఈ అంశాలను శిష్యులకు ఉపదేశించే సన్నివేశానికి శిల్పులు జీవం పోసిన వైనమిది



నల్ల ఏనుగు కొండ



కొండపై అశోకుడి బౌద్ధధర్మ శిలాశాసనం

పాలనలో ఈ ప్రాంతంలో బౌద్ధమతం విశేషమైన ప్రాచుర్యాన్ని పొందినట్లు తెలుస్తోంది.

ఈ స్థూపాలు బయల్పడిన ప్రాంతాలను అభివృద్ధిపరిచి వెలుగులోకి తీసుకురావడానికి చర్యలు ఏవీ చేపట్టడంలేదు. ఈ బౌద్ధ ఆరామాల దగ్గరికి వెళ్ళాలంటే కూడా సరైన దారి లేదు. స్థూపాలు, గుహలోపలి భాగాలు క్రమంగా శిథిలమైపోతున్నాయి. రాయలసీమలో తొలిసారిగా బయల్పడిన బౌద్ధ ఆరామాల్ని నిర్లక్ష్యం చేస్తే తర్వాతి కాలానికి ఆనవాళ్ళే మిగలకపోవచ్చు.

## బౌద్ధధర్మ ప్రబోధాల శిలాశాసనాలు

మగధ సామ్రాజ్యాధినేత అశోకచక్రవర్తి కళింగ యుద్ధానంతరం పశ్చాత్తాపంతో బౌద్ధ ధర్మాన్ని గ్రహించి విస్తృత ప్రచారంచేశారు. అశోకుడు ధర్మ ప్రచారం కోసం వేయించిన శాసనాలు కళింగ, ఆంధ్ర, కర్నాటక ప్రాంతాల్లో చాలాచోట్ల కన్పిస్తాయి. కర్నూల్జుజిల్లా మగ్గలి మండలపరిధిలోని జొన్నగిరి- ఎర్రగుడి రహదారి మధ్యలో అశోకుడి బౌద్ధశాసనాలు కన్పిస్తాయి. జొన్నగిరి గ్రామానికి సుమారు మూడు కిలోమీటర్లదూరంలో పడమటి దిక్కున వున్నటువంటి 'నల్లఏనుగుకొండ' అనే గుట్టలో ఆరు శిలాఫలకాలపై అశోకుడి ధర్మ ప్రబోధనలు, 'పాళీ' భాషలో లిఖితమై వున్నాయి. క్రీ.పూ. 273-306 సంవత్సరాల మధ్య ఈ శాసనాలు చెక్కినట్లు తెలుస్తోంది. పత్తికొండ నియోజకవర్గ ప్రాంతంలో కప్పట్రాళ్ల, రాజుల మండగిరి, కుంకనూరు, మద్దికెర, అటికెలగుండు తదితర ప్రాంతాల్లో మరిన్ని శాసనాలు బయల్పడ్డాయి.

## శిల్పకళా వైభవం

అమరావతిలో బౌద్ధం ఆనవాళ్ళను తొలుత 1797లోనే కనుగొన్నారు. ఇది తొలినాళ్ళ బౌద్ధానికి విశిష్ట కేంద్రం. తర్వాత తవ్వకాల్లో ఇక్కడి శిల్పా కళా వైభవాన్ని వెలికితీశారు. ఇది దక్షిణ భారత దేశ బౌద్ధ క్షేత్రాలన్నింటిలోనూ గొప్పది. దీన్ని బౌద్ధ సాహిత్యం 'ధాన్యకటకం'గా చెప్తుంది. బోధిసత్త్వ నాగార్జునుడు అమరావతి స్థూపానికి శిలా ప్రాకారాన్ని నిర్మించాడు. చైనా యాత్రికుడు హుయాన్‌సాంగ్ తాను ధాన్యకటక విహారంలో అభిథమ్మ పీటకాన్ని అభ్యసించినట్లు చెప్పాడు. ఇక్కడ కనిపించే శిల్పం దేశంలోని బౌద్ధశిల్పంలోనే అత్యంత ఉజ్వలమైన రీతికి చెందింది. ఈ శిల్పం భారతీయ శిల్పకళకు పరాకాష్ఠ అని పెర్గూసన్ ప్రశంసించాడు. శ్రీలంక బౌద్ధబిక్షువు ధర్మకీర్తి ధాన్యకటకంలోని ఒక విహారాన్ని పునరుద్ధరించినట్లు సిలోన్ కాండీలోని శాసనం ద్వారా తెలుస్తోంది.



నేలకొండపల్లి వద్ద లభ్యమైన బుద్ధుని శిలాప్రతిమ



గాంధార వద్ద లభించిన **2-3** శతాబ్దాల నాటి బుద్ధుడు

అమరావతి శిల్పకళలో వివిధ దృశ్యాలను మలచడంలోనూ, జంతువులను సందర్భోచితమైన భంగిమల్లో రూపొందించడంలో శిల్పులు శ్రమపడ్డారు. పుష్పమాలలు, పద్మశిలలు మలచడంలో అసమాన ప్రతిభను కనబరిచారు. స్త్రీ, పురుషుల ప్రతిమలను ఆయా సందర్భాలకు అనువైన రీతిలో నిల్చునే తీరు, కూర్చునే తీరు, నడక తీరు, ముఖ భంగిమలు అన్నీ అందంగా, అపురూపంగా గోచరమౌతాయి. కృష్ణానదీతీరంలో వెలసిన అమరావతి శాతవాహనుల, ఇక్ష్వాకుల కాలంలో శిల్ప కళా వైభవాన్ని తీర్చిదిద్దుకుంది. ఇప్పుడు అమరావతిలో ఒక మ్యూజియం ఉంది. అక్కడే బౌద్ధం శిల్పకళా వైభవానికి సంబంధించిన ఆనవాళ్ళు కనిపిస్తాయి. ఇక్కడికి తెలుగువారే కాకుండా దేశవిదేశాల నుంచి కూడా యాత్రికులు వస్తుంటారు. ఇక్కడ ఉన్న అమరావతి స్థూపం

## అష్టాంగ మార్గాలు

**మ**నిషి మనిషిగా ప్రవర్తించడం కోసం. సమాజంలోని అన్ని వర్గాలవారు ఆనందంగా జీవితాన్ని గడపడం కోసం బుద్ధుడు అష్టాంగమార్గాల్ని బోధించారు. ఎంతసేపూ ప్రపంచ సుఖాలతో, అనుభవాలతో గడపడమే కాకుండా... అలాగని కఠోరమైన, మితిమీరిన ఉపవాసాలతో శరీరాన్ని బాధించడం కాకుండా మధ్యేమార్గంగా బుద్ధుడు వీటిని ప్రతిపాదించారు.

***1. సమ్యక్ దృష్టి:*** దీనినే విశ్వాసం అని కూడా అన్నారు. సారనాథ్‌లో బుద్ధుడు ప్రవచించిన నాలుగు ఆర్య సత్యాలు ఇవే.

***2. సమ్యక్ ఆలోచన:*** సరియైన ఆలోచనా విధానం కలిగివుండడం, సుఖాలను త్యజించడం. ఇతరుల చెడును ఊహించరాదు. కల్గించరాదు.

***3. సమ్యక్ వాక్కు:*** సత్యాన్నే ఉచ్ఛరించడం.

***4. సమ్యక్ క్రియ:*** సత్ ప్రవర్తన కలిగి వుండడం, దొంగతనం చేయకుండుట.

***5. సమ్యక్ జీవనం:*** సరియైన జీవన విధానం కలిగి వుండాలి. నీతి, నియమాలను ఉల్లంఘించరాదు.

***6. సమ్యక్ శ్రమ:*** చెడుకు దూరంగా నిబద్ధతతో కూడి వుండాలి.

***7. సమ్యక్ నిశ్చయం:*** పరిపూర్ణమైన మనస్సు కలిగివుండాలి.

***8. సమ్యక్ విధానం:*** మనశ్శాంతి.




# బౌద్ధ క్షేత్రాల వివరాలు

1. సరిపల్లి
2. కళింగపట్నం
3. శాలిహుండం
4. రామతీర్థం
5. మంగమరిపేట
6. బావికొండ
7. శంకారం
8. కొత్తూర్
9. లింగరాజుపాలెం
10. పిఠాపురం
11. కొడవలి
12. కాపవరం
13. ఆదుర్రు
14. ఆరుగొలను
15. గుంటుపల్లి
16. అశ్వారావుపేట
17. అల్లూరు
18. గుమ్మడిదుర్రు
19. గుడివాడ
20. ఘంటశాల
21. జగ్గయ్యపేట
22. నేలకొండపల్లి
23. తిరుమలగిరి
24. దూళికట్ట
25. పాసిగాం
26. కొండాపూర్
27. గాజులబండ
28. ఫణిగిరి
29. ఏలేశ్వరం
30. నాగార్జునకొండ
31. మంచికల్లు
32. గోలి
33. గ్రంధసిరి
34. అమరావతి
35. రెంటాల
36. భట్టిప్రోలు
37. చందవరం
38. దూపాడు
39. చిన్నగంజం
40. పెద్దగంజం
41. కనుపర్తి
42. ఉప్పుగుండూర్
43. రామతీర్థం
44. నందలూరు
45. బుద్ధమ్
46. వద్దమాన్‌కోట
47. వద్దమాన్
48. కోటిలింగాల
49. గోపాలపట్నం
50. పాపుళ్ళకొండ
51. ధారపాలెం
52. దంతపురం

యాత్రికులకు ప్రత్యేక ఆకర్షణ. గుంటూరు జిల్లాలోనే బౌద్ధానికి సంబంధించిన ఆనవాళ్ళు ఇంకా అనేకం ఉన్నాయి. భట్టిప్రోలు, బుద్ధం చేజర్ల, చేబ్రోలు- ఇంకా ఇతర ప్రాంతాల్లో బౌద్ధ సంస్కృతికి సంబంధించిన ఆనవాళ్ళను చూస్తాం.

### నాగార్జునకొండ

మహాయాన సిద్ధాంతకర్త బోధిసత్వ నాగార్జునునికై శ్రీయజ్ఞ శాతకర్ణి శ్రీపర్వత మహాచైత్య విహారాలను నిర్మించాడు. శ్రీపర్వత విజయపురి ప్రాంతాన్నే నేడు నాగార్జునకొండగా పిలుస్తున్నారు. మొదట ఈప్రాంతాన్ని 1926లో ఏ.ఆర్.సరస్వతి అనే ఆర్కియాలజిస్టు కనుగొన్నారు. ఇక్కడి మహాచైత్యం బుద్ధ ధాతువుపై నిర్మితమైనట్లు చరిత్ర చెబుతోంది. శ్రీపర్వత విహారాన్నే 'పారావత' విహారమని చైనా యాత్రికుడు పాహియాన్ తన రచనల్లో వర్ణించాడు. నాగార్జునసాగర్ నుంచి బెల్లంకొండ వారి పాలెం మీదుగా మాచర్ల వైపునకున్న రహదారిలో ఒక కిలోమీటరు లోపలగా ఈ నాగార్జున విశ్వవిద్యాలయం ఉండేది. ఈ విద్యాపీఠం నుంచి అప్పట్లో వివిధ దేశాలకు చెందిన విద్యార్థులు విజ్ఞాన బిక్షపొందారు. శిథిల కుడ్యాలలోనే గదుల నిర్మాణం కూడా కనిపిస్తుంది. మహాయాన బౌద్ధమత ప్రచారానికి ప్రధాన భూమిక నిర్వహించిన ప్రాంతం నాగా ర్జునకొండ.

చైనా, జపాన్, బర్మా, శ్రీలంక, థాయ్‌లాండ్, టిబెట్టు దేశాలనుంచి ఎందరో విచ్చేసి బౌద్ధమత దీక్షను స్వీకరించి, గౌతమబుద్ధుని బోధనలను ఆయా దేశాలలో విస్తృతంగా ప్రచారంచేశారు. నాగార్జునసాగర్ వద్ద అనేక చైత్యాలు కన్పిస్తాయి. కృష్ణానది లోయలో కేంద్ర పురావస్తుశాఖ 3700 చదరపు ఎకరాలలో జరిపిన తవ్వకాలలో అనేక చారిత్రక అవశేషాలు వెలుగులోకి వచ్చాయి.

ఈ తవ్వకాలలో లభించిన ఆచార్య నాగార్జున విద్యాపీఠాన్ని అవే ఇటుకలతో పాత అనువు వద్ద పునర్నిర్మించారు. నాగార్జునసాగర్ దక్షిణ విజయపురికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో వుంది అనుపు. ఈ విశ్వవిద్యాలయంలో 86 అడుగుల ఎత్తు, 106 అడుగుల వ్యాసంవున్న మహాస్థూపం కూడా ఒకటి వుంది. నాగార్జునసాగర్ కొండ లోయలో బౌద్ధమహాచైత్యం, బౌద్ధారామాలు, స్థూపాలు, కొన్ని కోటగోడలు, మహా విశ్వవిద్యాలయం, క్రీడారంగ స్థలాలు, యజ్ఞశాల నిర్మాణాలు బయల్పడ్డాయి. ఇక్కడి మహాచైత్య సంఘారామాలను యజ్ఞశ్రీ శాతకర్ణి నిర్మించి నాగార్జునాచార్యులకు బహూకరించినట్లు కథనం. యజ్ఞశ్రీ తర్వాత విజయ శాతకర్ణి వైశాఖ పూర్ణిమ నాడు తన పేరుతోనే విజయపురిని నిర్మించాడంటారు. శాతకర్ణి పోషణలో విజయపురి

## అమరావతి స్థూపం

గౌతమ బుద్ధుని శారీరక ధాతువులనుబట్టి మొత్తం ఎనిమిది మహా స్థూపాలను నిర్మించగా అందులో ఒకటిగా అమరావతి స్థూపాన్ని చెప్తారు. మహాదేవభిక్షువు చైత్యక సంప్రదాయాన్ని ఆంధ్ర ప్రాంతంలో ప్రచారంసాగించడంతో ఇది మహా చైత్యంగా ప్రసిద్ధి చెందింది. అమరావతి స్థూపం క్రీస్తుపూర్వం రెండువందల సంవత్స రాలనాడు ప్రారంభమై క్రీస్తు తర్వాత 150 ఏళ్ళు మెరుగులు దిద్దుకుంటూ వచ్చింది. అమరావతి స్థూపం స్తంభాలపై ప్రాకారపు గోడలపై ఎన్నో బౌద్ధ జాతకగాథలను లిఖించారు. స్థూపానికి నాలుగువైపులా ద్వారాలు వుంటాయి. ద్వారాలకు ఎదురుగా ఐదుస్తంభాలను వుంచారు. వీటిని ఆర్యక స్తంభాలు అంటారు. అమరావతి స్థూపం ప్రణాళికల్లోనూ, పరిమాణంలోనూ ఎంతో గొప్పది. స్థూపాండం పైభాగాన ఒక చిన్న చతురస్రాకారపు గది వుంటుంది. దీన్ని 'హర్మిక' అంటారు. బుద్ధుని శరీరధాతువులు ఇందులో భద్రపరిచేవారు. భారతదేశంలో వెలసిన శిల్పశైలీ విశేషాల్లో ఆంధ్రశైలి ఒక ప్రత్యేకతను సంపాదించుకుంది. దీన్ని 'అమరావతి శైలి' అని వ్యవహరిస్తుంటారు.

అనుపు వద్ద పునర్నిర్మించిన బౌద్ధస్థూపం



హుస్సేన్‌సాగర్‌పై బుద్ధుడు



బావికొండలో బౌద్ధం చిహ్నాలు

బౌద్ధనగరంగా అవతరించింది. నాగార్జుని మరణాంతరం శ్రీపర్వతంలో హిందువులకు-బౌద్ధులకు మధ్య ఘర్షణ వల్ల కట్టడాలు ధ్వంసమయ్యాయని చైనా యాత్రికుడు హుయాత్సాంగ్ రాశాడు.

## 'ఉండవల్లి' గుహలు

గుంటూరుజిల్లా తాడేపల్లి మండలంలోని ఉండవల్లి గుహలు క్రీస్తుశకం రెండు, మూడు దశాబ్దాల కాలంలోని బౌద్ధమత ప్రాచుర్యాన్ని వివరిస్తాయి. విజయవాడనుంచి మంగళగిరి మార్గంలో జాతీయ రహదారికి రెండు కిలోమీటర్లు పడమర దిశలో కృష్ణానదికి దక్షిణం వైపున ఈ ఉండవల్లి కొండలు వున్నాయి. ఈ కొండల్లో 64 గుహలు వున్నాయి. గుహలో రెండో అంతస్తులో ఒకే రాతితో చెక్కిన 18 అడుగుల పొడవైన అనంతపద్మనాభ స్వామి విగ్రహం వుంది.

ప్రధాన గుహలు నాలుగు అంతస్తులు కాగా మొదటి అంతస్తులో పదకొండు గుహలున్నాయి. రెండో అంతస్తుకు వెళ్లే మెట్ల వద్ద సొరంగ మార్గం వుంది. సొరంగానికి ఎదురుగా గోడపై రెడ్డిరాజుల కాలంనాటి శిలాశాసనంవుంది. రెండో అంతస్తులో 16 స్తంభాల ప్రాంగణం వుంది. దీనిలో ఆరు గదులు వున్నాయి. మూడో అంతస్తులో 18 స్తంభాల ప్రాంగణం వుంది. ఒక్కొక్క స్తంభంపై ఒక్కొక్క విగ్రహం చెక్కారు. పురాణ గాథలు సీతావనవాసం, వామనుడు, ఉగ్రనరసింహావతారం వంటి కథలకు బొమ్మల రూపం ఇచ్చారు. పురావస్తుశాఖ వారు 1959లో వీటిని స్వాధీనం చేసుకున్నారు.

## మరికొన్ని బౌద్ధ క్షేత్రాలు

**జగ్గయ్యపేట:** దాదాపు 2000 సంవత్సరాల చరిత్ర కలిగివున్న బౌద్ధారామం ఇది. బ్రిటిష్‌వారి కాలంలో చరిత్ర పరిశోధకుడిగా వచ్చిన 'జాస్ బర్గెస్' క్రీ.శ. 1882 సంవత్సరంలో జగ్గయ్యపేటకు వచ్చిన ధనంబోడుగా పిలిచే దిబ్బపై తవ్వకాలు సాగించి స్థూపం కనుగొన్నారు. 31.5 అడుగుల వ్యాసంగల స్థూపం ప్రత్యేకమైనది.

**ఘంటశాల:** శ్రీకాకుళం జిల్లాలోని ఘంటశాలకు కంటక శైలమనీ, చోర పాండ్యపురమనే పేర్లు కూడావున్నాయి. 112అడుగుల పొడవు, 23అడుగుల ఎత్తు, 32 గదులూ వున్న బౌద్ధ స్థూపం ఇక్కడ బయటపడింది. బుద్ధుని శ్రీపాదాలు, ధర్మ సింహాసనం, మహానాగం, కలశం, ధర్మచక్రం, పూర్ణకుంభం, శిలాఫలకాలు ఇక్కడ లభించాయి.

**ఆదుర్రు:** తూర్పుగోదావరి జిల్లాలోని ఆదుర్రులోని వైనతేయనదీ పరివాహక ప్రాంతంలో 1945లో బౌద్ధస్థూపం వెలుగులోకివచ్చింది. చక్రం ఆకృతిలోని స్థూపం, నాలుగువైపులా మెట్లతో 24 విభాగాలతో కట్టడాలు గుర్తించారు.

**శాలిహుండం:** శ్రీకాకుళం జిల్లాలో ఈ ప్రాంతం ఉంది. ఇక్కడ బౌద్ధచైత్యాలు, ఆరామాలు, స్థూపాల్ని కనుగొన్నారు. వీటికి ఎంతో చారిత్రక ప్రాధాన్యం ఉంది. ఈ ప్రాంతంలోనూ బౌద్ధం విలసిల్లిందని అర్థమవుతుంది.

కృష్ణా జిల్లాలోని ఘంటశాలలోనూ పేరొందిన బౌద్ధస్థూపం ఉంది. విశాఖపట్నం, విజయనగరం జిల్లాల్లోని బావికొండ, పావురాల కొండ, గోపాలపట్నం, లింగరాజుపాలెం, తొట్లకొండ, శంకారం, రామతీర్థం కూడా ఎంతో ప్రాశస్త్యం కలిగివున్న ప్రాంతాలు. ప్రకాశంజిల్లాలోని చందవరం, మాలకొండ, కరీంనగర్ జిల్లాలోని ధూళికట్ట, పశ్చిమ గోదావరిజిల్లాలోని గుంటుపల్లి, ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి, నల్లగొండ జిల్లాలోని ఫణిగిరి మొదలైన ప్రాంతాల్లో సైతం బౌద్ధ సంస్కృతికి, కళా వైభవానికి సంబంధించిన ఆనవాళ్ళు కనిపిస్తాయి. బౌద్ధం ఈ నేలమీద ఎంతగా విస్తరించిందో ఈ చారిత్రక సాక్ష్యాలు చెబుతాయి. బౌద్ధానికి సంబంధించిన విశిష్టమైన



బుద్ధులు నివసించిన గుహలు!

ఆధారాలు ఇక్కడ లభించాయి.

రాష్ట్రంలో 52 ప్రాంతాల్లో బౌద్ధానికి సంబంధించిన చరిత్ర ఏదో రూపంలో ప్రతిఫలిస్తుంది. వీటిలో కొన్ని ప్రాంతాలు మాత్రమే ఇప్పటివరకు పర్యాటకులకు ఆసక్తికరమైన క్షేత్రాలుగా ఉన్నాయి. కానీ బౌద్ధం ఆనవాళ్ళున్న ప్రతి ప్రాంతాన్ని కూడా సంరక్షిస్తూ, యాత్రికులను ఆకర్షించడానికి అనువుగా తీర్చిదిద్దాలి. కొన్ని ప్రాంతాల మీద కనబరుస్తున్న నిర్లక్ష్యాన్ని విడనాడాలి.

ఎందుకంటే ఒకనాడు బౌద్ధమత చరిత్రకు, సంస్కృతికి నిలయంగా విలసిల్లిన కొన్ని ప్రాంతాలు నేడు హేయమైన దుస్థితిలో రక్షణకరువై విలవిలలాడుతున్నాయి. కృష్ణాజిల్లాలోని ప్రాచీన బౌద్ధ క్షేత్రం 'ఘంటశాల' రెండువందల యేళ్ళ చరిత్రను ఆవిష్కరిస్తున్నప్పటికీ దాని సంరక్షణకు తగిన చర్యలు చేపట్టడంలేదు. తూర్పుగోదావరి జిల్లాలోని ఆదుర్రులో దశాబ్దాలుగా బౌద్ధసంస్కృతీ విశేషాలు నిర్లక్ష్యానికి గురవుతున్నాయి. విశాఖజిల్లా గోపాలపట్నం, మంగవరం ప్రాంతాల్లోని ప్రాచీన ఆరామాలు, బౌద్ధస్థూపాలు శిథిలమైపోతున్నాయి. కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట బౌద్ధారామం తన ఉనికినే కోల్పోతోంది. వీటిని సంరక్షించి కాపాడటానికి సంబంధిత శాఖలు తగిన చర్యలు చేపట్టాలి.

క్రీస్తుపూర్వం నుంచి బౌద్ధాన్నిఆదరించిన తెలుగు నేలమీద ఉన్న కేంద్రాలకు ఎంతో చారిత్రకప్రాధాన్యంఉంది. నేటికీ బౌద్ధం తన ప్రాశస్త్యాన్ని కోల్పోలేదు. ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రిగా ఉన్న సమయాన 17 అడుగుల ఎత్తు గల భారీ బుద్ధ విగ్రహాన్ని చెక్కించడం, హుస్సేన్‌సాగర్‌లో ప్రతిష్ఠించడం ఇరవయ్యో శతాబ్దంలోనూ బౌద్ధానికిగల ప్రాశస్త్యానికి దాఖలా. ఈ నేల మీద బౌద్ధం విలసిల్లిన ప్రాంతాల్ని పర్యాటక క్షేత్రాలుగా అభివృద్ధి చేయడానికి జరుగుతున్న కృషి ముమ్మరంకావాలి.

బౌద్ధమతానికి కర్మకాండతో పనిలేదు. ఏ ఒక్క కులానికో, వర్గానికో ఇది పరిమితం కాదు. ఇది సమానత్వంతో కూడిన సమైక్య సమాజానికి పునాది. అందుకే ప్రపంచం నలుమూలలకు విస్తరించింది. నేటికీ మానవాళి విముక్తికి స్ఫూర్తినిచ్చే తాత్విక భావధారగా భాసిల్లుతోంది. మరి ఇలాంటి సంపద్వంతమైన సంస్కృతీ వారసత్వానికి ప్రతీకలుగా నిలిచిన బౌద్ధక్షేత్రాల అస్తిత్వాన్ని కాపాడుకోవటం అందరి బాధ్యత.

నాగార్జున సాగర్ మ్యూజియం

# రాయలసీమలో జైన ఆనవాళ్ళు

రాయలసీమ ప్రాంతంలో జైనులకు ప్రధాన పీఠాలు వున్నట్లు ఆధారాల ద్వారా తెలుస్తోంది. కడప జిల్లాలోని దానవులపాడు, అనంతపురం జిల్లాలోని రాయదుర్గం, రసిద్ధుల గుట్ట, కొన కొండ్ల, చిప్పగిరి, తోగరకుంట, పెనికలపాడు, కర్నూలు జిల్లా ఆదోనివద్ద విలువైన ఆధారాలు బయల్పడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌లో జైనమతం చాలా తక్కువ ప్రాంతాల్లో విస్తరించింది. అందులోనూ జైనుల ఆచార వ్యవహారాలు, వారి చిహ్నాలు పోలిన స్థూపాలు, విగ్రహాలు అత్యంత అరుదుగా బయట పడ్డాయి. మన రాష్ట్రంలో జైనం రాయలసీమలోనే ప్రాబల్యంలో వున్నట్లు తెలుస్తోంది. 12వ తీర్థంకరుడైన వసుపూజ్యుని కాలంలో జైనులు అస్సాం రాష్ట్రం నుంచి ఆంధ్రప్రదేశ్‌లోని భట్టిప్రోలుకు వలస వచ్చారని 14వ శతాబ్దానికి చెందిన నయసేనుడు 'ధర్మామృతం' అనే కన్నడ గ్రంథంలో రాశాడు.

దానవులపాడు వద్ద బయల్పడిన 'జైనమత పీఠం' అవశేషాలు

వర్ధమాన మహావీరుడు నాలుగువేలమంది సన్యాసులతో జైన సంఘాన్ని స్థాపించాడు. పదకొండుమంది శిష్యులను ఏర్పరచుకున్నాడు. వీరిని 'గుణధారులు' అని పిలిచేవారు. ఆస్త శిష్యులను 'శ్రుతకేవలు' లని పిలిచేవారు. వీరిలో చివరివాడు భద్రబాహుడు. మౌర్య చంద్రగుప్తుని ప్రధాన సలహాదారుడిగా భద్రబాహు వుండేవాడు. భద్రబాహుని గణానికి చెందిన కొండకుందాచార్యుడు శిలారూపంలో వున్న సరస్వతిని పలకవలసిందిగా బలవంతం చేసిన కారణంగా వీరిని 'బలాత్కార గణం' అని పిలిచేవారు. కొండకుందాచార్యుడు రాయలసీమ ప్రాంతం వాడు. అనంతపురం జిల్లా కొనకొండ్ల గ్రామానికి చెందిన వాడుగా భావిస్తారు. కొండకుందాచార్యుడు మహా జైన తపస్వి. ఇతను 'ప్రవచన సార', 'సమయ సారపంచాస్తికాయ' వంటి రచనలు చేశాడు. దక్షిణ భారతదేశానికి చెందిన జైనాచార్యులందరూ చాలావరకు కొండకుందాచార్యుల వారి వర్గానికి చెందినవారే. కొండకుందాచార్యుడు క్రీస్తుశకం ఒకటవ శతాబ్దానికి చెందిన వాడు. వీరు వీతరాగ (వైరాగ్య) మార్గాన్ని ప్రబోధించారు. అనంతపురం జిల్లా గుంతకల్లు సమీపానగల కొనకొండ్ల గ్రామంలో 50 మంది కూర్చోవడానికి అనువుగా ఒక ప్రకృతి సిద్ధమైన రాతి గుహ వుంది. అప్పట్లో ఈ కొనకొండ్ల ప్రాంతాన్ని పవిత్ర జైన తీర్థంగా భావించేవారు. ఆంధ్రప్రదేశ్‌లో మరెక్కడా ఆనాటి జైన ప్రాచీన తీర్థాలు లభించలేదు. కొనకొండ్ల ప్రాంతానికి విశిష్టమైన స్థానం వుంది. ఏడవ శతాబ్దంలో కొందరు దిగంబర జైనాచార్యులు రాయలసీమ ప్రాంతంలో వుండేవారు. వృషభుడనే జైనాచార్యుడు కడపజిల్లా జమ్మలమడుగు ప్రాంతంలోని పెనికలపాడు వద్ద ప్రకృతిసిద్ధమైన గుహలో వుండేవాడు. ఈ గుహకు 'సన్యాసి కొండ' అని పేరు కూడా వుంది. ఈ వృషభ జైనాచార్యుడు సంస్కృతంలో 'అహాస్టప్' ఛందస్సు కవిత్వం రాశాడు. కొండకుందాచార్యుడు తన రచనలను సూరసేని ప్రాకృతంలో రచించాడు. కర్నూలు జిల్లా ఆదోని వద్దగల బారాకిల్లాకు వెళ్ళే మార్గంలో జైన తీర్థంకరుల విగ్రహాలు, చిన్నతుంబళం, పెద్ద తుంబళం ప్రాంతాల్లో జైనమఠాలు వుండేవి.

చిత్తూరు జిల్లా పలమేరు దగ్గరి బావలవత్తం గ్రామంలోగల 'రాక్షస గుళ్ళు' లేదా 'పాండవ గుళ్ళు' జైనాచార్యుల విడిది కేంద్రాలుగా వుండేవి. జైనాచార్యులు బౌద్ధులలాగా నిర్మాణాలు చేపట్టలేదు. సన్యాసికొండ, చిప్పగిరి, పెనికలపాడు, తోగరకుంట ప్రాంతాల్లోని జైన విహారాలు ప్రకృతి సిద్ధమైన గుహలు. పాండవ గుళ్ళు జైనుల ప్రధాన విడిది కేంద్రాలుగా వున్నట్లు తెలుస్తోంది. వేములవాడ చాళుక్యులు తెలంగాణా ప్రాంతంలో జైనమతాన్ని పోషించారు. తొలి కాకతీయులు కూడా జైనమతాన్ని స్వీకరించారు. 16వ తీర్థంకరుడైన శాంతినాథుని చిహ్నమైన గరుడపక్షిని కాకతీయులు తమ గుర్తుగా స్వీకరించారు. 23వ తీర్థంకరుడైన పార్శ్వనాథుని దేవత పద్మావతి. అందువల్లనే హనుమకొండలో పద్మావతి విగ్రహాన్ని నిర్మించినట్లు చరిత్రకారులు భావన. మెదక్ జిల్లాలోని 'పటాన్ చెరువు', వరంగల్ జిల్లాలోని 'కొల్లిపాక', రాయచూర్ జిల్లాలోని 'కొప్పల్' వద్ద మన రాష్ట్రంలో జైన ఆనవాళ్ళు లభించాయి. మరింత పరిశోధన జరిగితే ఇంకా అనేక ప్రాంతాలలో ఆధారాలు లభించవచ్చు.

## ప్రాచీన జైనమత పీఠం "దానవుల పాడు"

క్రీ.శ. 6వ శతాబ్దంలో ప్రముఖ జైనమత పీఠాల్లో అత్యంత ప్రాధాన్యం పొందిన ప్రాచీన జైనమత పీఠం 'దానవుల పాడు'. ప్రొద్దుటూరు - జమ్మలమడుగు ప్రాంతాల రహదారిలో పెన్నానది ఒడ్డున 'దానవుల పాడు' వుంది. పదవ శతాబ్దానికి చెందిన జైనమత పీఠాల్లో ఈ దానవుల పాడే అత్యంత గొప్పది. పెద్దది. ఈ దానవులపాడుకే 'జైన పాడని' పేరుంది. జైన ఆలయాలను 'మొరం' లేదా 'మొరత' అనేవారు. పలువురు రాజులు, సామంతులు ఈ జైనపాడుని సందర్శించేవారు. జైన వర్గాలలోని శ్వేతాంబరులకంటే దిగంబరులే ఈ ప్రాంతంలో ఎక్కువగా వుండేవారు. వృషభుడనే జైనరాజు ఈ దానవులపాడును పరిపాలించేవాడు. రాష్ట్రకూటుల పాలనలో జైనమతం మరింతగా విస్తరిల్లింది. క్రీ.శ. 914-917 సంవత్సరాల మధ్య మూడవ నిత్యావర్షుని కాలంలో దానవులపాడు జైనమత పీఠం'గా మారింది. దేశంలోని అనేక ప్రాంతాల్లోని విద్యార్థులు ఈ దానవులపాడుకు వచ్చి జైనమత తాత్విక గ్రంథాలను అధ్యయనం చేసేవారు. గురువులచేత అభ్యాసం చేసేవారు. దానవులపాడుకు ప్రక్కనే వున్న పెన్నానది వరద తాకిడి నుంచి రక్షణకోసం ఈ పీఠానికి తూర్పు పడమరల ఏడుమైళ్ల పొడవున పెద్ద రాతిబండలతో . గోడ నిర్మించారు. నది నుంచి నీరు తెచ్చుకునేందుకు ఏర్పాట్లు చేసుకున్నారు. కాల క్రమంలో పెన్నానది వరదల కారణంగా ఏర్పడిన ఇసుక దిబ్బలలో దానవులపాడు కలిసిపోయింది. ఆంధ్రసాహిత్య పరిషత్ స్థాపకులైన కీ.శే. జయంతి రామయ్య పంతులు గారు 1904లో ఈ ఇసుక దిబ్బలను త్రవ్వించారు. జైనపీఠం, నాలుగు సమాధి శాలలు, పార్శ్వనాథుని విగ్రహాలు, స్నానపీఠం, మూడు అడుగులు వెడల్పుగల పెద్ద పద్మం చెక్కిన రాయి, ధర్మచక్రం లభించాయి.

వీటిలో పార్శ్వనాథుని విగ్రహం, ప్రాకృతభాషలో లిఖించబడిన శిథిలమైన శిలా శాసనం రెండు మాత్రం ఇప్పుడు దానవులపాడులోనే వున్నాయి. మిగిలినవి మద్రాసులోని 'జైన గ్యాలరీ'లో వున్నారు. ఇక్కడ వున్న ఇసుక దిబ్బల్లోనే రాతిచెరువు, శిలా రథం, సమాధులు వున్నట్లు తెలుస్తోంది. రాష్ట్రకూటులు దానవుల పాడులో వల్లరాతి ఆలయ నిర్మాణం చేశారు. మూడవ నిత్యావర్షుని కాలంలో ప్రతి మహాశివరాత్రినాడు దానవులపాడులో పర్వదినం జరిగేది. భక్తులు తమ కోర్కెలు నెరవేరడం కోసం ఇక్కడి పార్శ్వనాథుని విగ్రహాన్ని పూజించేవారు. ముఖ్యంగా పిల్లలులేని స్త్రీలు దిగంబరులై పార్శ్వనాథుని విగ్రహానికి పూజలు చేసి ఆలింగనం చేసుకునేవారు. 1800-1807 ప్రాంతంలో కడప జిల్లా కలెక్టర్‌గా వచ్చిన సర్ థామస్ మన్రో ఈ అశ్లీల ఆరాధన ఉత్సవాలను నిషేధించారు.

దానవులపాడులో జైనపీఠం అవశేషాలు బయట పడడంతో జైనులు ఆచార వ్యవహారాలకు సంబంధించిన గృహ, వాస్తు, శాస్త్ర విశేషాలు ఎన్నో తెలిశాయి. జైన విగ్రహాలను ఇసుకరాయితో నగిషీలు చెక్కినట్లు తెలుస్తోంది. 24 తీర్థంకరుల విగ్రహాలు ఇక్కడే బయల్పడడం విశేషం. క్రీ.శ.696-737 నాటి విజయాదిత్యుడి కన్నడ శిలాశాసనం శిథిలమైపోయింది. శాంతినాథ తీర్థంకరుని జ్ఞాపకార్థం ఈ పీఠాన్ని మూడవ ఇంద్రుడు నిర్మించినట్లు చెప్తారు. 3వ శతాబ్దంలో మాధవులనే ఇక్ష్వాకు కుమారులు రాష్ట్రకూట రాజైన నిత్యావర్షుడు, మూడవ కృష్ణుడు అయోధ్యనుంచి దక్షిణ భారతానికి వచ్చి కడపజిల్లాలో ప్రసిద్ధులైన సింహనందినిని, కొండకుందాచార్యులను కలుసుకున్నారు. సింహనందిని ఈ ప్రాంతంలో జైన ప్రచారకర్తగా వుండేవాడు. వీరి కలయిక వల్లనే ఈ ప్రాంతాల్లో జైన పీఠాలు వెలిశాయని చరిత్రకారుల అభిప్రాయం.

## రాయదుర్గంలో జైన విశ్వవిద్యాలయం

అనంతపురం జిల్లా రాయదుర్గం ప్రాంతంలో జరిగిన తవ్వకాలల్లో జైన సంస్కృతికి చెందిన విగ్రహాలు, ఆరామాలు బయల్పడడంతో ఈ ప్రాంతంలో 'జైన విశ్వవిద్యాలయం' వుండేదని పరిశోధకులు భావిస్తున్నారు. ఇక్కడి 'రసిద్ధుల గుట్ట' కొండలో ప్రాచీనమైన జైన విద్యాపీఠం వుండేదని, ఎల్లమ్మకొండ వద్ద జైన దేవాలయం వుండేదని, అనంతపురం జిల్లా గజిటేర్‌లో పేర్కొన్నారు. రాయదుర్గానికి ఉత్తరంవైపు గల కొండల్లో 'రసిద్ధుల గుట్ట' ప్రధానమైనది. ఈ పీఠం జైనమతానికి చెందిన 'యాపనీయ' శాఖకు కీలక స్థావరంగా వుండేది. ఇక్కడి ఆలయంలోని ప్రధాన విగ్రహం సిద్ధేశ్వరస్వామి విగ్రహం జైన సంస్కృతికి ఆధారంగా మిగిలివుంది. రాతి వాకిళ్ళు, సిద్ధుల శిల్పాలు, జైన స్థూపాలు, చిహ్నాలు ఇక్కడి జైన సంస్కృతికి ఆనవాళ్లుగా మిగిలివున్నాయి. జైన శిల్పశాస్త్ర నిపుణులుగా పేరుపొందిన చంద్రబూలి, మాదయ, తిమ్మన, చంద్రేంద్రుడు, ఆచార్యుల పేర్లు యిక్కడి నిషధిల ద్వారా తెలుస్తున్నాయి. ఈ కొండ ప్రాంతంలో పలు జైన సంస్కృతికి చెందిన విగ్రహాలు బయల్పడ్డాయి. ఈ పరిసర ప్రాంతంలోని మల్లాపురం గ్రామం పొలాల్లో జైన విగ్రహాలు బయల్పడ్డాయి. ఈ పరిసర ప్రాంతంలోని మల్లాపురం గ్రామం పొలాల్లో జైన విగ్రహాలు లభించాయి. అలాగే జె.వీరాపురం గ్రామం వద్ద 'శిలామంచం' (రాతి మంచం) కూడా జైనుల సంస్కృతిని వెల్లడిస్తున్నాయి. అనంతపురం జిల్లా గెజిటెడ్‌లో ఈ రసిద్ధుల గుట్ట గురించి ఒక కథ కూడా వుంది. రాయదుర్గం ప్రాంతాన్ని రాజరాజనరేంద్రుడు అనే రాజు పరిపాలించేటప్పుడు అతడి మొదటి భార్య కుమారుడైన సారంగధరుడి మీద కక్షతో చిన్నభార్య సారంగధరుడికి ఈ రసిద్ధుల గుట్టమీద కాళ్ళు, చేతులు తీయించేస్తుంది. ఈ పరిస్థితుల్లో ప్రధానాచార్యుడు 'రసిద్ధుడు' వన మూలికా వైద్యంతోపాటు, తన దివ్యశక్తితో అతడికి కాళ్లు, చేతులు తెప్పిస్తాడు. ఇది ఆ కథ.

## ప్రాధాన్యత సంతరించుకున్న 'జంబూద్వీప చక్రం'

అనంతపురం జిల్లాలోని 'రసిద్ధుల గుట్ట'పై చెక్కిన పురాతన పురావస్తు ప్రాధాన్యతను సంతరించుకున్న జంబూద్వీప చక్రాన్ని పరిరక్షించేందుకు ఆ ప్రాంత రిటైర్డ్ హెడ్‌మాస్టర్ చక్రవర్తి చేసిన కృషి ఫలించింది. ఎంతో విలువైన చరిత్రను తనలో నిక్షిప్తం చేసుకుని పలు శేష ప్రశ్నలను మిగిల్చే జంబూద్వీప చక్రం పరిసర ప్రాంతం (రసిద్ధుల గుట్ట) వద్ద జరుగుతున్న క్వారీయింగ్‌ను నిలుపుదల చేయాలని కోరుతూ చక్రవర్తి యిచ్చిన రిట్ పిటీషన్‌ను పరిశీలించి జంబూ ద్వీపకచక్రానికి రక్షణ కల్పించాలని కోర్టు ఉత్తర్వులు జారీచేసింది. జైన మత సాహిత్యంలో విశేష ప్రాధాన్యత కలిగిన ఈ జంబూద్వీప చక్రం జైనమత గురువు కురుకుందాచార్యుల వారి కృషివల్ల రూపకల్పన కావించబడినట్లు తెలుస్తోంది. కురుకుందాచార్యుల పేరిట ఈ రసిద్ధులగుట్ట ప్రాంతం 'కొనకొండ్ల'గా మారి వుండవచ్చనే అభిప్రాయం కూడా వుంది. జైనులు అత్యంత పవిత్రంగా భావించే జంబూద్వీప చక్రం ప్రాంతాన్ని పురావస్తు ప్రాధాన్యతగా ప్రభుత్వం గుర్తించింది. జంబూద్వీప చక్రం అనే మిస్టిక్ సర్కిల్‌పై దేశ, విదేశాలలో విస్తృతంగా పరిశోధనలు కొనసాగుతున్నాయి. రసిద్ధుల గుట్ట ప్రాంతంలో క్వారీయింగ్ జరుగుతుండడం వల్ల 'జంబూద్వీప చక్రం' ఉనికి ప్రశ్నార్థకమైంది. దీనిని గమనించిన రిటైర్డ్ హెడ్‌మాస్టర్ చక్రవర్తిగారు హైకోర్టులో పిటిషన్ దాఖలుచేసి సంరక్షణ కల్పించారు. ఈ రసిద్ధుల గుట్ట ప్రాంతంలో జైన దేవాలయాన్ని, విద్యాలయ పీఠాలని నిర్మించాలని బొంబాయిలోని జైన కమిటీ నిర్ణయించారు.

దానవులపాడులో దొరికిన పార్శ్వనాథ విగ్రహం

పదవ శతాబ్దానికి చెందిన జైన మత పీఠాల్లో దానవులపాడు గొప్ప పేరొందినది. దీనికే జైనపాడు అనికూడా పేరు. వృషభుడనే జైనరాజు దానవుల పాడును పరిపాలించే వాడు. క్రీ.శ 914-917 సంవత్సరాల మధ్య మూడవ నిత్య వర్షుని కాలంలో దానవుల పాడు జైనమత పీఠంగా మారింది. కాలక్రమంలో పెన్నానది వరదల వల్ల ఏర్పడిన ఇసుకదిబ్బల్లో దానవులపాడు మాయమయింది.

## నాటి జైనమత కేంద్రం 'పెనుకొండ'

జైనులకు విజయనగర సామ్రాజ్యంలో విశేష ఆదరణ లభించింది. శ్రీకృష్ణదేవరాయల ప్రధాన దుర్గంగా పెనుకొండకు పేరుంది. క్రీస్తుశకం 6వ శతాబ్దం నుంచి ఇక్కడ జైనమత ప్రాభవం కొనసాగుతున్నట్లు తెలుస్తోంది. తమిళ సాహిత్యంలో విశిష్ట గ్రంథంగా పేరుపొందిన 'మేరు మందార పురాణ' అనే ప్రముఖ జైన గ్రంథాన్ని రాసిన 'వామనాచార్య'ను విజయనగర రాజులు పోషించినట్లు తెలుస్తోంది. జైనమత 16వ తీర్థంకరుడు శాంతనాథ స్వామి ఆలయం పెనుకొండ ప్రాంతంలో వుండేది.

## శ్రీ పచ్చపార్శ్వనాథస్వామి

ఈ ఆలయంతోపాటు మరో తొమ్మిది జైన దేవాలయాలు ఇక్కడే వున్నట్లు తెలుస్తోంది. ఈ తొమ్మిది జైన దేవాలయాల్లో పచ్చ పార్శ్వనాథ స్వామి దేవాలయం ప్రధాన జైన ఆలయంగా వుండేది. కాలప్రవాహంలో 15వ శతాబ్దంతానికి అన్ని ఆలయాలు కనుమరుగైపోయాయి. పచ్చ పార్శ్వనాథ స్వామి ఆలయ కేంద్రంగా అప్పట్లో జైనమత ప్రచారం సాగేది. మేలురకం గ్రానైట్ రాయితో నిర్మించిన పార్శ్వనాథుడి విగ్రహాన్ని ఇక్కడ ఇప్పటికీ చూడవచ్చు. ప్రతి సంవత్సరం శ్రావణ శుద్ధ సప్తమి రోజు ఈ పురాతన విగ్రహానికి మహాభిషేకం చేస్తారు. జైన భాస్కరకవి 'జీవంధర చరిత్ర' ఈ దేవాలయంలోనే రచించినట్లు తెలుస్తోంది. అత్యంత ప్రాచీనమైన రెండవ జైన తీర్థంకరుడు అజితనాథ స్వామి దేవాలయం కూడా ఇక్కడే వుంది.

దేశవ్యాప్తంగా ప్రధానంగా నాలుగు జైనమత కేంద్రాలు వున్నాయి. అవి ఢిల్లీ, మహారాష్ట్ర రాష్ట్రంలోని కొల్హాపూర్, తమిళనాడులోని 'కంచి' కాగా, మన రాష్ట్రంలోని 'పెనుకొండ' ఎంతో ప్రసిద్ధి చెందాయి. బౌద్ధమతం కంటే ఎంతో ప్రాచీనమైనదిగా భావిస్తున్న జైనమతం కాలక్రమంలో కనుమరుగైంది. బౌద్ధంమీద ఎన్నో పుస్తకాలు, ఆధారాలు లభించాయి. అదే స్థాయిలో జైనం మీద సాక్ష్యాలు లభ్యం కాలేదు. జైనమత స్థావరాలపై, పీఠాలపై మరింతగా పరిశోధనలు సాగాలి, ఎన్ని ఆధారాలు భూస్థాపితం అయ్యాయో వాటిని వెలికితీసి చరిత్రను పరిశోధించాలి.

## నెల్లూరు ప్రాంతంలో

నెల్లూరు జిల్లాలో జైనమతం 13వ శతాబ్దంలోనే పునాది వేసుకున్నట్లు చరిత్ర చెప్తోంది. నెల్లూరు పరిసరాల్లోని కృష్ణపట్నం, కనుపర్తిపాడులలో జైన అవశేషాలు బయల్పడడం దీనిని మరింత బలపరుస్తుంది. 1900వ సంవత్సరంలో నెల్లూరు జిల్లా కలెక్టర్ కార్యాలయం వద్ద జైన దేవాలయాల అవశేషాలు బయల్పడ్డాయి. ఇక్కడే జైనులకు చెందిన కోనేరు కూడా వెలుగుచూసింది. చాళుక్య చోళుల కాలంలో జైనమతం వ్యాప్తిచెందినట్లు తెలుస్తోంది. 1.16 మీటర్ల పొడవైన వర్ధమాన మహావీరుని విగ్రహంతో పాటు, 13వ శతాబ్దంకు చెందిన జైన తీర్థంకరుల విగ్రహం, పార్శ్వనాథుని విగ్రహాలు పురావస్తుశాఖ వివిధ ప్రాంతాల్లో గుర్తించగలిగింది.

జైనుల శాసనదేవత (ఇరువత పరమేశ్వరి)తో పాటు, అత్యంత అరుదైన జైన శ్వేతంబరుని విగ్రహాలు ఈ ప్రాంతంలోనే వుండడం విశేషం. కందుకూరు తాలూకా మాలకొండ గ్రామంలోగల గుహల్లో కొన్ని జైనమత శాసనాలు బయల్పడ్డాయి. 8వ శతాబ్దం నాటి తీర్థంకరుల విగ్రహాలు సైదాపురం వద్ద లభించాయి. తమ జీవితాలను ముగింపు చేసుకోవడం కోసం జైన గురువులు వ్రతాలు చేసేవారని, యిందుకోసం కొన్ని ప్రత్యేక పద్ధతులు ఆచరించేవారని కొన్ని శాసనాల ద్వారా తెలుస్తోంది. వీటిని సల్లేఖన విధానం అనేవారు. రాష్ట్రకూటుల్లో ఒకడైన మూడవ కృష్ణుడి మనుమడైన ఇంద్రుడు, పశ్చిమ గంగరాజు మారసింహుడు ఇద్దరూ చాళుక్యులతో పోరాటాలు జరిపి పరాభవం పొంది జైన సన్యాసులుగా మారి సల్లేఖన విధానం ద్వారా ప్రాణత్యాగాలు చేసినట్లు చరిత్ర చెప్తుంది. రాష్ట్రకూటుల పరిపాలన కాలంలో జైన మతానికి, వారి సిద్ధాంతాలకు ఎంతటి ప్రాధాన్యత వుందో పై సంఘటన తెలియజేస్తుంది.

– వేంపల్లి గంగాధర్



# మట్టి పొరల మధ్య మహా చరిత్ర

## కడపకు 200 వసంతాలు

వేంపల్లి గంగాధర్

గతానికి వర్తమానానికి మధ్య సంభాషణే చరిత్ర. మన సంస్కృతి ఎప్పటికీ ఇంద్రధనస్సు. మన చారిత్రక, ప్రాభవ వైభవం నిత్య ఉషస్సు. ఈ స్వచ్ఛమైన నేలకు 200 సంవత్సరాల ఘన యశస్సు. కడప సాహితీ కళారంగాల సంగమం.

కడప జిల్లా ఆవిర్భవించి 200 సంవత్సరాలు పూర్తి చేసుకుంటున్న నేపథ్యం ఇది. 1807లో కడప జిల్లా ఏర్పాటైంది. చరిత్ర పుటల్లో చెరగని స్థానం కడప సొంతం. ఇక్కడి చారిత్రక, సాంస్కృతిక, సాహితీ వారసత్వం అఖండం. అద్వితీయం.

మౌర్య చక్రవర్తుల నుండి మట్లి రాజుల దాకా పాలించిన రేణడు ఇది. త్రేతాయుగంలో దండకారుణ్యంలో అంతర్భాగమైంది. అన్నమయ్య కీర్తించినట్లు 'కలనేడు నిజమాయ గడపరాయ-కలికి శ్రీ వేంకటాద్రి కడపరాయ' అన్నట్లు కడపకు ద్విశతమానం నేపథ్యంలో ప్రత్యేక వ్యాసం...

### చరిత్ర పుటల్లో చెరగని 'కడప' కీర్తి

కడప జిల్లాకు మహోన్నతమైన చరిత్ర ఉంది. చరిత్ర పూర్వయుగం నుండే ఈ ప్రాంతంలో మానవ నాగరికత వికాసం ప్రారంభమైంది. పురాతన కాలం నాటి పాండవ గుళ్ళు పోరుమామిళ్ళ, శంఖారావం, ఎర్రబల్లి, రాయవరం ప్రాంతాల్లో బయటపడ్డాయి. కలియుగ ప్రారంభంలో కృపాచార్యులు ఈ ప్రాంతాన్ని సందర్శించినందువల్ల కృపనగరంగా, కృపావతి మండలంగా పిలువబడింది. తిరుమలకు తొలి గడపగా కడప ఖ్యాతి పొందింది. క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందిన గుర్తించాడు. క్రీ.శ. 640 సంవత్సరకాలంలో చైనా దేశపు బౌద్ధ యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ కడప ప్రాంతాన్ని 'చులియా' (చోళుల భూమి)గా పిలిచాడు. విజయనగర సామ్రాజ్యనంతరం గోల్కొండ సుల్తాన్ కుతుబ్‌షా సైన్యాధికారి 'నెఖ్‌నాంఖాన్' కడప పట్టణాన్ని విస్తరింపచేశాడు. 'నెఖ్‌నామాబాద్, పేరుతో కడప పిలవబడింది.

అశోకుని శాసనాల ఆధారంగా క్రీ.పూ. 224-236 కాలం మధ్య కడప ప్రాంతం అశోకుని పాలనలో ఉన్నట్లు చరిత్ర ద్వారా తెలుస్తోంది. 'ములికినాడు' ప్రాంతంగా గుర్తింపబడింది. రాజంపేట తాలూకాలోని అత్తిరాల సమీపంలో జరిగిన తవ్వకాలలో క్రీ.శ. 117కి చెందిన రోమన్ నాణేలు బయటపడ్డాయి. శాతవాహనుల అనంతరం 'హిరణ్యరాష్ట్రం'గా ఈ ప్రాంతం పిలువబడింది. క్రీ.శ. 13వ శతాబ్దానికి చెందిన శాసనాల వల్ల పల్లవరాజు త్రిలోచన పల్లవుడు పాలించినట్లు తెలుస్తోంది. బాదామి చాళుక్యుల శాసనాల్లో హిరణ్య రాష్ట్ర పాలకుడైన 'చళికి రెమ్మణుకుని' పేరు ప్రస్తావించబడింది.

కరికాల చోళుని సంతతికి చెందిన 'రేనాటి చోళులు' కడప ప్రాంతాన్ని పాలించారు. ధనుంజయుని క్రీ.శ. 575 నాటి కలమళ్ల శాసనం తెలుగు భాషలో మొదటి శాసనంగా గుర్తించారు. ఈ శాసనం ఆధారంగా తెలుగు భాషకు పుట్టినిల్లుగా కడప ప్రాంతాన్ని చెప్పుకోవచ్చు. రేనాటి చోళుల శాసనాలలో 'దానవులపాడు'లో జైనులు జరిపిన సల్లేఖన వ్రతం గురించి వివరించబడింది.

రేనాటి చోళుల అనంతరం క్రీ.శ. 8వ శతాబ్దంలో కడప ప్రాంతం బాణ రాజుల ఆధీనంలోకి వచ్చింది. జమ్మలమడుగు తాలూకాలోని పొట్టిపాడు గ్రామంలో బాణ రాజుల దానశాసనం బయల్పడింది. క్రీ.శ. 894-972 మధ్య ఈ ప్రాంతాన్ని వైదుంబు రాజులు పాలించారు. రాష్ట్ర కూటుల కాలంలో దక్షిణ భారతదేశంలోనే గొప్ప జైనక్షేత్రంగా 'దానవులపాడు' వర్ధిల్లింది. క్రీ.శ. 982 ప్రాంతంలో చోళుల ఆధిపత్యంలోకి వచ్చి 'ఇనగల్లూరు నాడు'గా ఈ ప్రాంతం పిలువబడింది. కాకతీయుల కాలంలో గణపతి దేవుని సేనానికాయస్థ గంగ సాహిణి పుష్పగిరి దేవాలయానికి అనేక దానాలు చేశాడు. సామంతరాజు అంబదేవుడు వల్లూరు రాజధానిగా పొత్తపినాడును పరిపాలించాడు.

విజయనగర రాజుల పాలనలో క్రీ.శ. 1369 కాలంలో పోరుమామిళ్ళ గ్రామంలో భాస్కర భవదూరుడితో 'అనంత'

సాగరుమనే చెరువు నిర్మితమైంది. రెండవ దేవరాయలు నాచన సోముని కవిత్వానికి మెచ్చి 'తుడుమల దిన్నె' గ్రామాన్ని దానం చేసినట్లు తెలుస్తోంది. కృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనకు 'కోకటం' గ్రామాన్ని దానం చేసినట్లు క్రీ.శ.1578 నాటి కోకటం శాసనం ద్వారా తెలుస్తోంది. 'తిప్పలూరు' గ్రామం అష్టదిగ్గజాలకు దానంగా ఇవ్వబడింది. క్రీ.శ.1646 కాలంలో గోల్కొండ కుతుబ్‌షాహీలు సిద్ధవటం పాలకులైన మట్లిరాజులను ఓడించి ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. అనంతరం మొగలుల ఆధిపత్యంలో 'మయానా' నవాబులు వారి ప్రతినిధులుగా పాలన సాగించారు. క్రీ.శ.1766 ప్రాంతంలో హైదరాలీ పాలనలోకి చేరింది. అనంతరం క్రీ.శ.1800 సంవత్సరంలో తూర్పు ఇండియా వర్తకసంఘానికి దత్తతగా మారి సీడెడ్ జిల్లాగా పేరువచ్చింది.

1800 అక్టోబర్ 24వ తేదీన మద్రాసు ప్రభుత్వం దత్తమండలాల ప్రధాన కలెక్టర్‌గా మేజర్ థామస్ మన్రోను నియమించింది. అప్పుడు కడపజిల్లాలో 17 తాలూకాలుండేవి. కడప కలెక్టర్ కార్యాలయం సిద్ధవటంలో ఉండేది. తరచూ వచ్చే పెన్నానది వరదల కారణంగా సిద్ధవటం నుండి కడప పట్టణానికి కార్యాలయం మార్చారు. 1857 తిరుగుబాటుకు పూర్వమే కడప జిల్లాలో బ్రిటిష్ పాలనపై వ్యతిరేక చర్యలు జరిగాయి. అఖిలభారత కాంగ్రెస్ సారథ్యంలో ఉద్యమాలు నడిచాయి. 1912 సంవత్సరంలో అనిబిసెంట్ జిల్లాలో విస్తృతంగా పర్యటించారు. సహాయ నిరాకరణ ఉద్యమం కాలంలో కల్లు దుకాణాలు కూల్చివేయబడ్డాయి. 1912 సెప్టెంబరు కాలంలో జాతిపిత మహాత్మాగాంధీ కడపను సందర్శించారు. 1929 సంవత్సరంలోనూ కస్తూరిబాయితో కలిసి గాంధీజీ కొండాపురం, ముద్దనూరు, ఎర్రగుంట్ల, ప్రొద్దుటూరు ప్రాంతాల్లో పర్యటించి విదేశీవస్తు బహిష్కరణ ఉద్యమాన్ని నడిపారు. శాసనోల్లంఘన ఉద్యమకాలంలో జిల్లాలో పెన్నపేరూరు మునసబ్ కరణం కె.సుబ్రమణ్యం అత్యంత ముఖ్యపాత్ర పోషించారు. 1934 సంవత్సరంలో గాంధీజీ హరిజనోద్ధరణకు నడుంకట్టి జిల్లాలో విస్తృతంగా పర్యటించారు.

## సినీరంగంలోనూ....

దక్షిణభారత సినీ సామ్రాజ్యంలోనూ కడప వెలుగులు విరజిమ్మింది. చలన చిత్రరంగం అభివృద్ధికి విశేషంగా కృషిచేసిన బిఎన్‌రెడ్డి సోదరులు, హాస్యానికి పేరుగాంచి, తెరపై నవ్వులపువ్వుల్ని పండించిన పద్మనాభం, నటి కన్నాంబ, శాంతకుమారి, గాయని రాణి వంటివారందరూ కడపజిల్లాకు చెందినవారే కావడం విశేషం. దర్శకుడు నీలకంఠ, నిర్మాత సి.సి.రెడ్డి, దర్శకుడు సి.వి.రెడ్డి, ప్రసాద్, వై.విజయ, రాజ్‌కుమార్, నిర్మాత రవీంద్రనాథ్‌రెడ్డి వంటి వారందరూ కడప నుంచే తమ సినీప్రస్థానం కొనసాగించారు.

## కడపజిల్లా సాహిత్య వికాసం

అష్టదిగ్గజాల్లోని అల్లసాని పెద్దన, రామరాజభూషణుడు, అయ్యలరాజు రామభద్రుడు, హరివంశకర్త నాచన సోముడు వంటి సాహితీ ఉద్దండులు జిల్లాకు చెందినవారిగా పేరుగాంచారు. ప్రబంధ సాహిత్యంలో ఆణిముత్యాలుగా కీర్తిపొందారు. కృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనకు 'కోకటం' గ్రామాన్ని దానం చేసినట్లు క్రీ.శ.1578 నాటి కోకటం శాసనం ద్వారా తెలుస్తోంది. రెండవ దేవరాయలు దానం చేశాడు. తిప్పలూరు గ్రామం అష్టదిగ్గజాలకు దానంగా ఇవ్వబడింది.

ఆంధ్ర భాగవతాన్ని రచించిన బమ్మెర పోతన ఏకశిలానగరం ఒంటిమిట్టకు చెందినవారు కావడం సుప్రసిద్ధం. శ్రీ వేంకటేశ్వరుడిపై 32 వేల సంకీర్తనలు రచించిన తొలి వాగ్గేయకారుడు అన్నమయ్య తాళ్లపాక గ్రామంలో జన్మించారు. కులమతాల్ని ఖండించి కాలజ్ఞాన తత్వాన్ని ప్రబోధించిన శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల వారు బ్రహ్మంగారి మఠంలోనే జీవసమాధి పొంది తరించారు. ఆటవెలది పద్యాలతో సంఘసంస్కరణకు కృషిచేసిన వేమన యోగిగా మారింది ఈ ప్రాంతంలోనే. బద్వేలు దగ్గరి గోపవరం కవయిత్రి మొల్ల రామాయణం రచనకు ఆలంబనగా నిలిచింది.

ఆధునిక కవులలో కళాప్రపూర్ణగా కీర్తింపబడిన జనమంచి శేషాద్రిశర్మ, శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణాన్ని రచించిన వావికొలను సుబ్బారావు, 'రాణాప్రతాపసింహ చరిత్ర' గడియారం వేంకట శేషశాస్త్రి, తెలుగుభాషకు జీవం పోసి తెలుగు సూర్యుడుగా కీర్తింపబడిన సి.పి.బ్రౌన్, శివతాండవ కర్త పుట్టపర్తి నారాయణాచార్యులు, సంవేదన సాహిత్య పత్రిక సంపాదకుడు, 'అనువాద సమస్యలు' రచనకుగాను కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన రాచమల్లు రామచంద్రారెడ్డి వంటి సాహితీ ఉద్దండులు ఈ ప్రాంతం నుంచే వెలుగులోకి వచ్చారు.

## కథాసాహిత్యంలో.....

భారతం నాదముని రాజు'నీలవేణి' కథతో కడపజిల్లాలో కథాసాహిత్యం ప్రారంభమైంది. 'అలసిన గుండెలు' కథాసంపుటితో రాచమల్లు రామచంద్రారెడ్డి, 'గట్టి గింజలు' కథాసంపుటితో వై.సి.వి.రెడ్డి కథాసేద్యంలో అడుగుపెట్టారు. వాడిన మల్లెలు, సింహాద్రి స్వీట్‌హోం కథాసంపుటాలతో సొదుం జయరాం కథలు వెలువడ్డాయి. 'జప్తు' కథాసంపుటి ద్వారా కేతు విశ్వనాథరెడ్డి కథలు రాయలసీమ జనజీవనాన్ని ఆవిష్కరించాయి. పెన్నేటికథల ద్వారా పి.రామకృష్ణారెడ్డి రైతుల వ్యథలను కడప మాండలికంలో ఆవిష్కరించారు. 'కుట్ర' కథల ద్వారా కుప్పిరెడ్డి పద్మనాభరెడ్డి, 'పరిష్కారం' కథాసంపుటి ద్వారా ఎం.వి.రమణారెడ్డి తమ భావాలకు అక్షరరూపం ఇచ్చారు. ముస్లిం జీవితాలను సత్యాగ్ని 'పాచికలు' కథాసంపుటిద్వారా ప్రకటించారు. ఆరవీటి శ్రీనివాసులు, జానకిరాం, రామసుబ్బారెడ్డి వారు కథారంగంలోకి ప్రవేశించారు. శశిశ్రీ సాహిత్యనేత్రం పత్రిక ద్వారానూ, 'దహేజ్' కథ , కువైట్ సావిత్రమ్మ కథ ద్వారా చక్రవేణు, కొత్తదుప్పటి కథ ద్వారా సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి, మొలకల పున్నమి కథాసంపుటి ద్వారా వేంపల్లి గంగాధర్, మల్లెమాల, కొమ్మిశెట్టి మోహన్ వంటివారు కడపజిల్లా కథాసాహిత్యంలో కన్పిస్తారు.

## తొలితెలుగు శాసనాలు

కడపజిల్లా కమలాపురం తాలుకాలోని ఎర్రగుడిపాడు గ్రామంలో చెన్నకేశవస్వామి దేవాలయం వక్కన రాతిపై క్రీ.శ.575 సంవత్సరాన రేనాటి చోళరాజు ఎరికల్ ముత్తురాజు ధనుంజయుడు వేయించిన శాసనం తొలితెలుగు శాసనంగా గుర్తించారు. తర్వాత రేనాటి చోళరాజు సత్యాశ్రయుడు పొట్లదుర్తి -మాలేపాడు



తాళ్లపాక గ్రామంలోని అన్నమాచార్య ధ్యానమందిరం

గ్రామంలో వేయించిన తెలుగుశాసనం రెండవది. రేనాటి చోళులు తమ శాసనాల్ని వేంగి - చాళుక్య లిపిలో వేయించారు.

తెలుగులో మొదటి శాసనాలలోని రేనాటి చోళుని పేరు ఎరికల్ ముత్తరాజు ధనుంజయుడు. ఇతడు నందివర్మ కుమారుడు. రేనాటి చోళులు 'చెప్పలియా' గ్రామం రాజధానిగా రేనాటి ప్రాంతాన్ని పాలించారు. దీన్ని 'పెద్ద చెప్పలి' గ్రామంగా గుర్తించారు. తోకను వీపుపైన చుట్టు తిప్పి ఎడమవైపు నిలుచున్న అసమాన పౌరుష, పరాక్రమములను చాటుతున్న సింహము రేనాటి చోళుల రాజలాంఛనం.

తొలితెలుగు శాసనంగా గుర్తించిన దానిలో 'ఎరికల్ముత్తు రాజు ధనుంజయుడు రేనాణ్డు ఏళన్' అను ఒక వాక్యభాగం అర్థమిస్తోంది. 'చిఋంబూరి రేవణకాలు పంపెచెనూరు కాజ అతికాళా ఊరిణ్జి వారు ఊరి' అనే వాక్యముంది. రేవటి చోళుల నాటి వాస్తు విధానాలకు సంబంధించి ప్రొద్దుటూరు దగ్గర పెన్నానది ఒడ్డున రామేశ్వరాలయమును 'పోర్ముఖరామ' అను బిరుదుతో పుణ్యకుమారుడు కట్టించినట్లు చరిత్ర చెప్తోంది. అక్కడి శాసనాన్ని బట్టి అతడు 'పృథివీ వల్లభ' అనే బాదామి చాళుక్య చక్రవర్తి పులకేశి బిరుదును స్వీకరించినట్లు తెలుస్తోంది. రేనాటి చోళరాజ్య నిర్వహణలో పరిపాలన సౌకర్యం కోసం హిరణ్యరాష్ట్రం, కురుమరుము, సిద్ధవేయి అనే విభాగాలు ఉన్నాయి.

తెలుగు భాష చరిత్రలో కడపజిల్లాను పాలించిన నేటి చోళరాజులకు విశిష్ట స్థానముంది.

## చారిత్రాత్మక 'కోటలు'

### గండికోట

కడప జిల్లా జమ్మలమడుగుకు 15 కిలోమీటర్ల దూరంలో పినాకిని తీరంలో నిర్మించబడిన ఈ కోట 40 అడుగుల ఎత్తు ప్రాకారాలతో, 101 బురుజులతో కన్పిస్తుంది. 10 మీటర్ల ఎత్తుగల ధాన్యాగారము, ఎఱ్ఱ కోనేరు, జామియా మసీదు, రఘునాథ, మాధవస్వామి ఆలయాలు కోటలో ఉన్నాయి. జామియా మసీదు చుట్టూ లోపల 64 బయట 32 గదులు 3 ప్రవేశద్వారాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ కోట క్రీ.శ. 1122లో అప్పటి కాకతీయ రాజు నిర్మించినట్లు తెలు స్తోంది. వల్లూరు రాజధానిగా పాలించిన అంబదేవుడు గండికోట నుంచి పాలన సాగించాడు. తళ్లికోట యుద్ధానంతరం గోల్కొండ నవాబు కులీకుతుబ్‌షా అమీరుల్ ముల్క్ ద్వారా ఈ కోటను వశపరచుకున్నాడు. 1687లో ఔరంగజేబు పాలనలోకి, తర్వాత కడప మయానా నవాబు అబ్దుల్ నబీఖాన్ చేతిలోకి కోట చేరింది. ఈ కోట పడమటి వైపున రెండు కొండల మధ్య ఏర్పడిన గండి ద్వారా పెన్నానది ప్రవహిస్తుంది. ఈ లోయ సుందరదృశ్యం ఆహ్లాదభరితం.

### సిద్ధవటం

కడపకు 25 కిలోమీటర్ల దూరంలో పినాకిని నది ఒడ్డున 35 ఎరాల సమతుల మైదానంలో ఈ కోట నిర్మితమైంది. 18 రాజవంశాలు ఈ కోట కేంద్రంగా పాలించాయి. క్రీ.శ.1233లో రాష్ట్రకూట వంశీయుడైన 3వ రాజేంద్రుడు సిద్ధవటం కోటను నిర్మించినట్లు చరిత్ర చెప్తోంది. 1801 నుండి 1806 వరకు ఆంగ్లేయుల పాలన ఉన్నది. 1807 నుండి 1812 వరకు కడపకు జిల్లా కేంద్రంగా ఉండేది. పెన్నానదికి వచ్చే వరదల కారణంగా 1812లో అప్పటిజిల్లా కలెక్టర్ సర్ థామస్ మన్రో జిల్లాకేంద్రాన్ని కడపకు మార్చాడు. కోటలో కళామండపం, సభామండపం, దర్గా, రాతి తోరణాలు, నృత్యకన్యలు చూడముచ్చటగా చెక్కబడి ఉన్నాయి. కోటబయట సిద్దేశ్వర్, రంగనాథాలయాలున్నాయి.


పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి ఆలయం

## జైనక్షేత్రం 'దానవుల పాడు'

కడపకు 70 కిలోమీటర్ల దూరంలో జమ్మలమడుగు దారిలో పినాకిని నదీతీరంలో ఈ 'దానవులపాడు' ఉంది. ప్రసిద్ధ జైనక్షేత్రాల్లో ఇది కూడా ఒకటి. దీని మొదటి పేరు కురుమరి. దీనికే కేదాండ్లపాడు, జాండ్లపాడు, జెన్నపాడనే పేర్లు కూడా ఉన్నాయి. క్రీ.శ.914-917 సంవత్సరాలలో నిత్యవర్షుని కాలంలో ఇది జైనపీఠంగా మారింది. తూర్పు పడమరలలో 7 మైళ్ల పొడవున పెద్దరాతిగోడ నిర్మాణం కన్పిస్తుంది. పార్శ్వనాథుని విగ్రహం కుడా ఉంది. క్రీ.శ. 696 - 737 నాటి విజయాదిత్యుని శాసనం కూడా ఇక్కడ బయల్పడింది. ఇక్కడి పార్శ్వనాథుని విగ్రహం దిగంబర విగ్రహం. ఇక్కడ గొర్రెవాళ్లు సంతానం కోసం చేసే బూతు తిరునాలను 1800 ప్రాంతంలో మన్రో నిషేధించాడు.

## ప్రసిద్ధ బౌద్ధారామం 'నందలూరు'

నందలూరి సమీపంలో బాహుదానదీ తీరాన లంజకనుమగుట్ట వద్ద బౌద్ధమతానికి చెందిన ఆనవాళ్లు బయటపడ్డాయి. ఇక్కడ 16 బౌద్ధస్తూపాలు, బ్రహ్మీలిపి శాసనాలు, చైత్యగృహము, పద్మములు, ధర్మచక్రముద్ర, మృణ్మయపాత్రలు, 1600 సీసపు నాణేలు లభించాయి. ఈ స్థూపాలు చక్రాకారంలో ఉండి మూడు అడుగుల ఎత్తు, 15 అడుగుల వ్యాసము మొదలుకొని 5 అడుగుల ఎత్తు, 100 అడుగుల వ్యాసం గల మహాస్థూపము వరకు ఉన్నాయి. క్రీస్తుపూర్వం 2,3 శతాబ్దాల నుండి ఇక్కడ బౌద్ధమతం వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తోంది. రాయలసీమలో బౌద్ధమతానికి చెందిన ఆనవాళ్లు మొదటిసారిగా ఇక్కడే బయల్పడ్డాయని చెప్పొచ్చు.

## ప్రత్యేక అంశాలు

- పులివెందుల తాలూకాలోని మోపూరు వద్ద 18 అడుగుల శివలింగం బయల్పడింది.
- దక్షిణభారతదేశంలోనే అతిపెద్ద ధ్వజస్తంభం రాయచోటి శ్రీవీరభద్ర ఆలయంలో ఉంది.
- ఆంజనేయుడు లేని ఏకైక రామాలయం ఉన్నది కేవలం ఒంటిమిట్టలోనే.
- క్రీ.శ.10వ శతాబ్దిలో చిలంకూరులో సూర్యవిగ్రహం ప్రతిష్టించబడింది.
- రైల్వే కోడూరుకు పశ్చిమాన శేషాచలం కొండల్లో 244 అడుగుల ఎత్తైన 'గుంజన జలపాతం' కన్పిస్తుంది.
- లంకమల అభయారణ్యంలో కలివికోటి (జెర్డాన్స్ కోర్సర్)ను ప్రఖ్యాత పక్షిశాస్త్రవేత్త సలీం అలీ వచ్చి చూశారు.
- ప్రపంచంలోనే అతి అరుదైన ఎర్రచందనం కడపజిల్లాలో లభిస్తుంది.
- రాతినార (ఆజ్‌బెస్టాస్) పులివెందులలో విస్తారంగా లభిస్తుంది. ■


గండికోట చెరువు

# చరిత్రపుటల్లో చంద్రగిరి



- వేంపల్లి గంగాధర్

సహస్రాబ్ది చరిత్రను తనలో నింపుకొని వన్నెతరగని రాజసంతో.. నిలువెత్తుదర్పంతో, నీరాజనాలందుకుంటోంది చంద్రగిరి దుర్గం. అఖండ విజయనగర సామ్రాజ్య పాలనకు చివరి రాజధానిగా విరాజిల్లి ఎన్నెన్నో పరిణామాల్ని తనలో లిఖించుకున్న అరుదైన చరిత్ర చంద్రగిరికి మాత్రమే సొంతం. ఆంధ్రభోజుడుగా కీర్తిపొందిన శ్రీ కృష్ణదేవరాయలు తన కిష్టమైన విడిదిగా చంద్రగిరిని ఏడుసార్లు సందర్శించడం మరో విశేషం. ఇలా ఎన్నో, ఎన్నెన్నో చరిత్ర ఆధారాలతో చారిత్రాత్మక ప్రాశస్త్యం కలిగిన కోటలో రాష్ట్రపర్యాటక శాఖ వారు అద్భుత రూపవాణి పేరుతో దృశ్య, శ్రవణ రూపకాన్ని ఏర్పాటు చేశారు. ఈ సౌండ్ అండ్ లైట్ షో పలువురి ప్రశంసలు అందుకుంటోంది. చరిత్ర అధ్యయనం దిశగా స్వర్ణముఖి నది వెంబడి పురావస్తుశాఖ సాగిస్తున్న తవ్వకాల్లో ఆనాటి విజయనగర సామ్రాజ్య ఆనవాళ్లు, ఆధారాలు లభిస్తున్నాయి. శిలలు, శాసనాలు, కట్టడాలు ఎన్నో వెలుగు చూస్తున్నాయి.

### ఇదే చంద్రగిరి!

చిత్తూరు జిల్లాలో తిరుపతికి 14 కి.మీ. దూరంలో క్రీస్తుశకం 10వ శతాబ్దంలో కార్వేటి పాలకుడు ఇమ్మడి నరసింహరాయలు కోట నిర్మాణానికి ముందుగా శ్రీకారం చుట్టాడు. రెండు భాగాలుగా జరిగిన ఈ కోట నిర్మాణం 25.5 ఎకరాల స్థలంలో రెండు కిలోమీటర్లు చుట్టుకొలత కల్గి వుంది. సరిహద్దుగా వున్న లోయ ప్రాంతాలకు 183 మీటర్ల ఎత్తులో కోట నైసర్గిక స్వరూపం తీర్చిదిద్దబడింది. కోట లోపల శత్రు దుర్భేద్యమైన దుర్గం, గంభీరమైన రాజ ప్రాసాదాలు, దేవాలయాలు, శిలామండపాలు, మూడు అంతస్తులు కలిగి వున్న రాజమహల్, రాణిమహల్, పుష్కరిణి లాంటి ఎన్నో సందర్శనీయ స్థలాలు గత చరిత్రకు ఆధారంగా కనిపిస్తాయి. క్రీ.శ. 1000 సంవత్సరంలో చంద్రగిరి ప్రాంతానికి అత్యంత దగ్గరగా వున్న నారాయణ వనంను పరిపాలించే ఇమ్మడి యాదవ నరసింహ రాయలు చంద్రగిరి కోట పట్ల అత్యంత ఆసక్తి కనపరచి దుర్గం నిర్మాణానికి పూనుకున్నారు. కోట చుట్టూ పెద్ద శిలలతో పటిష్టమైన ప్రాకారం మధ్యలో బురుజులు దర్శనమిస్తాయి. కోటకు రెండు వైపులా ప్రవేశద్వారాలు ఉన్నాయి. హిందూ, ఇస్లాం సంస్కృతుల సమ్మేళనంగా నిర్మించిన కళాత్మక కట్టడాలు కనులవిందుగా తీర్చిదిద్దబడ్డాయి.



స్థానిక చరిత్ర ప్రకారం చంద్రగిరికోట 314 సంవత్సరాలు యాదవరాజుల పరిపాలనలో సాగింది. ఆ తర్వాత వచ్చిన మార్పుల కారణంగా విజయనగర సామ్రాజ్యంలోకి విలీనమైంది. సాళువ వంశానికి చెందిన ప్రభువు నరసింహరాయలు చంద్రగిరికి విచ్చేశారు. క్రీ.శ. 1565 సంవత్సరంలో జరిగిన తళ్లికోట యుద్ధం (రాక్షస-

(3వ కవరులో మిగిలిన భాగం)

ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక నవంబర్ 2002.

(2వ కవరు తరువాయి)





తంగడి యుద్ధం) తోనే విజయనగర సామ్రాజ్యం పతనం కాలేదు. దక్కన్ సుల్తాన్‌ల మధ్య ఏర్పడిన ఐకమత్యం కూడా ఎంతోకాలం నిలువలేదు. రాక్షస- తంగడి యుద్ధంలో విజయనగరం ఓటమి దాని సైనిక ప్రతిష్టకు భంగం కల్గించింది. సుల్తానుల వద్దనుంచి రామరాయలు సంపాదించిన ప్రదేశాలన్నీ వారికి తిరిగి అప్పగించి తిరుమల రాయలు సుల్తానులతో సంధి చేసుకున్నాడు. సుల్తానులు విజయనగరం నుంచి తిరిగిపోయిన తర్వాత విజయనగరం పూర్వనిర్మాణం సాధ్యం కాకపోవడంతో పెనుకొండ (అనంతపురం జిల్లా) ను విజయనగర రాజుల రెండవ రాజధానిగా నిర్మించుకున్నారు. సామ్రాజ్య స్వభావంలో ఏర్పడిన ఈ మార్పు కారణంగా పరిపాలనలో కూడా తిరుమల రాయలు కొన్ని మార్పులు నూతనంగా చేయవలసి వచ్చింది. భాషా ప్రాతిపదిక మీద సామ్రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజించారు. సామ్రాజ్యంలోని ఆంధ్ర ప్రాంతానికి, రాయలసీమ ప్రాంతాలకు పెనుకొండ రాజధానిగా తన జ్యేష్ఠపుత్రుడైన శ్రీ రంగ నాయకుడిని పాలకుడిగా చేశాడు. కన్నడ ప్రాంతానికి శ్రీరంగ పట్నం కేంద్రంగా రెండవ కుమారుడైన రామరాయలను పాలకుడిగా చేశాడు. చంద్రగిరి దుర్గం కేంద్రంగా తమిళ ప్రాంతాలకంతా కనిష్ట కుమారుడైన వెంకటపతి రాయలను పాలకుడిగా నియమించడం జరిగింది. ఇదీ చంద్రగిరి పాలకుడిగా వెంకటపతిరాయలను నియమించడం వెనుక వున్న అసలు కథ. ఈ విధంగా ఆరవీటి వంశస్తుల పాలన కిందకు చంద్రగిరి చేరుకోగానే క్రీ.శ. 1585 సంవత్సరంలో శ్రీ వెంకటపతి దేవ మహారాయలు సింహాసనం అధిష్టించారు.

కాల గమనంలో 16వ శతాబ్దం మొదటి భాగంలోనే అంతర్యుద్ధాలతో చంద్రగిరి సామ్రాజ్యం పతనావస్థకు చేరుకుంది. మూడవ శ్రీరంగరాయల కాలంలో యూరప్‌నుంచి వచ్చిన వర్తక కంపెనీలు పోటీ పడ్డాయి. ఫలితంగా క్రీ.శ. 1639లో ఈస్టిండియా కంపెనీకి చెందిన ఫ్రాన్సిస్‌డేకు మద్రాసు సముద్రతీరం విక్రయించారు. క్రీ.శ. 1646లో చంద్రగిరి కోట గోల్కొండ ప్రభువుల వశమైంది. కర్నూలు నవాబుకు సోదరుడైన అబ్దుల్ వహీద్‌ఖాన్ పాలనలోనూ, అనంతరం మైసూరు నవాబు హైదర్‌అలీ పాలన (క్రీ.శ. 1782) లోకి చంద్రగిరి చేరింది. ఈస్ట్ ఇండియా కంపెనీకి ఫోర్ట్ సెయింట్ జార్జికోట నిర్మాణానికి అప్పటి కాళహస్తి జమీందారు దామెర్ల వెంకటాద్రి దళారీగా సాగించిన చర్చల కారణంగా అధికార పత్రాలపై చంద్రగిరి కోటలోనే సంతకాలు జరిగాయి. క్రీ.శ. 1799 నాటికి చంద్రగిరి పూర్తిగా బ్రిటిష్ వారి ఆధీనంలోకి వచ్చింది. తిరుమల శ్రీ వేంకటేశ్వరుని దర్శనార్థం వచ్చే విజయనగర సామ్రాజ్య సార్వభౌముడు శ్రీ కృష్ణదేవరాయలు ఏడుసార్లు విచ్చేసి, చంద్రగిరి కోటలోనే కొలువుదీరినట్లు చరిత్ర చెప్తుంది. రాయల విగ్రహాన్ని కోటలో ఇప్పటికీ చూడవచ్చు.

### మ్యూజియంలో

చంద్రగిరి దుర్గంతో పాటుగా, చుట్టుపక్కనున్న చారిత్రాత్మక ప్రదేశాలు యాగంటి, గుడిమల్లము, తిరుపతి ప్రదేశాలలో బయల్పడిన శిలా విగ్రహాలు, కాంస్యప్రతిమలను భారతీయ పురావస్తుశాఖ వారు సేకరించి 'రాజమహల్'లో ప్రత్యేక మ్యూజియాన్ని ఏర్పాటుచేశారు. గుడిమల్లములోని పరశురామేశ్వర ఆలయంలోని నివేదిక లింగరుద్రమూర్తి (ఇది క్రీపూర్వ. రెండవ శతాబ్దం నాటిది) నమూనాను కూడా ఈ మ్యూజియంలో మనం చూడవచ్చు. చోళ, విజయనగర సామ్రాజ్యాలకు సంబంధించిన ఉమామహేశ్వర, వేణుగోపాల, శ్రీనివాస, కోదండరామ, శ్రీదేవి, భూదేవి, పార్వతీదేవతల కాంస్యప్రతిమలు కూడా సేకరించగలిగారు. శైవ, వైష్ణవ, జైన మతాలకు చెందిన శిలా, కాంస్య విగ్రహాలను కూడా మ్యూజియంలో మనం సందర్శించ వచ్చు. శ్రీకృష్ణ దేవరాయలు ఆయన దేవేదులు తిరుమలదేవి, చిన్నాంబి కల శిలా ప్రతిమలతో పాటు వెంకటపతి రాయలు, దేవేరులతో కూడిన శ్రీ రంగ రాయల శిలా ప్రతిమలు కూడా మ్యూజియంలో వున్నాయి.



### నేటి వైభవం

నాటి చరిత్రకు తార్కాణంగా నేటి వైభవాన్ని చాటి చెప్పడానికి హైదరాబాదు గోల్కొండ కోట తరహాలోనే సౌండ్ అండ్ లైట్ షో ను ప్రదర్శిస్తున్నారు. ప్రతిరోజూ తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ఈ ప్రదర్శన జరుగుతుంది. రాజమహల్‌కు, కొండలకు నడుమ తటాకం ఆహ్లాదపరుస్తూ ఉంటుంది.

విజయనగర సామ్రాజ్యంలో అత్యంత కీలక ప్రాంతంగా పేరు పొందిన చారిత్రాత్మక చంద్రగిరి కోట పర్యాటక కేంద్రంగా ప్రకటించబడింది. తిరుమలకు అతి తక్కువ దూరంలోనే ఉన్న ఈ కోటను సందర్శించండి. చరిత్ర పునాదులను పలుకరించండి. ◆





# తొలి తెలుగు శాసనాలను కాపాడుకోలేమా?

**తెలుగుభాషకు ప్రాచీన హోదా లభించిందని అందరికీ సంతోషమే. అందుకోసం చూపించిన ఆధారాలలో కడపజిల్లా శాసనాలు ముఖ్యమైనవి అయినప్పుడు అవి ఎంత భద్రంగా ఉండాలి? కాని ఎండకు ఎండి వానకు తడిసి నడిచే దారులుగా కూర్చునే అరుగులుగా ఉపయోగపడుతున్నాయి మన తొలి తెలుగు శాసనాలు. వీటి దుస్థితి గురించే ఈ వ్యాసం.**

తొలి తెలుగు లిపి శాసనాలకు పాడు కాలం దాపురించింది. వాటి విలువ గుర్తించేవారు లేరు. వాటిని వెలికితీసి సంరక్షించి భావితరాలకు చరిత్రను అందించాలనేవారు అసలే లేరు. తెలుగు లిపి పరిణామక్రమాన్ని, శాసనాల భాషగా మారిన వైనాన్ని, నాటి సామాజిక పరిస్థితులను అధ్యయనం చేయడానికి మనకు మిగిలిన ఏకైక ఆధారాలు ఈ శాసనాలు. తెలుగు భాష ప్రాచీనతకు ఆధారాలైన ఈ శాసనాలు ఎందుకు ఇంత నిర్లక్ష్యంగా పడి వుంటున్నాయి?



కలమల్లలో లిపిని కోల్పోతున్నతెలుగు శాసనం, ఇలాంటివే మరో రెండు కూడా ఉన్నాయి.




కడప జిల్లా పర్యాటక ప్రాంతాల అభివృద్ధికోసం రాష్ట్ర ప్రభుత్వం 30 కోట్ల రూపాయలు కేటాయించింది. కానీ ఎవరికీ ఈ శాసనాలు కానీ, కలమళ్ల, మాలే పాడు, యర్రగుడిపాడు వంటి చారిత్రాత్మక ప్రదేశాలుగానీ పట్టడం లేదు.

## తొలిశాసనం

'కలమళ్ల' పేరు ఎప్పుడైనా విన్నారా? మనం ఎంతో గొప్పగా, ఘనంగా చాటి చెప్పుకుంటూ ప్రాచీన హోదాకోసం పోటీకి దిగడానికి నిలబడే సత్తానందించిన తొలి తెలుగు శాసనాలున్న చారిత్రాత్మక ప్రాంతం అది.

క్రీ.శ. 575లో 'ఎరికల్ ముత్తురాజు' బిరుదుతో ధనుంజయుడు కమలాపురం తాలూకా (కడప జిల్లా) కలమళ్ల గ్రామంలోని చెన్నకేశవాల యం ప్రాంగణంలో వేయించిన తొలి తెలుగు శాసనాల పరిస్థితి ఇప్పుడు దయనీయంగా వుంది. అప్పుడెప్పుడో కొన్ని రాతి శాసనాలు మద్రాసు మ్యూ జియానికి తరలిపోగా మిగిలిపోయిన వాటి పరిస్థితి చూస్తే ఏ చరిత్ర పరి శోధకుడికైనా, ఏ తెలుగు భాషాభిమానికైనా హృదయం చెమ్మగిల్లుతుంది.

కలమళ్ల చెన్నకేశవాలయం బయట, రోడ్డు పక్కన నిలువెత్తు రాతి శాసనం నిస్సహాయంగా నిలబడి ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ తొలి తెలుగు లిపిని పోగొట్టుకుంటూ కన్నీరు కారుస్తోంది. మరో శాసనం బండ రాళ్ల మధ్య పడివుంటే, ఇంకొకటి పిచ్చిమొక్కల మధ్య కంప పొదలమధ్య పడి వుంది. కడప జిల్లా కేంద్రం నుండి 58 కిలోమీటర్ల దూరంలో ముద్దనూరు – యర్రగుంట్ల స్టేషన్ల మధ్య కలమళ్ల స్టేషన్ ఉంది. అక్కడ్నుంచి 3 కిలోమీటర్ల దూరంలో ఉంది చెన్నకేశవాలయం – అదే మన తొలి తెలుగు శాసనానికి పుట్టిల్లు. ఇప్పుడక్కడ నాలుగు శాసనాలు మిగిలివున్నా అవి క్రమంగా లిపిని కోల్పోతూ రాళ్లుగానే మిగిలి ఉన్నాయి.

## రేనాటి చోళులు

క్రీ.శ. 6వ శతాబ్దిలో కడప, అనంతపురం, కర్నూలు, చిత్తూరు జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలను కలిపి రేనాడు అని పిలిచేవారు. ఇది ఏడువేల గ్రామాల మండలం. దీనిని చోళరాజులు పాలించేవారు. కాబట్టి వీరికి రేనాటి చోళులు అని పేరొచ్చింది. ఆనాటి భాషా స్వరూపాన్ని ఇప్పటి దాకా నిలబెట్టిన ఘనత వీరికే దక్కుతుంది.

చరిత్రకారులు హెచ్.కృష్ణశాస్త్రి, వెంకట్రామ య్య, నీలకంఠశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, నేలటూరి వెంకటరమణయ్యలు 'రేనాటి చోళుల' గురించి తమ రచనల్లో ఎంతో సమాచారం అందించారు. రేనాటి చోళులు మొదట పల్లవుల, తర్వాత బాదామి చాళుక్యుల సామంతులుగా వున్నట్లు తెలుస్తోంది. కొన్ని తామ్ర శాసనాలు, ప్రొద్దుటూరు రామేశ్వరంలోని శిలాశాసనాలు వారు లిఖించినవే. కమలాపురం తాలూకాలోని కలమళ్ల గ్రామంలో ధనుంజయవర్మ వేయించిన శిలాశాసనం తెలుగు భాషకే మొదటి వాక్య రచనగా, తొలి శాసనంగా గుర్తించబడింది. దీన్ని బట్టి మన లిపి ఆరవ శతాబ్దం నాటిదని చరిత్రకారుల అభిప్రాయం.

## ఎర్రగుడిపాడు

రెండవ శాసనాన్ని కమలాపురం తాలూ కాలోని ఎర్రగుడిపాడులోని చెన్నకేశవాలయంలో గుర్తించారు. రెండవ శాసనం పరిస్థితి మరింత దారుణం. ఆలయం ఆవరణలో చుట్టూ పరిచిన బండపరుపులో శాసనాన్ని కూడా గ్రామస్థులు చేర్చేశారు. నిలువెత్తు ఆ శాసనంలోని లిపి మొత్తం కొట్టుకుపోగా ఇప్పుడు బండమాత్రమే మిగిలింది. ఇక గోడలకు లిఖించబడివున్న శాసనాలకు సున్నాలు వేయడం, ఎర్రమట్టి పూయడంతో మరింతగా లిపి రూపును కోల్పోయింది. కనిపించినంతమేర ఇది ఆనాటి రాజకీయ చరిత్రను చెప్తోంది. చోళుల శాసనాలలో పల్లవ యువ రాజుల పేర్లను పేర్కొనడం వల్ల బహుశా పల్లవులకు, చోళులకు మధ్య అధికార, సామంత సంబంధాలు ఉన్నాయని తెలుస్తోంది.

## మాలేపాడు

క్రీ.శ.575లో రేనాటి చోళరాజు సత్యాశ్రయుడు పోట్లదుర్తి – మాలేపాడు

గ్రామాల్లో వేయించిన తెలుగు శాసనాలు కూడా ఎంతో ప్రసిద్ధి చెందినవే. రేనాటి చోళులు వేంగి - చాళుక్య లిపిలో శాసనాలు రాయించారు. అదే ఇప్పటి తెలుగు కన్నడ లిపిల ప్రాచీన రూపం. నన్నయ్య ఈ వేంగి చాళుక్య లిపిలోనే తన భారతం రాసివుంటారని పండితుల అభిప్రాయం. ఇక్కడి శాసనం ఎర్రరాతిపై "చోళ మహారాజు ఒప్పుకుంటే ఇనుప్రోలు అనే గ్రామం లోని రేవణ, వుద్దణ అనే కులపెద్దలు పెద్ద బ్రాహ్మణుడు 'ఇశరేడు'గారికిచ్చిన పన్నస ఇది' అని లిఖించబడి వుంది.

## చు - లి - యె

క్రీ.శ. 640 - 41 ల్లో చైనా యాత్రికుడు హులయాన్‌త్సాంగ్ రేణడు ప్రాంతాన్ని పర్య టించాడు. ఈ ప్రాంతాన్ని అతడు 'చుళియె' (చు-లి-యె) అన్నాడని ... అంటే చోళరాజుల ప్రాంతమని చరిత్రకారుల భావన.

చోళరాజైన సత్యాదిత్యుడు రేనాడునూ, సిద్ధవటంనూ, చోళమహాదేవి రాణి 'చిలమకూరు'నూ, శ్రీకాంత చోళుడు లేబాక, అత్తిరాల ప్రాంతాలను పాలించినట్లు 'మాలే పాడు' శాసనం ధృవీకరిస్తోంది.పోర్ముఖరామ అనే బాణరాజు పెన్నేరు హద్దుగల ప్రాంతాన్ని చోళుల తర్వాత పాలించినట్లు పొట్టిపాడు శాసనం చెబుతోంది. రెండవ కృతివర్మ మరణంతో బదామీ చాళుక్యుల పాలన అంతమై రేనాడులో చోళుల పాలన ప్రారంభమైందని చరిత్రకారుల అభిప్రాయం.

## తెలుగు సేవ

రేనాటి చోళుల కారణంగానే ఇవాళ మనకు ప్రాచీన తెలుగువాక్య రచనా విధానం తెలుస్తోంది. తెలుగులోని మొట్టమొదటి శాసనాలలో కనిపించే

**పాకృత, ద్రావిడ భాషలనుండి విడిపోయి తెలుగు లిపి నిర్మితం కావడం ఈ శాసనాల్లో కన్పిస్తుంది. అప్పటికే వాడుకలో ఉన్న బ్రాహ్మీ లిపినే కొన్ని మార్పులతో తెలుగు, కన్నడ వారు వాడుకున్నట్లు కూడా చెబుతారు.**

రేనాటి చోళుని పేరు ఎరికల్ ముత్తరాజు ధనుంజయుడు. ఇతడు నందివర్మ కుమారుడు. ఎరికల్ అనేది రేనాటి సీమలోని గ్రామమై ఉంటుందని పండితుల అభిప్రాయం. రేనాటి చోళులు 'చెప్పలియా' గ్రామాన్ని రాజధానిగా చేసుకొని పాలించారని, దీనిని ఇప్పటి కమలాపురం తాలూకాలోని పెద్ద చెప్పలి గ్రామంగా గుర్తించారని చెబుతారు.

క్రీశ 625లో వచ్చిన పుణ్యకుమారుడు పోర్ముఖరామ, పురుష శార్దుల, మదన విలాస, మద ముదిత, ఉత్తమోత్తమ వంటి బిరుదులు పొందాడు. ఇతని భార్య వసంతపోరి. ఈయన కాలంలో లిఖించబడ్డ తామ్ర శాసనంలో పుణ్యకుమారుడు హిరణ్య రాష్ట్రము(సీమ)ను పాలిస్తూ పొద్దుటూరి వారికి కొంత భూమిని దానం చేసినట్లు ఉంది. ఈ శాఖకు చెందిన రాజుల తర్వాత సుందర నందుని వంశములోని శ్రీకంఠ చోళరాజులవి రెండు తామ్రశాసనాలు మాత్రమే లభించాయి. వీరి తర్వాత వైదుంబ రాజులు రేనాడుని ఆక్రమించుకోగా వీరు పొత్తలి ప్రాంతానికి తరలి వెళ్లినట్లు చరిత్ర కథనం.



## చోళుల చరిత్ర

తెలుగు భాష చరిత్రలో రేనాటి చోళులకు ఒక విశిష్ట స్థానం ఉంది. రేనాటి చోళుల చరిత్ర తెలుసుకోవడానికి నాలుగు తామ్ర శాసనాలు, 50 శిలాశాసనాలు ఆధారాలుగా లభించాయి. మాలెపాడు, దొమ్మరి నంద్యాలలో దొరికిన రెండు తామ్ర శాసనాల వలన కరికాలుడి వంశములో నందివర్మ జన్మించినట్లు తెలుస్తుంది. అతని వారుసుల్లో విక్రమాదిత్యుడు చోళ మహారాజుగా పేరెన్నికగన్నవాడు. ఈ శాసనాల ఆధారంగా రేనాటి చోళులు క్రీ.శ. 550 నుండి క్రీ.శ. 850 వరకు సుమారు 300 సంవత్సరాలు రాజ్యపాలన చేసినట్లు తెలుస్తోంది.



కలమల్లలో విరిగిపడి ఉన్న రాతి శాసనం



యర్రగుడిపాడు చెన్నకేశవాలయంలోని తెలుగు శాసనం

## పరిరక్షించుకోవాలి

పాకృత, ద్రావిడ భాషలనుండి విడిపోయి తెలుగు లిపి నిర్మితం కావడం ఈ శాసనాల్లో కన్పిస్తుంది. అప్పటికే వాడుకలో ఉన్న బ్రాహ్మీ లిపినే కొన్ని మార్పులతో తెలుగు, కన్నడ వారు వాడుకున్నట్లు కూడా చెబుతారు. సంస్కృత - ప్రాకృత - ద్రావిడ సమ్మిళితమైన భాషా స్వరూపం తెలుగు భాషమీద పడింది.

రేనాటి చోళుల శాసనాలను మరింత లోతుగా పరిశీలిస్తే అప్పటి తెలుగు లిపిలో, భాషలో గల అక్షర విశేషణములు, పద విశేషాలు, వాక్య రచనా విధానం, ఉచ్చారణ సౌలభ్యం కోసం చేసుకున్న ఇతర మార్పులు మనకు స్పష్టంగా విశదమవుతాయి.

క్రీ.శ. 6 వ శతాబ్ది నుంచి క్రీ. శ. 10 వ శతాబ్ది వరకు తెలుగు లిపిలో వచ్చిన పరిణామక్రమం రేనాటి చోళుల శాసనాల అధ్యయనం వల్ల సాధ్యమవుతుంది. ఇలాంటి కీలకమైన చారిత్రక ఆధారాలున్న శాసనాలు రాతిబండలుగా మిగిలిపోతున్నాయి. వీటిని మనం రక్షించుకోకపోతే చరిత్ర మనల్ని క్షమిస్తుందంటారా?

*(డా. జి.వి.సాయిప్రసాద్‌తో కలిసి)*

ఫోటోలు, వ్యాసం :
వేంపల్లి గంగాధర్

—డా॥ వేంపల్లి గంగాధర్

# రాయలసీమ భౌగోళిక, చారిత్రక నేపథ్యం

అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు రాయలసీమ ప్రాంతంలో భాగంగా వున్నాయి. కాకతీయుల కాలంలో ప్రారంభమైన చెరువుల ఇంజనీరింగ్ విజయనగర రాజుల కాలంలో ఉన్నత స్థాయిని చేరుకుంది. క్రీస్తు శకం 1136 నుంచి 1650 సంవత్సరం వరకు అధికారంలో వున్న విజయనగర సామ్రాజ్యంలో రాయలసీమ ప్రాంతం ప్రముఖ పాత్ర వహించింది. నాడు విజయనగర రాజులు ఈ ప్రాంతాన్ని వ్యవసాయకంగా అభివృద్ధి చేశారు. నీటిపారుదల ఏర్పాట్ల కోసం ప్రత్యేక శ్రద్ధ వహించారు. చెరువులు, కాలువలు, ఆనకట్టలు కట్టించారు. 'బహుశా ఆనాడు రాయలసీమలో గుడిలేని ఊరు ఉండేదేమో కానీ చెరువు లేని ఊరు ఉండేది కాదు' అని ప్రముఖ రచయిత వల్లంపాటి వెంకటసుబ్బయ్య రాశారు.

విజయనగర రాజుల ఏలుబడిలో ఆహార పంటలే గాక పత్తి, చెరుకు, కొబ్బరి, తమలపాకు, పోక, ధాన్యం, పప్పు దినుసులు మొదలైన వాణిజ్య పంటలు కూడా విస్తారంగా పండించారు. నాడు ఈ ప్రాంతాన్ని పరిపాలించిన విదేశీయులు ఎందరో నాటి పరిపాలనను ఘనంగా కీర్తించారు. కానీ 1650లో పెనుగొండ వద్ద జరిగిన యుద్ధంలో విజయనగర రాజ్యాన్ని పూర్తిగా ధ్వంసం చేశారు. ఆ తర్వాత రాయలసీమ ప్రాంతం అనేక చేతులు మారి చివరిగా బ్రిటిష్ వారి ఆధీనంలోకి వచ్చింది. 1800 సంవత్సరంలో నిజాం ప్రభువులు దత్తమండలం (సీడెడ్ జిల్లాలు)గా రాయలసీమ ప్రాంతాన్ని బ్రిటిష్‌వారికి అప్పగించారు. అయితే విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత ఇక్కడి పరిస్థితులు మారి పోయాయి. కరువు కాటకాల నిలయమైంది. ఈ పరిస్థితుల పర్యవసానాలు తరతరాలుగా కొనసాగుతున్నాయి. ఈ క్రమంలోనే ఈ నాలుగు జిల్లాల జనజీవనం అనేక మలుపుల్ని సంతరించుకుంది[1].

## 1.1 భౌగోళిక స్వరూపం

ప్రస్తుతం అనంతపురం, కర్నూలు, కడప మరియు చిత్తూరు జిల్లాలు కలిపి రాయలసీమగా వ్యవహరిస్తున్నాం. రాయలసీమ ప్రాంతం సముద్ర మట్టానికి 300 అడుగుల నుండి 700 అడుగుల ఎత్తులో ఉంది. రాయలసీమకు ఈశాన్య మరియు పశ్చిమ ప్రాంతాన కర్నాటక, ఉత్తరాన మహబూబ్‌నగర్, తూర్పున ప్రకాశం మరియు నెల్లూరు జిల్లాలు, దక్షిణాన తమిళనాడు రాష్ట్రం ఉంది. ఎక్కువగా ఈ ప్రాంతంలో ఎర్రనేలలు, ఎర్రపాడి నేలలు, నల్లరేగడి నేలలు ఉన్నాయి. పుత్తూరు, సత్యవేడు తాలూకాలలో అల్యూమినియం నేలలు, కర్నూలు జిల్లా ఉత్తర భాగంలో నల్లరేగడి నేలలు విస్తరించాయి. అడవులు, నదులు, కొండలు, ఖనిజాలు, పంటలు, పుణ్యక్షేత్రాలు సాంస్కృతిక రూపాలతో వైవిధ్యాన్ని సంతరించుకుంది.

### 1.1.1 శీతోష్ణ స్థితులు

రాయలసీమ ప్రాంతం $12^0$ 37-$16^0$ 18 ఉత్తర అక్షాంశం నుండి $76^0$ 47 - $79^0$ 55ల తూర్పు రేఖాంశముల మధ్య ఉన్నది. ఈ ప్రాంతం 67400 చదరపు కిలోమీటర్లు ఆంధ్రప్రదేశ్‌కు దక్షిణ ఈశాన్య ప్రాంతంలో వ్యాపించి ఉన్నది. 2001 జనాభా లెక్కల ప్రకారం ఈ ప్రాంతం జనాభా 13,517.644. రాయలసీమ వాతావరణాన్ని నాలుగు రకాలుగా విభజించవచ్చు. డిసెంబర్ నుంచి ఫిబ్రవరి వరకు చలికాలం, మార్చి నుంచి మే నెల వరకు ఎండాకాలం (వేసవి కాలం), జూన్ నుంచి ఆగస్టు వరకు గాలి కాలం, సెప్టెంబర్ నుంచి నవంబర్ వరకు వర్షాకాలంగా విభజించవచ్చు.

రాయలసీమలో కొండలు విస్తారంగా ఆక్రమించుకుని ఉన్నాయి. కడప జిల్లాలో పాలకొండలు, వెలిగొండలు, లంకమల, మల్లేల కొండలు, శేషాచల, నల్లమల కొండలు విస్తరించి ఉన్నాయి. తూర్పు కనుమలు చిత్తూరు జిల్లాకు నైఋతి భాగంలో ప్రవేశిస్తాయి. శేషాచలం కొండలు అత్యంత ప్రాధాన్యత పొంది ఉన్నాయి. మదనపల్లె సమీపంలో 4,000

అడుగుల ఎత్తులో హార్సిలీ కొండలు ఉన్నాయి. అనంతపురం జిల్లా గుత్తి మండలంలో ముచ్చుకోట కొండలు, నాగసముద్రం కొండలు, ధర్మవరం వద్ద మల్లప్ప కొండలు, పెనుగొండలు, మడకశిర కొండలు ఉన్నాయి. కర్నూలు జిల్లాలో నల్లమల కొండలు, ఎర్ర కొండలు ఉన్నాయి.

**1.1.2 నదులు**

రాయలసీమ ప్రాంతంలో ప్రవహించే ప్రధాన నదులలో పెన్నా, తుంగభద్ర, పాపాఘ్ని, చిత్రావతి ముఖ్యమైనవి. జీవ నదులకంటే వర్షాధారిత నదులే ఈ ప్రాంతంలో ఎక్కువగా ఉన్నాయి. అనంతపురం జిల్లాలో పెన్నానది ప్రధానమైనది. కర్నాటక రాష్ట్రంలోని నందికొండలో పుట్టి, హిందూపురం మండలం దక్షిణాన చేలూరు గ్రామం వద్ద ప్రవేశిస్తుంది. చిత్రావతి నది కర్నాటకలోని కోలార్ జిల్లాలో నందిదుర్గం వద్దగల హరిహరేశ్వర్ కొండల్లో పుట్టి చిలమత్తూరు మండలంలోని కొడికొండ గ్రామం వద్ద జిల్లాలోకి ప్రవేశిస్తుంది. వేదవతి (హగరి) నది బ్రహ్మసముద్రం మీదగా ప్రవహిస్తుంది. జయమంగళ నది పరిగి మండలంలో ప్రవేశిస్తుంది. కుషావతి నది చిలమత్తూరు వద్ద, స్వర్ణముఖి అగళి వద్ద, పాపాఘ్ని నది తనకల్లు వద్ద, మద్దిలేరు నల్లమాడ మీదుగా, పండమేరు రాప్తాడు మీదుగా ప్రవహిస్తున్నాయి. అయితే ఇవి జీవనదులు కావు, వర్షాధారితమైనవి.

చిత్తూరు జిల్లాలో పాపాఘ్ని, పింఛా, కౌండిన్య, పొన్న, ఆరణి, స్వర్ణముఖి, బాహుదా, కళ్యాణి, కుశస్థతి అనే వర్షాధారిత నదులు ప్రవహిస్తున్నాయి. పాపాఘ్ని నందికొండల్లో పుట్టి మదనపల్లెకు పశ్చిమంగా ప్రవహించి అనంతపురం జిల్లాలో కలుస్తుంది. పుత్తూరుకు ఉత్తరభాగంలో ఆరణి నది పుట్టి సత్యేవేడు ప్రాంతాల మీదుగా చెంగల్పట్టు చేరుతుంది. స్వర్ణముఖి నది చంద్రగిరి కొండల్లో పుట్టి తిరుపతి, శ్రీకాళహస్తిల ద్వారా నెల్లూరులో కలుస్తుంది. బాహుదా నది హార్సిలీ కొండల్లో పుట్టి మదనపల్లె, వాయల్పాడుల మీదుగా కడపలోని

పెన్నానదిలో కలుస్తుంది. కుశస్థలినది పుత్తూరు ప్రాంతంలో పుట్టి నగరి మీదుగా వెళ్లి చెంగల్పట్టులో కలుస్తుంది. కళ్యాణి నది ఆదరం కొండల్లో పుట్టి శ్రీనివాస మంగాపురం ద్వారా చంద్రగిరి సమీపంలోని ముక్కోటికి పడమర వైపున స్వర్ణముఖి నదిలో కలుస్తుంది. పింఛానది పుంగనూరు మండలంలోని ఆవులపల్లి అడవుల్లో జన్మించి పుంగనూరు, వాయల్పాడుల మీదుగా ప్రవహించి కడప జిల్లాలో బాహుదాలో కలుస్తుంది[2].

కడప జిల్లాలో పెన్నా, చిత్రావతి, కుందూ, పాపాఘ్ని, సగిలేరు, చెయ్యేరు, పింఛా, మాండవ్య, గుంజన నదులు ప్రవహిస్తున్నాయి. పెన్నానది ప్రొద్దుటూరు, జమ్మలమడుగుల మీదుగా ప్రవహిస్తుండగా, చిత్రావతి పార్నపల్లె మీదుగా, కుందేరు నది గండికోట మధ్య ప్రవహిస్తోంది. పాపాఘ్ని నది ఆదినిమ్మాయపల్లె వద్ద పెన్నానదిలో కలుస్తోంది. సగిలేరు గిద్దలూరు వాయువ్య భాగంలో నల్లమల కొండల్లో పుట్టి పోరుమామిళ్ళ ప్రాంతంలో ప్రవహించి పెన్నానదిలో కలుస్తోంది. చెయ్యేరు నది రాయచోటి మండలంలోని సరిపల్లెవాండ్లపల్లె ద్వారా నందలూరుకి ప్రవేశిస్తుంది. పింఛా చిత్తూరు జిల్లా పుంగనూరు మండలంలోని ఆవులపల్లి కొండల్లో జన్మించి, ముడుంపాడు దగ్గర రాయచోటి మండలంలోకి ప్రవేశించి, రాయవరంలోని బాహుదా నదిలో కలుస్తుంది. గుంజన నది శేషాచలం పర్వతాల్లో పుట్టి కోడూరు రైల్వేస్టేషన్‌కు దక్షిణ దిశలో పోతురాజు పల్లె నుండి శెట్టిగుంట మీదుగా ప్రవహించి పెన్నానదిలో కలుస్తుంది.

కర్నూలు జిల్లాలో ప్రవహించు ప్రధాన నదులు తుంగభద్ర మరియు దాని ఉపనదులైన హంద్రి, కుందం. తుంగభద్ర పడమటి కనుమల్లో పుట్టి ఉత్తరం దిశగా కర్నూలులోకి ప్రవేశిస్తుంది. తుంగభద్రకు ఉపనదైన హంద్రి మద్దిగెరలో నుంచి ప్రవహిస్తూ ఎర్రమలకొండలు, కోడుమూరు మండలంలోని లద్దగిరి వద్ద ప్రవేశించి కర్నూలు వద్ద తుంగభద్రలో కలుస్తుంది.

### 1.1.3 ఉష్ణోగ్రత

రాయలసీమలో సమశీతోష్ణ వాతావరణం వుంటుంది. ఉష్ణోగ్రత మార్చి - మే మాసం

వరకు $37^0$ సెంటిగ్రేడు నుండి $44^0$ సెంటిగ్రేడు వరకూ, నవంబరు నుండి జనవరి వరకు $17^0$ సెంటిగ్రేడు నుండి $28^0$ సెంటిగ్రేడు వరకూ రమారమి ఉష్ణోగ్రత ఉంటుంది. చిత్తూరు జిల్లా మదనపల్లె, వాయల్పాడు, పుంగనూరు, పలమనేరు ప్రాంతాల్లో వేసవి ఉష్ణోగ్రతలు కొంత తక్కువ. సీమలో సెప్టెంబరు నెలలో ఉత్తర తూర్పు పవనాల ప్రభావం వలన గాలి చల్లబడుతుంది. అక్టోబర్ తర్వాత వాతావరణం పొడిగానూ, ఆహ్లాదకరంగానూ ఉంటుంది.

#### 1.1.4 వర్షపాతం

సెప్టెంబరు నుంచి నవంబరు వరకు రాయలసీమ ప్రాంతంలో వర్షాకాలం. నైఋతి ఋతుపవనాలు, ఈశాన్య ఋతుపవనాల వల్ల వర్షాలు కురుస్తాయి. నిరంతరం మార్పులతో కూడిన వర్షపాతం ఇక్కడ కురుస్తుంది. 60 సెంటీమీటర్ల కంటే తక్కువ వర్షపాతం చాలా ప్రాంతాల్లో నమోదవుతూ ఉంటుంది. అనంతపురం జిల్లా భౌగోళిక ఉనికి దురదృష్టవశాత్తూ ద్వీపకల్పం యొక్క మధ్యభాగం నందు ఉండడం వల్ల, తూర్పు, పశ్చిమ కనుమల వద్ద పీఠభూమి ఉండుట వల్ల అత్యల్ప వర్షపాతం ఈ జిల్లాలో నమోదవుతోంది. జిల్లా సాధారణ వర్షపాతం 552.0 మి.మీ. ఇది రాష్ట్రంలో అన్ని జిల్లాలకంటే అత్యల్ప వర్షపాతం. వర్షాలు రాకపోవడం వలన తరచూ అనంతపురం జిల్లా కరువు కాటకాలతో సతమతమవుతోంది.

### 1.2 చారిత్రక నేపథ్యం

రాయలసీమను మౌర్యులు, పల్లవులు, శాతవాహనులు, చాళుక్యులు, విజయనగర రాజులు పరిపాలించారు. క్రీ.శ. 1136-1650 వరకు అధికారంలో ఉన్న విజయనగర సామ్రాజ్యంలో రాయలసీమ రతనాలసీమగా, రాయలేలిన రత్న గర్భగా కీర్తించబడింది. చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలు రాయలసీమలోని జిల్లాలు. రాయలసీమ జిల్లాలకు "దత్తమండలాలు", "సీడెడ్ జిల్లాలు" అని పేర్లు కూడా ఉన్నాయి. రాయలసీమ అనే మాటను మొట్టమొదట ప్రయోగించిన కావ్యం రాయవాచకం (క్రీ.శ. 1590-1602). ఇందులో "రాయలవారిశీమ" అనే ప్రయోగం ఉంది. 16, 17 శతాబ్దాలలో నడిమింటి

వేంకటపతి రచించిన "అభిషిక్త రాఘవము" అనే ప్రబంధంలో మట్లి అనంతరాజు పౌరుష వర్ణనా సందర్భంలో ఈ "రాయలసీమ" అనే ప్రయోగం ఉంది.

*"గాయకుల శ్వరాయ బలభానుల మట్ల అనంత / రాజ కాక్షేయక ధారద్రెవ్విరని చెప్పెదరింతయ / కాక వేలుపున్ 'రాయలసీమ'లోన చతురంగ / బలంబుల తోడ వైరము లేపాయక యున్న / వారు సరిపాళెము వైచినమట్ల జస్రమున్"*

క్రీ.శ. 5, 8 శతాబ్దాల మధ్య కడప, కర్నూలు జిల్లాలను పాలించిన రేనాటి చోళులు తమ శాసనాలలో ప్రాచీన తెలుగును ఉపయోగించి ఉన్నారు. రాయలసీమలోని కడప, కమలాపురం తాలూకా కళమళ్ల గ్రామంలో మొట్టమొదటి తెలుగుశాసనం (క్రీ.శ. 575-600) లభించడం విశేషం. ఈ కళమళ్ల శాసనం వేయించిన వారు చోళ మహారాజైన ధనంజయుడు[3].

చిత్తూరు జిల్లా రేణిగుంట సమీపంలో రాళ్లకాల్వ వద్ద జరిగిన త్రవ్వకాలు, కడప జిల్లా ఎర్రగుంట్లలోని పాండవగుళ్లు, రాయచోటి సమీపంలోని సరస్వతిపల్లెలో జరిగిన త్రవ్వకాలు, కర్నూలు జిల్లా 'బిల్లా సర్గం గుహలు' లాంటివి ప్రాచీన మానవుని ఉనికికి సంబంధించిన అనేక ఆధారాల్ని చూపించినట్లు ప్రముఖ చరిత్రకారుడు - ఆచార్య హెచ్.డి.సంకాలియా తెలియజేశారు[4].

రాయలసీమ ప్రాంతం 1565 తల్లికోట యుద్ధం తర్వాత 1677-1678 వరకు శివాజీ పాలనలో ఉండేది. తర్వాత నిజాం పాలనలోను, ఆపైన మైసూర్ రాజ్యంలో హైదరాలీ పాలనలో ఉండేది. 1792 ఒప్పందంతో నిజాం ఆధీనంలోకి వచ్చింది. ఆ తర్వాత క్రీ.శ. 1792-99 సంవత్సరాల మధ్య టిప్పుసుల్తానుకు తూర్పు ఇండియా కంపెనీ సైన్యానికి మధ్య జరిగిన యుద్ధంలో టిప్పుసుల్తాన్ ఓడిపోయాడు. ఆ తర్వాత టిప్పుసుల్తాన్ పాలన కింద ఉన్న నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు మొదలైన ప్రాంతాల్ని నిజాం నవాబు

పరిపాలించేవాడు. ఈ ప్రాంతాల్ని నిజాం సీడెడ్ జిల్లాలను తూర్పు ఇండియా వారికి (బ్రిటీష్ వారికి) అప్పజెప్పాడు. ఫలితంగా దత్తమండలాలు లేదా సీడెడ్ జిల్లాలుగా వ్యవహరింపబడుతున్న ఈ ప్రాంతాలు బ్రిటీష్ వారి ఆధీనంలోకి వెళ్లాయి.

18వ శతాబ్దంలో పాలెగాళ్ల అరాచక పాలనలో రాయలసీమ ప్రజలు చితికిపోయారు. భద్రత కరువై సాంఘిక జీవితం అల్లకల్లోలమైంది. తూర్పు ఇండియా పరిపాలనలో రాయలసీమ నిత్య కరువు కాటకాలకు నిలయంగా మారిపోయింది. రాయలసీమ ప్రాంతంలోని కరువులు రైతాంగానికి జీవన్మరణ సమస్యగా తయారయ్యాయి. జాతీయోద్యమం దేశమంతటా వ్యాపించింది. ఆంధ్రదేశంలో కూడా జాతీయోద్యమం రగులుకొంటున్న రోజులవి. తెలుగువారు ప్రత్యేక రాష్ట్రం కోసం ఉద్యమించడం కూడా ప్రారంభించారు. తెలుగు ప్రజలకు "దత్త" అనే మాటపై ఏవగింపు కలిగింది. దత్త అనే పేరు బానిసత్వానికి మారుగా ఉపయోగిస్తున్నట్లు అనిపిస్తుండేది. ఈ సమయంలోనే చిలుకూరి నారాయణరావు ఉద్యోగం కోసం రాజమహేంద్రవరం నుంచి అనంతపురం వచ్చారు. అప్పటికే 'దత్త' అనే మాటపై ఉన్న వెగటును విని అర్థం చేసుకున్నారు. సీమ ఘనతను మంజరీ ద్విపదలో పొగిడారు.

*"దత్తనందురు నన్ను దత్తనెట్లగుదు / రిత్త సమాటల చేత చిత్తము కలిగే / .... .... .... .... / యమర జేసెనటన్న మట్లన్నదిది"*

**1.2.1 ఆధునిక చరిత్రలో 'రాయలసీమ'**

దత్త మండల ప్రజలు తమ హక్కులు, అవసరాల కోసం, సంఘటితమై రాయలసీమ అభివృద్ధిని గూర్చి ఆలోచిస్తున్న రోజులవి. అలాంటి సమయంలో క్రీ.శ. 1928 నవంబరు 18వ తేదీన కడప కోటిరెడ్డి అధ్యక్షతన ప్రథమ దత్తమండల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో దత్తమండలానికి ఏ పేరు పెడితే బాగుంటుంది అనే చర్చ జరిగింది. దత్త

మండలాలు అన్న పేరు రాయలసీమ వాసులకు ఏవగింపుగానే ఉంటూ వచ్చింది. కానీ దానికి ప్రత్యామ్నాయాన్ని ఎవరూ ప్రతిపాదించలేదు. మొట్టమొదటి సారిగా ఆ పనిచేసినవారు చిలుకూరి నారాయణరావుగారు. 1928, నవంబరు 17, 18 తేదీలలో నంద్యాలలో ఆంధ్రమహాసభ జరిగింది. రెండవరోజు కడప కోటిరెడ్డి అధ్యక్షతన మొదటి దత్తమండల ప్రతినిధుల సమావేశం జరిగింది. అందులో దత్తమండలాలు అన్న పేరుకు ప్రత్యామ్నాయం ఏమిటన్న చర్చ వచ్చింది. చిలుకూరి నారాయణరావుగారు "రాయలసీమ" అన్న పేరును సూచించారు. అది వెంటనే ఆమోదాన్ని పొందింది. "వదురుబోతు" పత్రిక సంపాదకుడు పప్పూరి రామాచార్యులుగారు తీర్మానాన్ని ప్రతిపాదించారు. సభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

గుత్తికేశవ పిళ్ళై, కడప కోటిరెడ్డి, పప్పూరి రామాచార్యులు, కల్లూరి సుబ్బారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, టి.ఎన్.రామకృష్ణారెడ్డి మొదలైన మొదటితరం రాయలసీమ నాయకులూ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, గడియారం వేంకటశేషశాస్త్రి, పుట్టపర్తి నారాయణాచార్యులు, విద్వాన్ విశ్వం, తిరుమల రామచంద్ర వంటి కవులూ, విద్వాంసులూ "రాయలసీమ" అన్న పేరుకు విస్తృతమైన ప్రచారాన్ని తెచ్చిపెట్టారు. గతంలో హిరణ్యక రాష్ట్రం, ములికినాడు, రేనాడు మొదలైన అనేక పేర్లు కలిగిన ఈ ప్రాంతం ఆధునిక చరిత్రలో "రాయలసీమ"గా స్థిరపడింది[5].

03.01.1946లో చిలుకూరివారు "మన రాయలసీమ భాషా సంపద" అనే అంశం మీద రేడియో ప్రసంగం చేస్తూ "రాయలసీమ" పేరు పెట్టినందుకు గర్విస్తున్నట్లుగా చెప్పుకున్నారు. అలాగే టేకుమళ్ల కామేశ్వరరావు "నా వాఙ్మయమిత్రులు" అనే గ్రంథంలోను 1948 నాటి "మహోదయ" వారపత్రికలోనూ "రాయలసీమ" పేరును చిలుకూరి వారే పెట్టినట్లు తెలుస్తుంది అని అన్నారు. చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం అనే నాలుగు జిల్లాలను కలిపి రాయలసీమ అని పిలుస్తున్నాం.

### 1.2.2 రాయలసీమ - జిల్లాల ఏర్పాటు

రాయలసీమలో మొత్తం నాలుగు జిల్లాలున్నాయి. అవి వేర్వేరు కాలాలలో విభిన్న అంశాల నేపథ్యంలో ఏర్పాటు చేయబడ్డాయి. వాటి వివరాలు పరిశీలిద్దాం.

#### 1.2.2.1 చిత్తూరు జిల్లా

ఆంధ్రరాష్ట్రం ఆవిర్భవించకముందు తమిళదేశంలో ఒక చిన్న ఊరు ఉండేది. దీనిని తమిళ భాషలో 'చిట్ర ఊర్' అని పిలుస్తుండేవారు. 'చిట్ర' అంటే 'చిన్నదైన', 'ఊర్' అంటే 'గ్రామ'మని అర్థం. వాడుకలో ఆ నోట ఈ నోట నలగి 'చిట్ర ఊర్', 'చిట్టూర్'గాను, తర్వాత మరికొంత కాలానికి ఇది 'చిత్తూరు'గాను రూపాంతరం చెందింది. చిత్తూరు జిల్లాకు ఉత్తర భాగాన కడప జిల్లా, దక్షిణాన తమిళనాడుకు చెందిన ఉత్తర ఆర్కాడు, ధర్మపురి జిల్లాలు, తూర్పున నెల్లూరు జిల్లా, పడమరలో అనంతపురం జిల్లా, కర్నాటకలోని కోలార్ జిల్లాలు ఉన్నాయి.

ఉత్తర ఆర్కాట్, కడప జిల్లాలోని భూభాగాలను కలిపి ఏర్పరిచిన ఈ చిత్తూరు జిల్లాను 1911 ఏప్రిల్‌లో చిత్తూరు ముఖ్యకేంద్రంగా ఆవిష్కరించారు. నాటి జిల్లాకు చిత్తూరు, పలమనేరు, చంద్రగిరి తాలూకాలు ఉత్తర ఆర్కాట్ జిల్లాకు సంబంధించినవి. మదనపల్లి, వాయల్పాడు కడప జిల్లాకు సంబంధించినవి. జమీందారీ రూపంలో ఈ జిల్లాకు చేర్చినవి పుంగనూర్, కాళహస్తి, పుత్తూరు, పాల కార్వేటినగర్ ఎస్టేట్, అటు తర్వాత 1928లో ఉత్తర ఆర్కాట్‌లోని కన్‌గుండి తాలూకాలో 22 గ్రామాలు మినహాయించి మిగతా భాగమంతా చిత్తూరు జిల్లాలోని పలమనేరు తాలూకాకు కలిపారు. ఆనాటి మైసూరుకు చెందిన మరో 8 గ్రామాలు ఈ జిల్లాలో 'ఎన్‌క్లేవ్స్' అయి ఉన్న కారణం చేత వాటిని 1950 చట్టం కింద చిత్తూరు జిల్లాకు బదిలీ చేశారు. 1960లో పటాస్కర్ అవార్డును అనుసరించి ఈ జిల్లాలోని తిరుత్తణి తాలూకాలోని అధిక భూభాగం, 282 గ్రామాలు, తిరుత్తణి నగరంతో సహా

తమిళనాడులోని చెంగల్‌పట్ జిల్లాకు కలిపారు. తమిళనాడులోని తిరువళ్ళూరు తాలూకాకు చెందిన 76 గ్రామాలు, పొన్నేరి తాలూకాకు చెందిన 72 గ్రామాలు ఈ చిత్తూరు జిల్లాకు కలిపారు. 1951 జనాభా లెక్కల ప్రకారం ఈ జిల్లా విస్తీర్ణం 15255 చదరపు కి.మీ. 1961 నాటికి ఇది 5189 చ.కి.మీ.కు తగ్గిపోయింది. ప్రజలు నివసించే గ్రామాలు 1485. జిల్లాలో మూడు రెవెన్యూ డివిజన్‌లూ, 15 తాలూకాలు, 20 సమితులు ఉన్నాయి. 1985 మే మాసంలో తాలూకాలు రద్దు చేసి రాష్ట్ర ప్రభుత్వం 66 రెవెన్యూ మండలాలుగా ఏర్పరచింది.

ఈ జిల్లాలో ఆసక్తిదాయకమైన ప్రదేశాలు కొన్ని ఉన్నాయి. చిత్తూరుకు 56 కి.మీ. దూరంలో తిరుపతికి 11 కి.మీ. దూరంలో రెంటికీ నడుమ చంద్రగిరి తాలూకా ముఖ్యకేంద్రం ఉంది. కాట్పాడి, రేణిగుంట రైల్వేలైను మీద ఈ చంద్రగిరి నగరం రైల్వే స్టేషను ఉంది. నగరానికి దక్షిణాన స్వర్ణముఖి నది ప్రవహిస్తున్నది. చంద్రగిరిలోని కోట, రాజప్రసాదాలు లాంటివి ప్రజల సందర్శనా ప్రాంతాలు. క్రీ.శ. 1640లో ఇక్కడి రాజమహల్‌లోనే చంద్రగిరి రాజు ఆంగ్లేయులకు మద్రాసు సముద్ర తీరాన ఉన్న కొంత భూభాగం ఇచ్చాడు. క్రీ.శ. 1000 సంవత్సరం నాటికి ఇమ్మడి నరసింహ యాదవరాయ అనే రాజు ఈ ప్రాంతంలో ఒక చిన్న కోట కట్టాడు. ఆ తర్వాత విజయనగర రాజులు ఈ కోటను విస్తరించారు. ఆంగ్లేయులు దీనినే మరింత పెద్దదిగా పునర్నిర్మించుకున్నారు. కిందివైపు రాతితోనూ, పైవైపు ఇటుకతోనూ నిర్మించిన రెండు రాజమహలులు ఈనాటికీ అక్కడ కనిపిస్తూ ఉంటాయి.

తిరుపతికి ఐదు కిలోమీటర్ల దూరంలో స్వర్ణముఖి నది, ఉత్తర తీరాన తిరుచానూరు ఉంది. శుకమహర్షి ఈ నది ఒడ్డునే తపస్సు చేశాడని స్థలపురాణంలో చెపుతారు. ఈ వూళ్ళోనే అలిమేలు మంగ లేక పద్మావతి దేవాలయం ఉంది. చిత్తూరు నుండి 67 కి.మీ. దూరంలో మొత్తం భారతదేశంలో ప్రసిద్ధికెక్కిన తిరుపతి పుణ్యక్షేత్రం ఉన్నది. ఇక్కడ అనేక ఆలయాలు, పవిత్ర స్థలాలు ఉన్నాయి. ద్రావిడ శిల్పకళా నైపుణ్యానికి ఈ దేవాలయాలు ప్రతీకలు.

**1.2.2.2 కడప జిల్లా**

కడప జిల్లా రాయలసీమకు నడిబొడ్డున వెలసిన జిల్లా. కడప జిల్లాకు తూర్పు వైపు నెల్లూరు జిల్లా, దక్షిణం వైపు చిత్తూరు జిల్లా, పడమటి వైపు అనంతపురం జిల్లా, ఉత్తరం వైపు కర్నూలు జిల్లా ఉంది. కడప జిల్లా మొత్తం వైశాల్యం 15,359 చదరపు కిలోమీటర్లు.

కలియుగ ప్రారంభంలో కృపాచార్యులు ఈ ప్రాంతాన్ని సందర్శించడం వల్ల 'కృపనగరం'గా, 'కృపావతి' మండలంగా పిలవబడింది. క్రీ.శ. 640లో చైనా దేశపు బౌద్ధ యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ కడప ప్రాంతాన్ని 'చులియా' (చోళుల భూమి)గా పేర్కొన్నారు. విజయనగర సామ్రాజ్యానంతరం గోల్కొండ సుల్తాన్ కుతుబ్ షా సైనికాధికారి పేరు మీద 'నెఖ్‌నామాబాద్'గా కడప పిలువబడింది[6]. టోలరిమ తన గ్రంథంలో 'కరిగే', 'కరిపూ' అని పేర్కొన్నాడు. కానీ ఎక్కువమంది 'ద్వారం' అనే అర్థం ఉన్న కడపే ఈ కడపకు మూలం అని చెబుతారు. ఈ జిల్లా ఏర్పడిన కొత్తలో ఉత్తరాన కృష్ణా నుండి దక్షిణాన కౌండిన్న వరకు విస్తరించి ఉండేది. 1792లో శ్రీరంగపట్నం సంధి జరిగింది. అప్పటి నుండే దాని పాలనా చరిత్ర ప్రారంభమయ్యింది. దీనిని పరిపాలించడానికి మన్రోను కలెక్టర్‌గా నియమించారు. ఈతని క్రింద నలుగురు సబ్‌కలెక్టర్లు ఉండేవారు. అప్పుడు కడప జిల్లాలో 17 తాలూకాలు ఉండేవి. ఈ తాలూకాలను విభజించి వాటి పరిపాలన సబ్‌కలెక్టర్లకు అప్పగించి, మరికొన్ని తాలూకాల పరిపాలనా విషయాలను మన్రో చూసుకునేవాడు.

19వ శతాబ్దపు మధ్యభాగంలో ఈ జిల్లాలో జమ్మలమడుగు, దువ్వూరు, కోయిలకుంట్ల, చిట్వేల్, సిద్ధవటం, చెన్నూరు, కమలాపురం, గుర్రంకొండ, మదనపల్లి, పులివెందుల, రాయచోటి, కంబం, దూపాడు, బద్వేల్ తాలూకాలు ఉండేవి. అప్పటి జనాభా 1951021. రెవెన్యూ ఆదాయం రూ. 25 లక్షలు ఉండేవి. ఈ జిల్లాకు అనుబంధంగా ఉన్న పుంగనూరు జమిందారీని 1856లో దీనిని ఆనుకుని ఉన్న ఉత్తర ఆర్కాట్ జిల్లాకు బదిలీ చేశారు. అదే

సంవత్సరంలో జిల్లాలోకెల్లా పెద్దదైన పులివెందుల తాలూకాను పులివెందుల, కదిరి తాలూకాలుగా విభజించారు. సరిహద్దుల్లో జరుగుతున్న దొంగతనాల వలన ఈ విభజన చేయవలసి వచ్చింది.

1858లో కంబం, కోయిలకుంట్ల తాలూకాలను మరికొన్ని ఇతర ప్రాంతాలను కలిపి కర్నూలు జిల్లా ఏర్పరచినారు. 1860లో చెన్నూరు, కమలాపురం తాలూకాలను విలీనం చేసి కడప తాలూకాగా పేరు పెట్టారు. 1861లో దాపూడు తాలూకా పేరు మార్కాపూరుగాను, దువ్వూరు తాలూకాను ప్రొద్దుటూరుగా మార్చారు. జిల్లాలో కొన్ని రకాల నేరాలు పెచ్చు పెరిగిపోయాయి. అందుచేత స్థానిక అధికారులు, మద్రాసు ప్రభుత్వము భారత స్టేట్ సెక్రటరీ కలిసి ఈ జిల్లాతో పాటు మరికొన్ని జిల్లాలను పునర్వ్యవస్థీకరించడానికి నిర్ణయించారు. 1910 అక్టోబర్ 1వ తేదీన కదిరి తాలూకాను అనంతపురం జిల్లాకు బదిలీ చేశారు. 1911 ఏప్రిల్ 1వ తేదీన మదనపల్లి, వాయల్పాడు తాలూకాలను కూడా కడప నుండి విడదీసి చిత్తూరు జిల్లాకు కలిపారు.

#### 1.2.2.3 అనంతపురం జిల్లా

అనంతపురం గ్రామాన్ని చిక్కప్ప ఒడయర్ కట్టించినట్లు ఆధారాలున్నాయి. ఇతడు విజయనగర రాజయిన మొదటి బుక్కరాయలకు (క్రీ.శ. 1344-1377) మంత్రి. చిక్కప్ప ఒడయర్ ఒక పెద్ద చెరువు తవ్వించి దానికి రెండు వైపుల నుండి నీరు పోవడానికి రెండు కత్వాలను, వాటికి అనుబంధంగా రెండు గ్రామాలను కట్టించాడు. అందొక గ్రామానికి రాజు పేరు బుక్కరాయ సముద్రమని, రెండవ దానికి రాణి అయిన అనంతమ్మ పేర 'అనంత సాగర'మని పేరు పెట్టాడు. ఆ పేరే అనంతపురంగా మారిందని ఒక ఐతిహ్యం (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం - ద్వితీయ సంపుటం, పేజి. 5). అనంతపురం జిల్లా మొత్తం వైశాల్యం 19,130 చదరపు కిలోమీటర్లు.

1881-82 సంవత్సరాలు అనంతపురం జిల్లా చరిత్రలో ముఖ్యమైనవి. ఈ సంవత్సరాలలో బళ్ళారి జిల్లాను రెండుగా విభజించి ఒకదానిని అనంతపురం జిల్లాగా ఏర్పరిచారు. 1983 డిసెంబరులో ఇదే జిల్లాలోని రాయదుర్గం తాలూకాలోని కొన్ని ప్రాంతాలను, బళ్ళారి జిల్లాలోని రాయదుర్గం తాలూకాలోని మరికొంత ప్రాంతాన్ని కలిపి కళ్యాణదుర్గం తాలూకాగా నిర్ణయించారు. 1895లో మరలా 21 గ్రామాలను రాయదుర్గం తాలూకా నుండి కళ్యాణదుర్గం తాలూకాకి మార్చారు. 'మేయర్' అనే బ్రిటీష్ అధికారి సిఫార్సు మేరకు 1910వ సంవత్సరంలో కడప జిల్లాలోని కదిరి తాలూకా మొత్తాన్ని అనంతపురం జిల్లాకు మార్చారు. 1950వ సంవత్సరంలో ప్రవేశపెట్టబడిన 'ప్రావిన్సెస్ అండ్ స్టేట్ ఆర్డర్' అనే చట్టం మేరకు 'మడకశిర' తాలూకాలోని కనజానహల్లి, సారియమ్మనహల్లి, కోటగార్లహల్లి గ్రామాలను; హిందూపూరు తాలూకాలోని సంతకుంటపల్లె గ్రామాన్ని కర్ణాటకకు బదిలీ చేయడం జరిగింది. 1953 అక్టోబర్‌లో ప్రవేశపెట్టిన 'ఆంధ్రప్రదేశ్ స్టేట్ యాక్ట్' మేరకు రాయదుర్గం తాలూకాను బళ్ళారి నుంచి ఈ జిల్లాలో చేర్చడం జరిగింది.

#### 1.2.2.4 కర్నూలు జిల్లా

ఇక్ష్వాక రాజులలో మొదటి వాడైన బాహుబల శాంతముని కాలంలో మహాతల వరస్కందనాగుడు దీన్ని నిర్మించాడని, కాబట్టి ఈ పట్టణానికి 'స్కందనప్రోలు' అనే పేరు ఏర్పడిందని చెప్తారు. కాలక్రమేణా 'స్కందనప్రోలు', 'కందనప్రోలు'గా మారి, 'కందనపోలు' తరువాత, 'కర్నూలు'గా మారిందని అని ఒక వాదన. 'స్కందన' సంస్కృత శబ్దం 'కందన'గా మారి ఉండవచ్చు అని చరిత్రకారుల భావన. ఒక జాగీరుగా చలామణి అయిన కర్నూలు క్రీ.శ. 1800వ సంవత్సరంలో బ్రిటీష్ వాళ్ళకు దారాదత్తం అయింది. కోయిలకుంట్ల, చెన్నంపల్లె, నోస్సం తాలూకాలలో 21 ఇతర ప్రాంతాలను కలిపి 1807లో ప్రధాన కలెక్టరు విభాగంగా ఏర్పాటు చేశారు. చాగలమఱ్ఱి, సిరివేలు, నంద్యాల, పాణ్యాం, నందికొట్కూరు, ఆత్మకూరు, ద్రోణాచలం, గూడూరు తాలూకాలలో 1860-61ల మధ్యకాలంలో విస్తృతమైన మార్పులు

చేర్పులు చేశారు. చివరకు పత్తికొండ, నంద్యాల, కోయిలకుంట్ల, సిరివేల్, కంబం, దూపాడు, రామల్లకోట, నందికొట్కూరు అనే ఎనిమిది తాలూకాలను ఏర్పాటు చేశారు. కొన్ని తాలూకాలకు పేర్లు మార్చి, పునర్నిర్ణయం చేశారు. అప్పటి నుండి ఫిబ్రవరి 1948 వరకు ఏ మార్పులు జరగలేదు. ఆ సంవత్సరంలో బనగానపల్లి అనే చిన్న రాజ్యాన్ని ఈ జిల్లాలో కలిపారు. దానిని ఒక స్వాతంత్ర్య తాలూకాగా పరిగణించారు. 1970 ఫిబ్రవరి ప్రకాశం జిల్లా ఏర్పడినప్పుడు ఈ జిల్లాలోని గిద్దలూరు, మార్కాపూరు తాలూకాలను దానిలో చేర్చారు. 1961 లెక్కల ప్రకారం 24,008 చ.కి.మీ.ల విస్తీర్ణం కలిగిన ఈ జిల్లా 1971లో 18,799 చ.కి.మీ.ల విస్తీర్ణాన్ని మాత్రమే కలిగి ఉంది.

## జ్ఞాపికలు


1. మద్దిలేటి - సీమ జనం, సీమ జీవనం - వ్యాసం - వార్త, ఆదివారం అనుబంధం, 4, ఫిబ్రవరి, 2007, పేజి. 15.
2. బ్రహ్మానందరెడ్డి, సి - చిత్తూరు జిల్లా భజన పాటలు - సమగ్ర పరిశీలన (సిద్ధాంత వ్యాసం), శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, డిసెంబర్, 2002 - పేజి. 4.
3. గంగాధర్, వేంపల్లి - తొలి తెలుగు శాసనాలు - వ్యాసం - ఆదివారం ఆంధ్రజ్యోతి, 16, నవంబర్, 2008. పేజి. 4.
4. భూమన్ - రాయలసీమ ముఖచిత్రం - వ్యాస సంపుటి - పేజి.
5. వెంకటసుబ్బయ్య, వల్లంపాటి - రాయలసీమలో ఆధునిక సాహిత్యం - సామాజిక సాంస్కృతిక విశ్లేషణ - పేజి. 14.
6. గంగాధర్, వేంపల్లి - మట్టిపొరల మధ్య మహాచరిత్ర వ్యాసం - ఈవారం పత్రిక, 2008.




— డా॥ వేంపల్లి గంగాధర్

# అనంతపురం చరిత్ర

## (1750-1810)

సేకరణ : **కల్నల్ కాలిన్ మెకంజీ**

ప్రచురణ : **సి.పి. బ్రౌన్**

1853 సం॥ నాటి

తెలుగు ముద్రణ ప్రతి

సంపాదకుడు

డా॥ వేంపల్లి గంగాధర్

**గాయత్రి ప్రచురణలు**

అనంతపురం

సంపాదకీయం

# పీర్లకట్ట దాటుకొని నాగుల చెరువుకు పొయే దారి మధ్యలో వేసిన డేరా...

1

*గతం వర్తమానాలకు మధ్య నిరంతరం సాగే సంభాషణ 'చరిత్ర'. ఇది నిరంతరం మార్పులకు గురైన సంఘజీవనాన్ని ప్రతిబింబిస్తుంది.*

*- ప్రఖ్యాత చరిత్రకారుడు ఇ. హెచ్. కార్.*

2

భిన్న కాలాల్లో, భిన్న ప్రాంతాల్లో అభివృద్ధి చెందిన సామాజిక, సాంస్కృతిక అంశాల వల్ల ఆయా కాలాలకు, ప్రాంతాలకు ప్రత్యేకమైన సాంకేతిక, ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధి లక్షణాలవల్ల నాగరికత రూపొందుతుంది. స్థూలంగా చెప్పాలంటే నాగరికత అంటే భౌతిక, మానసిక జీవితాల అభివృద్ధి క్రమం. అనంతపురం కు ఒక ప్రత్యేకమైన సామాజిక, సాంస్కృతిక చరిత్ర ఉంది. ఇక్కడ ప్రవహించే ప్రతి నదికీ పాడుకోడానికి ఒక పాట ఉంది. ప్రతి కొండకూ వినిపించేందుకు ఒక కథ ఉంది. ఇక్కడి గ్రామీణ జీవితంలో ఎన్నెన్నో వైరుధ్యాలు దర్శనమిస్తాయి. చారిత్రకంగా అనేక ప్రత్యేకతలున్నాయి. జానపద కళారూపాల విలక్షణత ఇక్కడ కన్పిస్తుంది.

3

క్రీ.పూ. 3వ శతాబ్దంలో మౌర్య సామ్రాజ్యంలో ఈ ప్రాంతం అంతర్లీనంగా ఉందని గుత్తికి సమీపంలోని 'ఎర్రగుడి' దగ్గర లభించిన అశోకుని శిలాశాసనాన్ని అనుసరించి చెప్పవచ్చు. అనంతరం శాతవాహనులు, పల్లవుల పరిపాలనలో కూడా ఈ భూభాగం ఉందని చారిత్రక ఆధారాలు తెలియ చేస్తున్నాయి. పల్లవులకు వారి సామంతులైన కాదంబులకు మధ్య ఎడతెగని వైరం ఉండేదని, ఈ నేపథ్యంలో కాదంబులను అణగద్రొక్కడానికి పశ్చిమ గాంగులను పల్లవరాజులే తమ స్వస్థలమైన 'కొంగు' నుండి తీసుకొచ్చారని చరిత్ర చెబుతోంది. ప్రస్తుత హిందూపురం, పెనుకొండలను పశ్చిగాంగుల ఆధీనంలో ఉంచినట్లు ఆధారాలున్నాయి.

క్రీ.పూ. 6వ శతాబ్దంలో బాదామీ చాళుక్యులు పశ్చిమ గాంగులను ఓడించి ఈ ప్రాంతాన్ని ఆక్రమించారు. పులకేశి-II, విక్రమాదిత్య-I, విజయాదిత్య, విక్రమాదిత్య-II మొదలగు రాజుల ఈ ప్రాంతాన్ని ఏలినట్లు గుత్తి సమీపంలోని పెద్దవడుగూరు, దిమ్మగుడి, నీలూరు మరియు తాడిపత్రి సమీపంలోని వీరారెడ్డిపల్లె, కోటపల్లి, కొట్టూరు, పెద్దపేట వద్ద లభించిన శిలాశాసనాలు తెలుపుతున్నాయి. బాదామీ చాళుక్యులు పాలించినప్పటికీ వారి సామంతులైన బాణవంశీకులు ఇక్కడ ప్రభుత్వాన్ని నిర్వహించారు. హిందూపురం సమీప 'పరిగి' వారి రాజధాని. నేటి పరిగి మండల కేంద్రాన్ని ఆనాడు పరివిపురమని వ్యవహరించేవారు. బాణవంశీయులు గుత్తి ప్రాంతాన్ని కూడా పాలించినట్లు తెలుస్తోంది.

బాదామీ చాళుక్యుల రాజ్యం అస్తమించిన తర్వాత ఈ ప్రాంతం అంతా తిరిగి పశ్చిమ గాంగుల వశమైంది. తొలుత పశ్చిమ గాంగులకు సామంతులుగా నున్న 'నోలంబులు' అను రాజవంశీకులు పాలించి క్రమంగా స్వతంత్రులై రాయదుర్గం, కళ్యాణదుర్గం, మడకశిర మరియు హిందూపురం ప్రాంతాలను క్రీ.శ. 8వ శతాబ్దం మొదలగు దాదాపు రెండు శతాబ్దాల కాలం పరిపాలించారు.

వీరి పేరు మీద ఈ ప్రాంతాన్ని ఆనాడు 'నోలంబవాడి' అని పిలిచే వారు. ఇంతలో పశ్చిమ గాంగులు మరల విజృభించి నోలంబవాడిని జయించారు. అయితే అనతికాలంలోనే రాష్ట్రకూటులు పశ్చిమగాంగులను అణచి ఈ ప్రాంతాన్ని తమ రాజ్యంలో కలుపుకున్నారు.

రాష్ట్రకూటుల రాజ్యం అనంతరం పశ్చిమ చాళుక్యుల వశమైంది. కానీ చాళుక్యులు మరియు చోళుల మధ్య జరిగిన ఆధిపత్య పోరువల్ల ఒకసారి చాళుక్యుల అధీనంలోను మరోసారి చోళుల వశం లోను ఉండేది. కానీ సార్వభౌమాధికారం ఎవరిదైనప్పటికి ఆనాడిక్కడ పరిపాలన చేసింది మాత్రం తెలుగుచోళులు. చాళుక్యుల రాజవంశం బలంగా ఉన్నప్పుడు వారికి సామంతులుగాను అనంతరం స్వతంత్రులుగాను తెలుగు చోళులు పరిపాలన కొనసాగించారు. తెలుగు చోళులు పరిపాలన సాగించిన ప్రాంతాన్ని 'నిడుగల్లు' రాజ్యమని వ్యవహరించేవారు. ఉరవకొండ సమీపంలో ఉన్న నిడుగల్లు గ్రామం పేరుమీద రాజ్య వ్యవహారం జరిగింది. అయితే వారు హేమావతిని రాజధాని చేసుకున్నారు. హేమావతికి హేంజేరు, పెంజేరు అనే నామాంతరం కూడా ఉంది. క్రీ.శ. 11వ శతాబ్ది మొదలు 13వ శతాబ్ది అంతం వరకు తెలుగు చోళులు ఈ ప్రాంతాన్ని పరిపాలించినట్లు వారి శాసనాల సాక్ష్యాధారాల వల్ల తెలుస్తోంది.

అనంతరం దేవగిరి యాదవులు, ద్వారా సముద్రపు హూయసలలు ఎవరు బలవంతులయినపుడు వారు ఈ ప్రాంతాన్ని వశపరచుకొని పరిపాలించారు. కానీ ముస్లిం దండయాత్రల ఫలితంగా 14వ శతాబ్దం ప్రారంభంలో దేవగిరి రాజ్యం అంతరించింది. ఆ తరువాత కొంత కాలం వరకు ఈ జిల్లాలోని దక్షిణ ప్రాంతం మాత్రం హోయసలల ఆధీనంలోనే నిలిచింది.

తదనంతరం 14వ శతాబ్ది మధ్యకాలం నుండి ఈ ప్రాంతం విజయనగర సామ్రాజ్యంలో అంతర్భాగమైంది. విజయనగర రాజులు జిల్లాలోని గుత్తి, పెనుకొండ కోటలను శత్రుదుర్భేద్యాలుగా తీర్చిదిద్ది దుర్గాధీశులను నియమించారు.

'రక్కస తంగడి' యుద్ధానంతరం విజయనగర రాజులు తమ రాజధానిని క్రీ.శ. 1571లో జిల్లాలోగల పెనుకొండ దుర్గానికి మార్చారు. తరువాత క్రమంగా విజయనగర సామ్రాజ్యం బలహీనమవడంతో పెనుకొండ కోట కూడా త్యజించి చిత్తూరు జిల్లాలోని చంద్రగిరికి వెళ్ళారు. క్రీ.శ. 1652లో పెనుకొండ, గుత్తి దుర్గాలు తురుష్కుల వశమైనాయి.

తరువాత మరాఠా సర్దారు మురారిరావు గుత్తి కోటను వశపరచుకున్నాడు. అయితే ఆనాడు వ్యవస్థీకృత పరిపాలన లేకపోయింది. పాలెగాళ్ళు అనేకులు బయలుదేరి పాలకులమనే పేరు మీద కొల్లగొట్టడం ప్రారంభించారు. అనంతరం మైసూరు పాలకుడు హైదరాలి ఈ ప్రాంతాన్ని జయించి వశపరచుకున్నాడు.

హైదరాలి అనంతరం అతని కుమారుడు టిప్పుసుల్తానును ఓడించి మహారాష్ట్రులు, నైజాము, బ్రిటీషు వారు, విజిత భూమిని పంచుకున్నపుడు ఈ జిల్లాలోని నేటి తాడిపత్రి ప్రాంతం నైజాంకు లభించింది. టిప్పుసుల్తాను మరణానంతరం జరిగిన పంపకం వల్ల 1799లో కడప ప్రాంతం నైజాంకు దక్కింది. కానీ క్రీ.శ. 1800లో నైజాంకు ఇంగ్లీషు వారికి మధ్య జరిగిన ఒడంబడికను అనుసరించి దత్తమండలాలలో భాగంగా అనంతపురం జిల్లా ప్రాంతం కూడా ఆంగ్లేయులకు వశమైంది.

దత్త మండలాలు (కర్నూలు, కడప, అనంతపురం, బళ్ళారి) అన్నింటికి కలెక్టరుగా సర్ థామస్ మన్రోను బ్రిటీషు ప్రభుత్వం నియమించగా ఆనాడు అమలులో ఉన్న పాలెగాళ్ళ జులంను సర్ థామస్ మన్రో అంతరింపచేసి రైతువారీ పద్ధతిని అమలు చేసి ఘనత పొందాడు.

అనంతరం బళ్ళారి, కర్నూలు రెండు జిల్లాలుగా దత్త మండలం విభజించ బడింది. అప్పుడు అనంతపురం బళ్ళారి జిల్లాలో భాగంగా ఉండేది. 1882లో బళ్ళారి జిల్లా నుండి కొంత భాగాన్ని విడదీసి అనంతపురం జిల్లాగా ఏర్పరచారు. అలాగే కడప జిల్లా నుండి కదిరి తాలూకాను మరియు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమయంలో భాషా సాన్నిహిత్యాన్ని అనుసరించి రాయదుర్గం తాలూకాను బళ్ళారి జిల్లా నుండి విడదీసి అనంతపురం జిల్లాలో కలిపారు.

అనంతపురం గ్రామాన్ని చిక్కప్ప ఒడయర్ కట్టించినట్లు ఆధారాలున్నాయి. ఇతడు విజయనగర రాజైన మొదటి బుక్కరాయలకు (క్రీ.శ. 1344-1377) మంత్రి. చిక్కప్ప ఒడయర్ ఒక పెద్ద చెరువు తవ్వించి దానికి రెండు వైపుల నుండి నీరు పోవడానికి రెండు కాల్వలను, వాటికి అనుబంధంగా రెండు గ్రామాలను కట్టించాడు. అందొక గ్రామానికి రాజు పేరు బుక్కరాయ సముద్రమని, రెండవ దానికి రాణి అయిన అనంతమ్మ పేర 'అనంత సాగర'మని పేరు పెట్టాడు. ఆ పేరే అనంతపురంగా మారిందని ఒక ఐతిహ్యం. (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం - ద్వితీయ సంపుటం, పేజి. 5).

1983 డిసెంబరులో ఇదే జిల్లాలోని రాయదుర్గం తాలూకాలోని కొన్ని ప్రాంతాలను, బళ్ళారి జిల్లాలోని రాయదుర్గం తాలూకాలోని మరికొంత ప్రాంతాన్ని కలిపి కళ్యాణదుర్గం తాలూకా గా నిర్ణయించారు. 1895లో మళ్ళీ 21 గ్రామాలను రాయదుర్గం తాలూకా నుండి కళ్యాణదుర్గం తాలూకా లోకి మార్చారు. 'మేయర్' అనే బ్రిటీష్ అధికారి సిఫార్సు మేరకు 1910వ సంవత్సరంలో కడప జిల్లాలోని కదిరి తాలూకా మొత్తాన్ని అనంతపురం జిల్లాకు మార్చారు. 1950వ సంవత్సరంలో ప్రవేశపెట్టబడిన 'ప్రావిన్సెస్ అండ్ స్టేట్ ఆర్డర్' అనే చట్టం మేరకు 'మడకశిర' తాలూకాలోని కనజానహల్లి, సారియమ్మనహల్లి, కోటగార్లహల్లి గ్రామాలను; హిందూపూరు తాలూకాలోని సంతకుంటపల్లె గ్రామాన్ని కర్ణాటకకు బదిలీ చేయడం జరిగింది. 1953 అక్టోబర్‌లో ప్రవేశపెట్టిన 'ఆంధ్రప్రదేశ్ స్టేట్ యాక్ట్' మేరకు రాయదుర్గం తాలూకాను బళ్ళారి నుండి ఈ జిల్లాలో చేర్చడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో, అనంతపురం జిల్లా దక్షిణ - నైఋతీ దిశలలో వ్యాపించి ఉంది. జిల్లా 13-40' మరియు 15-15' ఉత్తర అక్షాంశములు, 76-50', 78-31', తూర్పు రేఖాంశముల మధ్య ఉంది. అనంతపురం జిల్లా మొత్తం వైశాల్యం 19,130 చదరపు కిలోమీటర్లు. ప్రస్తుతం అనంతపురం జిల్లాలో 1005 గ్రామాలు ఉన్నాయి. 63 రెవిన్యూ మండలాలుగా విభజించారు. జిల్లాలో సంవత్సరానికి 381 మిల్లీమీటర్ల సగటు వర్షపాతం కురుస్తుంది. రాజస్థాన్‌లోని జైసల్మీరు తర్వాత దేశంలో అత్యల్ప వర్షపాతం కలిగి వున్న జిల్లా ఇది.

జిల్లాకు తూర్పున కడప జిల్లా, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం, ఉత్తరాన కర్నూలు జిల్లా, దక్షిణాన చిత్తూరు జిల్లాలు ఎల్లలుగా ఉన్నాయి. జిల్లా దక్షిణము నుండి ఉత్తరమునకు ఏటవాలుగా ఉంటుంది. జిల్లాను మూడు సహజ భాగములుగా విభజించవచ్చును. ఉత్తరాన ఉన్న గుత్తి, గుంతకల్లు, వజ్రకరూరు, ఉరవకొండ, విడపనకల్లు, యాడికి, తాడిపత్రి, పుట్లూరు, యల్లనూరు, రాయదుర్గం, కణేకల్లు, బెళుగుప్ప మండలాలలో ప్రత్తి పండు నల్లరేగడి భూమి విశేషంగా ఉంది. మధ్యభాగాన ఉన్న కళ్యాణదుర్గం, కంబదూరు, శెట్టూరు, బ్రహ్మసముద్రం, రామగిరి, కనగానపల్లి, సి.కె. పల్లి, ధర్మవరం, బత్తలపల్లి, తాడిమర్రి, ముదిగుబ్బ, అనంతపురం, కూడేరు, ఆత్మకూరు, గార్లదిన్నె, పామిడి, పెద్దవడుగూరు మండలాలలో చెట్లు, చేమలు లేని విశాలమైన ఎర్రనేలలు ఉన్నాయి. పెనుకొండ, రొద్దం, సోమందేపల్లి, హిందూపురం, లేపాక్షి, చిలమత్తూరు, మడకశిర, రోళ్ళ, గుడిబండ, ఆగళి మండలాలు, మిగిలిన మండలాల కన్నా ఎత్తయిన పీఠభూమితో ఎర్రనేలలు కల్గి ఉన్నాయి. కర్నాటక రాష్ట్ర సరిహద్దుల్లో ఉన్న ఈ భూములు కొంత వరకూ సారవంతమైనవిగా చెప్పొచ్చు.

జిల్లాలో జీవనదులు లేవు. ఉన్న నదులన్నీ వర్షాధారితాలు. అయితే, పెన్నానది ఈ జిల్లాలో ప్రవహించే నదులలో ముఖ్యమైనది. కర్నాటక రాష్ట్రంలోని నందికొండలో పుట్టి హిందూపురం మండలం దక్షిణాన చేలూరు గ్రామం వద్ద రాష్ట్రంలో ప్రవేశించి పరిగి, రొద్దం, రామగిరి, కంబదూరు, కళ్యాణదుర్గం, బెళుగుప్ప, ఉరవకొండ, వజ్రకరూరు, పామిడి, పెద్దవడుగూరు, పెద్దపప్పూరు, తాడిపత్రి మండలాల గుండా ప్రవహించి, కోడూరు గ్రామానికి నైఋతి దిశగా 3 కి.మీ. దూరంలో కడప జిల్లాలో ప్రవేశిస్తుంది.

చిత్రావతి నది ఈ జిల్లాలో రెండవ పెద్దనది. ఇది కర్నాటకలోని కోలార్ జిల్లా లోని నందిదుర్గంకు ఉత్తరంగా ఉన్న హరిహరేశ్వర్ కొండల్లో పుట్టి చిలమత్తూరు మండలంలోని కొడికొండ గ్రామానికి రెండు కిలోమీటర్ల దూరంలో జిల్లాలోకి ప్రవేశిస్తుంది. ఈ నది గోరంట్ల, పుట్టపర్తి, బుక్కపట్నం, కొత్తచెరువు, చెన్నకొత్తపల్లి, ధర్మవరం, బత్తలపల్లి, తాడిమర్రి, ఎల్లనూరు మండలాలలో ప్రవేశించి, కడప జిల్లాలోని గండికోట వద్ద పెన్నానదీ సంగమం చేస్తుంది.

హగరి లేదా వేదవతీ నది కూడా జిల్లాలో ముఖ్యమైనవి. కర్నాటక రాష్ట్రంలో పుట్టి గుమ్మగట్ట, బ్రహ్మసముద్రం, బెళుగుప్ప, కణేకల్, డి.హీరేహాల్ మండలాలలో ప్రవహించి, కర్నాటక రాష్ట్రంలోని బళ్ళారి జిల్లాలో ప్రవేశిస్తుంది. జయమంగళనది కూడా కర్నాటక రాష్ట్రంలో పుట్టి పరిగి మండలంలో ప్రవేశించి, పెన్నానదిని, సంగమేశ్వరంపల్లి గ్రామం (పరిగి మండలం) వద్ద కలుస్తోంది. ఇవికాక, చిన్న నదులు, చిలమత్తూరు మండలంలోని కుషావతి, అగళి మండలంలోని స్వర్ణముఖి, తనకల్లు మండలంలోని పాపాఘ్ని, నల్లమాడ, కదిరి, ముదిగుబ్బ మండలాల్లోని మద్దిలేరు, కనగానిపల్లి, రాప్తాడు, అనంతపురం, బుక్కరాయ సముద్రం, శింగనమల మండలాల్లోని పండమేరు నదులు ప్రధానమైనవి.

4

దత్తమండలాల పర్యవేక్షణ కోసం మేజర్ జనరల్ కాంప్‌బెల్ కమాండర్‌గా సైనిక సహాయాన్ని కూడా బ్రిటీషు ప్రభుత్వం మన్రోకు అందజేసింది. పటిష్టమైన పాలనను అందించడానికి దత్తమండల ప్రాంతాన్ని మన్రో పునర్ వ్యవస్థీకరించాడు. మొత్తం 37 తాలూకాలుగా విభజించాడు. బళ్లారి, కడప, కొడికొండ కేంద్రాలుగా 1807లో మన్రో కలెక్టర్ కార్యాలయాన్ని ఏర్పాటు చేశాడు. తరువాత కాలంలో కొడికొండ కార్యాలయాన్ని బళ్ళారికి తరలించారు. 1828లో కంభం, దూపాడు, కోయలకుంట్ల ప్రాంతాలను కడప జిల్లా నుండి విడదీసి కర్నూలు జిల్లాగా ఏర్పాటు చేశారు. బళ్ళారి రెవెన్యూ జిల్లా అయినప్పటికీ జిల్లా కార్యాలయం అనంతపురంలోనే కొంతకాలం ఉండింది.

1840లో జిల్లా కలెక్టర్ కార్యాలయాన్ని కొంత కాలం బళ్ళారికి మార్చారు. అప్పటికి అనంతపురం, ధర్మవరం, పెనుకొండ, హిందూపురం, మడకశిర ప్రాంతాలలో 1869 వరకు కేవలం సబ్ డివిజన్‌గా ఉన్న అనంతపురం ప్రాంతాన్ని 1882లో బళ్ళారి నుండి విడదీసి అనంతపురం జిల్లాగా ఏర్పాటు చేశారు. ఆ విధంగా అనంతపురం రెవెన్యూ జిల్లాగా రూపొంది ఇప్పటికి 133 సంవత్సరాలు

పూర్తి అయ్యాయి. మన్రో భారతదేశానికి ఒక సైనికుడిగా వచ్చాడు. ఆ సైనిక కేంద్రం మద్రాసులో ఉండేది. మన్రో తన మిత్రుడు ఎర్స్కైన్‌కు రాసిన ఒక లేఖలో ఈ ప్రాంత పరిస్థితిని విశ్లేషించాడు.

దాదాపు పది సంవత్సరాలపాటు సైనికుడిగా పనిచేసిన తరువాత మన్రోను సేలంకు పంపారు. అక్కడ అలెగ్జాండర్ వద్ద పనిచేస్తున్న కాలంలో రెవెన్యూ విధానం రూపొందించడంలో థామస్ మన్రో గొప్ప నైపుణ్యాన్ని ప్రదర్శించడంతో బ్రిటీషు ప్రభుత్వం లాండ్ సెటిల్‌మెంట్ నిర్వహణకు నియమించింది.

మన్రో బ్రిటీషు అధికారి అయినప్పటికీ ప్రజల వద్ద ఎప్పుడూ దర్పం ప్రదర్శించేవారు కాదు. ఇతర అధికారుల్లాగా రైతుల నుండి, గ్రామాధికారుల నుండి కానుకులు స్వీకరించేవాడు కూడా కాదు. ఒకసారి ఒక గ్రామాధికారి మన్రోకు స్వాగతమివ్వడానికి పెద్ద పందిరి వేయించాడు. పందిరి వేసిన కూలీలకు గ్రామాధికారి డబ్బులివ్వలేదని తెలియడంతో మన్రో ఆ పందిరిలో విడిది చేయడానికి నిరాకరించాడు ఒక చెట్టు నీడన డేరా వేసుకుని అందులో బస చేశాడు. వ్యవసాయదారుడు భూమిపై యాజమాన్యాన్ని పొందడానికి వీలుగా ఆయన పలు సంస్కరణలను ప్రవేశపెట్టారు. ఆ సంస్కరణలు జయప్రదం కావాలంటే దౌర్జన్యపూరితమైన పాలెగాళ్లు వ్యవస్థను అంతమొందించాలని నిర్ణయించుకున్నాడు. అప్పట్లో అనంతపురం జిల్లాలో అనంతపురం, నడిమిదొడ్డి, రాయదుర్గం, తలమర్ల, గుత్తి, వజ్రకరూరు సమీపంలోని కమలపాడు పాలెగాళ్ళు ప్రజలపై దౌర్జన్యం జరిపేవారు. మన్రో వారికి వ్యతిరేకంగా కఠినమైన చర్యలు తీసుకున్నాడు. స్వంత సాయుధ బలగాలను పాలెగాళ్ళు ఉంచుకోవడాన్ని నిషేధించాడు. ప్రభుత్వ ఆదేశాలను ధిక్కరించ ప్రయత్నించిన పాలెగాళ్ళను అణచివేశాడు. అధికారం కోల్పోయిన పాలెగాళ్ళు కొందరు 1804లో గుత్తి, ఆదోని కోటలను స్వాధీనం చేసుకోవడానికి చేసిన కుట్రను మన్రో విఫలం చేశాడు.

మన్రో సంస్కరణలలో భూసంబంధ చట్టాల ముందు అందరూ సమానులే అని స్పష్టం చేస్తూ అందరికీ ఒకే విధమైన పన్ను విధానాన్ని ప్రవేశపెట్టడం ప్రధానమైంది. ఏ రైతైనా తనకున్న వనరులతో సాగుచేయగల భూమిని ఎంత మేరకైనా ఆక్రమించుకోవచ్చని ఒక విప్లవాత్మకమైన ప్రకటనను జారీ చేశారు.

అప్పటి వరకు గ్రామీణ ప్రాంతాలలో భూములపై అగ్రవర్ణాలకున్న పట్టును ఆ ప్రకటన ద్వారా మన్రో అధికభాగం సడలింపజేశారు. భూమి ప్రభుత్వ యాజమాన్యం కిందకు వచ్చింది. నిర్ణీత శిస్తు చెల్లింపు పద్ధతిపై భూమిని రైతుకే కౌలుకు ఇవ్వసాగారు. దత్తమండలాల ప్రిన్సిపల్ కలెక్టర్‌గా ఉన్న ఏడేళ్లకాలంలో మన్రో రెండు లక్షల ఆరు వేల ఎనిమిది వందల పంతొమ్మిది పట్టాలను రైతులకు పంపిణీ చేసినట్లు చారిత్రక ఆధారాలున్నాయి. మన్రో ప్రవేశపెట్టిన భూమిశిస్తు మదింపు విధానాన్ని కూడా ప్రధానంగా చెప్పుకోవాలి. భూమిశిస్తు విధానం ఉదారంగా ఉండాలనే ఆయన కాంక్షించాడు. భారతదేశంలో బ్రిటీషు వారి రాక పూర్వం ప్రజారంజకులైన కొందరు రాజుల కాలంలో వ్యవసాయం బాగా అభివృద్ధి చెందడానికి వారు అనుసరించిన ఉదారమైన శిస్తు విధానమే కారణమని మన్రో అభిప్రాయపడ్డాడు. చిన్న నీటిపారుదల కింద అంటే బావులు, చెరువుల క్రింద రైతులు సాగుచేసుకుంటున్న భూములపై 8.53 శాతం పన్నును అదనంగా తగ్గించారు. మన్రో 1807లో ప్రిన్సిపల్ కలెక్టర్ పదవికి రాజీనామా చేసి ఇంగ్లాండ్ వెళ్ళిపోయాడు. కానీ ఆయనను మళ్ళీ 1820లో మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నర్‌గా నియమించినప్పుడు, అంతకుముందు ఆయన ప్రతిపాదించిన భూసంస్కరణలను రైత్వారీ విధానాన్ని అమలు జరిపాడు.

మన్రో తాడిపత్రి పరిసరాల్లో ఎన్నో చెరువులు త్రవ్వించారు. అనంతపురం జిల్లాలోని దేవాలయాలు నిర్వహణకు నిధులు మంజూరు చేశారు. అంతే కాకుండా ఆయన హయాంలో నాటించిన చింత చెట్లు నేడు 'మన్రో చింత తోపులు'గా పిలువబడుతున్నాయి. గుత్తిలో ఆయన నిర్మించిన 'మన్రోసత్రం' యిప్పటికీ ఉంది. అనంతపురం పట్టణంలో ప్రస్తుతం రహదారులు భవనాల శాఖ అతిథి గృహంగా ఉన్న భవనం మన్రో కట్టించిందే. మన్రో కలరా వ్యాధితో మరణించాడు. వీరి సమాధి గుత్తికోట దిగువ భాగంలో ఉంది.

5

క్రీ.శ. 1565లో తళ్ళికోట (రాక్షస తంగడి) యుద్ధం ముగిసిన విజయనగర రాజులు ఓడిపోయినప్పుడు అనంతపురం, ఆ పరిసర ప్రాంతాలకు హండే హనుమప్పరాయుడు పాలెగారయ్యాడు. విజయనగర పాలకుడు రామరాజు

మీద యాదవపాక తిమ్మరాజు తిరగబడినప్పుడు తిమ్మరాజును అణచటంలో హనుమప్పనాయుడు రామరాజుకు తోడ్పడినాడు. తిమ్మరాజుకు సాయంగా వస్తున్న గోల్కొండ సుల్తానును కూడా ఓడించాడు. హనుమప్పనాయుడు బుక్కరాయసముద్రం గ్రామంలో స్థిరపడి 1582లో మరణించాడు. హనమప్పనాయుని కుమారుడు విమ్మడి హంపనాయుడు పాలెగారయ్యాడు (1583-1595). ఆ తర్వాత హంపనాయుని కుమారుడు మలకప్పనాయుడు పాలెగారయ్యాడు (1595-1619).

ముస్లిం సుల్తానులతో పోరాటంలో మలకప్పనాయుడు పాల్గొని సుల్తానుకు లొంగిపోయాడు. బుక్కపట్నం వరకు మలకప్పనాయుని పాలనకింద ఉండేది. అప్పటికి మలకప్పనాయుడు చెల్లించవలసిన మొత్తం 1,37,316 వరహాలు. మలకప్పనాయుడు అనంతపురం చేరకుని తన అధీనంలోని విశాలప్రాంతాన్ని తన నలుగురు కుమారులకు పంపిణీ చేశాడు. దేవప్ప నాయుడికి తాడిపత్రి, ప్రొద్దుటూరు, చిన్నరామప్పనాయుడికి బళ్ళారి, కరగోడు పరిసరప్రాంతం, లింగప్పనాయుడికి కొండెరిపి (ధర్మవరం తాలూక), కనకల్ (రాయదుర్గం తాలూకా), హంపనాయుడికి అనంతపురం, బుక్కపట్నం, ధర్మవరం ప్రాంతాలు కేటాయించబడ్డాయి.

1757లో మహారాష్ట్రులు అనంతపురం ముట్టడించారు. వారికి రూ. 50,000 ఇచ్చి సమాధానపరిచారు. ఇంత పెద్దమొత్తం సమకూర్చడం చాలా కష్టమైపోయింది. మంత్రి బసప్పను దోపిడీలకు పంపి ఈ డబ్బు సమకూర్చు కోవాలని తలపెట్టాడు. తాడిపత్రి, ఎల్లుట్ల, రొద్దం, పుట్టపర్తి పాలెగార్ల వశమయ్యాయి.

బళ్ళారి, గుత్తి 1775లో హైదరాలీ వశమయ్యాయి. అనంతపురం నుండి రూ. 40 వేల కప్పం గడువులోగా హైదరాలీకి లభించేది. క్రమేపి కప్పం బకాయిపడింది. హైదరు మనుష్యులు అనంతపురం వెళ్ళి ఆస్తిని జప్తు చేసి పాలెగారును అరెస్టు చేశారు. దాంతో పాలెగారు కుటుంబం మరుగున పడిపోయింది. పాలెగారు పెద్దకుమారులిద్దరూ హైదరు సైన్యంలో చేరారు.

మూడవ కుమారుని తమ రాజధాని అయిన శ్రీరంగపట్టణానికి పంపించివేశారు. 1788లో పాలెగారు మరణించాడు. పాలెగారు కుటుంబంలో మగవారందరినీ ఉరితీశారు. శ్రీరంగపట్టణం నుండి తప్పించుకున్న మూడవ కుమారుడు పారిపోయి కాళహస్తి రాజు శరణు కోరాడు.

1799లో టిప్పు మరణించాక మూడవ కుమారుడు అనంతపురం తిరిగి వెళ్ళి నిజాంకు లొంగిపోయాడు. మూడవ కుమారుడు లింగప్పనాయుడు కొద్దిపాటి కప్పం చెల్లించే షరతుమీద సిద్ధిరామపురం పాలెగారయ్యాడు. 1801లో లింగప్పనాయుడి మరణంతో మలకప్పనాయుని వంశం సమసిపోయింది. 1860 వరకు కూడా కొన్ని కుటుంబాలకు పింఛను లభిస్తూనే ఉండేది.

కల్నల్ మన్రో 1800లో అనంతపురంలో నివాసం ఏర్పరచుకున్నాడు. అనంతపురం చాలా సంవత్సరాలు దత్తమండలానికి ప్రధాన కార్యాలయంగా కొనసాగింది. 1822లో కాంప్‌బెల్ తన కేంద్రాన్ని బళ్ళారికి మార్చినా రాబర్ట్‌సన్ ఆ మరుసటి సంవత్సరమే తిరిగి ప్రధాన కార్యాలయాన్ని అనంతపురానికే మార్చాడు.

అనంతపురం జిల్లాలో గుత్తి, మడకశిర, పత్తికొండ, కోలుకొండ, అనంతపురం, రాయదుర్గం పాలెగార్లు చాలా ప్రధానమైనవారు. 1801 మార్చి నాటికే గుఱ్ఱంకొండ ప్రాంతానికి మన్రో శిస్తు నిర్ణయం చేయగలిగాడు. ఎవరైనా సిబ్బందిని సమకూర్చుకున్న, విధిగా సొమ్ము వసూలు చేసినా, ఆ వ్యక్తిని తిరుగుబాటుదారుగా పరిగణిస్తామని మన్రో ప్రకటన చేశాడు. దాంతో పాలెగార్లు అదుపులోకి వచ్చారు. ఉన్నపళంగా పాళెములు వశపరచుకోవటాన్ని ప్రజలు ఆమోదింపలేదు. ఈ చర్యను లండన్‌లోని డైరెక్టర్ల బోర్డు సమ్మతింపలేదు. ఎందుకు అలా వశపరచుకోవాలని గట్టిగా కారణాలడిగారు. ఇది కొనసాగితే మన్రోను రెవిన్యూ పని నుండి తొలగించవలసి వస్తుందని కూడా హెచ్చరించారు. అనంతపురం జిల్లాలో పెరుమాళ్ నాయుడు, గుఱ్ఱప్పనాయుడు వంటి పాలెగార్ల వలన పెద్దగా ప్రతిఘటన లేకపోయినా ఇతరులు వారిని అనుకరిస్తారని ప్రభుత్వం అనుమానించింది. ఇలాంటి పరిస్థితుల్లో గుఱ్ఱప్పనాయుడు గుత్తిలో

అయిదువందలమందిని సమీకరించాడు. 8 క్రోసుల దూరంలోని కొనకొండ్లమీద దాడి చేసి కొనకొండ్ల కోటను ఆక్రమించాడు. పాలెగార్ల భూస్వామ్య పద్ధతుల దృష్ట్యా, వారి దమన పద్ధతులను జాప్యం లేకుండా అణచివేస్తేనే మంచి ప్రభుత్వం ఏర్పాటయ్యే వీలుంటుందని 1805 నాటికి డైరెక్టర్లకు మన్రో స్పష్టం చేశాడు.

ఉప్పలూరు పాలెగారు మన్రో పంపిన సమన్లు తీసుకోవటానికి నిరాకరించాడు. ఎంత తాను బాకీ పడినానని లెక్కలు చూడటానికి కూడా తిరస్కరించాడు. కాంప్‌బెల్ ఉప్పలూరు పరిసరంలో శిబిరం వేసి, ఆ ప్రాంతంలోని ఆక్రమిత గ్రామాలను, సర్కారు గ్రామాలను వశపరచు కోవలసిందిగా తహసిల్దారును నిర్దేశించాడు. తహసిల్దారు తమకు విధేయుడుగా ఉంటాడని ఉప్పలూరు గ్రామాన్ని తహిసిల్దారుకిచ్చాడు. గుఱ్ఱంకొండ పాలెగార్లందరూ తమ లెక్కలు తెచ్చారు. ఉప్పలూరు పాలెగారు వెంట సదా 20 మంది సాయుధ సిబ్బంది ఉన్నారు. ఉప్పలూరు పాలెగారును రాత్రికి రాత్రి సైన్యాన్ని పంపి అరెస్టు చేసి గుత్తికోటకు పంపారు.

1869లో డివిజన్లు పునర్వ్యవస్థీకరించినప్పుడు సబ్‌కలెక్టర్ కార్యాలయం గుత్తికి మారింది. సర్ థామస్ మన్రో బళ్ళారి రోడ్డు మీద ఊరికి అరమైలు దూరంలో తన భవనం నిర్మించుకున్నాడు.

16వ శతాబ్దం ఆఖరులో రాయదుర్గం పాలెగారును తొలగించి విజయనగర సైన్యాధికారి వంశీయుడు పాలకుడయ్యాడు. ఇరుగు పొరుగు పాలెగార్లు తమ పైనున్న పాలకులు కట్నకానుకలపట్ల మాత్రమే శ్రద్ధ చూపుతూ తమవైపు నిర్లక్ష్యం చూపుతున్నారని గుర్తించారు. 1766లో హైదరుకు తోడ్పడినా టిప్పును పాలెగారు వ్యతిరేకించాడు. టిప్పు పాలెగారును ఓడించి, కోట వశపరచుకుని, పాలెగారును శ్రీరంగపట్నం పంపి అతనిని హతమార్చాడు. 1799లో ఆ పాలెగారు బంధువు రాయదుర్గం తిరిగి వచ్చాడు. నైజాం మనుషులు అతనిని ఖైదు చేసి హైదరాబాదు పంపారు. బ్రిటీష్‌వారు అక్కడి నుండి అతనిని గుత్తికోటకు పంపారు. విజయనగరం పాలనలో ఉండిన పాలెగార్లను హైదరు, టిప్పు, నైజాం, బ్రిటీష్‌వారంతా లొంగదీసే ప్రయత్నం చేసి వారిని శ్రీరంగపట్టణం, హైదరాబాదు, లేదా గుత్తికోటకే పంపించారు.

గుత్తికోటను కృష్ణదేవరాయల కాలంలో 36 సంవత్సరాలు పాలించిన బుక్కరాజు అనే అధికారి కట్టించాడు. ఆ వంశంలో ఆఖరివాడయిన తిరుమలదేవరావు 22 సంవత్సరాలు పాలించాడు. తిరుమలదేవుని కాలంలో మీర్‌జుమ్లా దండయాత్ర చేసి పన్నెండు సంవత్సరాలు ముట్టడి సాగించి గుత్తికోటను స్వాధీనపరచుకున్నాడు. కడప నవాబులు, ఆదోని నవాబులు కోటను వశపరచుకున్నా, వారి పాలనలో గుత్తి చాలా కాలం కొనసాగలేదు. ఔరంగజేబు కాలంలో 1670 ప్రాంతంలో సవనూరు పాలకుడు మీర్ అబిద్‌ఖాన్ పాలన కిందకు వచ్చిన గుత్తికోటను మరాఠీ నాయకుడు మురారీరావు తండ్రి హిందూరావు వశపరచుకుని కోటను పటిష్టపరిచాడు. గుత్తికోటను రాజధానిగా చేసుకున్నాడు. హైదరాలీ తొమ్మిది నెలలు ముట్టడి సాగించి 1776లో ఈ కోటను వశపరచుకున్నాడు. మురారీరావును శ్రీరంగపట్టణానికి ఖైదీగా పంపాడు. అక్కడ నుంచి గోపాలకోటకు పంపితే అక్కడే మరణించాడు. 1781లో టిప్పు ఆ కుటుంబాన్ని హతమార్చాడు.

1801 నుండి 1805 వరకు ఈ పోరాటాలు జరిగాయి. జమీందారీ, రైత్వారీ, గ్రామవార్, ఇనాందారీ సంస్కరణల ద్వారా వ్యవసాయిక ఉత్పత్తి సంబంధాలలో ప్రభావంతో పెట్టుబడిదారి వ్యవస్థ దేశీయ స్వయం సమృద్ధి వ్యవస్థను విచ్ఛిన్నం చేయడానికి జరిగిన ప్రయత్నాలపై ప్రజల ప్రతిఘటనకు ప్రతిరూపమే పాలెగాళ్ల పోరాటం. దీనికి చిత్తూరు పాలయగాళ్లుగా పేరుగాంచిన పదిమందిలో తొమ్మిది మంది నాయకత్వం వహించారు. విజయనగర రాజులు క్రీస్తుశకం 15వ శతాబ్దంలో గ్రామాలు, రహదారులు, అటవీ మార్గాలలో ప్రజల ధన, ప్రాణాలను కాపాడటానికి, శాంతి భద్రతలు పరిరక్షించడానికి 'కావలిగాళ్లు' అనే హోదాలో నిర్ణీత విస్తీర్ణంలో సంరక్షకులను నియమించారు. వాళ్లు జీవించడానికి నామమాత్రపు శిస్తుపై 'కావలి ఇనాం' భూములను వారి పరం చేశారు. తళ్లికోట యుద్ధం అనంతరం ఈ కావలివాళ్లు స్వతంత్రం ప్రకటించకుని 'పాలయగాళ్లు'గా మారారు. పాకాలకు శేషమనాయుడు, మొగరాలకు, పుల్లూరుకు కుమార రఘునాథనాయుడు, కల్లూరుకు రంగపతిరాజు, పుల్లిచెర్లకు తిమ్మానాయుడు, ఎదురుకొండకు మద్దురామప్ప నాయుడు, సర్గంతికి అనంతప్ప

నాయుడు, గుడిపాటికి శేషమనాయుడు, తుంబకు మల్లన్న నాయుడు, బంగారుపాళేనికి చంద్రశేఖర నాయుడు పాలయు గాళ్లుగా ఉండేవారు. స్వతంత్రం ప్రకటించుకున్నాక విజయనగర రాజులు విధించిన కావలి ఇనాంను వారు చెల్లించడం నిలిపివేశారు. ఈ నేపథ్యంలో 1801లో చిత్తూరు ఆంగ్లేయుల వశమైంది.

అప్పటి వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన నవాబులకు శిస్తు చెల్లింపులు నిలిపివేసిన పాలయగాళ్ల నుండి అప్పటి ఉత్తర ఆర్కాట్ డివిజన్‌కు కలెక్టర్‌లుగా పనిచేసిన జార్జిస్ట్రాటన్, కాక్ బర్న్‌లు వేధించి పన్ను వసూలు చేశారు. శిస్తులు ఎక్కువగా పెంచారు. దోపిడీ, పీడనలు ప్రారంభించారు. అంతేకాకుండా శతాబ్దాలుగా అనుభవిస్తున్న స్వాతంత్ర్యాన్ని రద్దు చేశారు. భూములను సైతం ఆంగ్ల పాలకులు స్వాధీనం పరచుకున్నారు. శిస్తు బాకీపడితే బంధించేవాళ్లు. అన్ని రకాల నిర్బంధాలకు తోడు పాలయగాళ్లు పాళేల్లో నిర్మించుకున్న కోటల కూల్చివేతకు పూనుకున్నారు. పాలయగాళ్లను దొంగలు, దోపిడీకారులుగా భావించి హింసించేవారు, అవమానించేవారు. ఇవన్నీ పాలయగాళ్ల తిరుగు బాటుకు దారి తీశాయి. తొలుత పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించిన పాలయగాళ్లపై ఆంగ్ల పాలకులు మరింత అణచివేతకు పూనుకోగా వారు పోరాటానికి సిద్ధపడ్డారు.

మొదట్లో తమ ప్రాంతాలలో పయనించే ఆంగ్లేయులపై యుద్ధం ప్రారంభించిన పాలయగాళ్లు వారి ఆధీనంలో ఉన్న అంబూర్ వంటి సర్కార్ జిల్లాలను ముట్టడించసాగారు. దీనితో ఆంగ్లేయులు సర్గంతి పాలయగాణ్ణి బంధించినా మరాఠా యుద్ధాల కారణంగా తమ వద్ద తగిన సైన్యం లేక విడుదల చేశారు. అయితే ఇందుకు ప్రతీకారంగా సర్గంతి పాలెగాడు, అతని మిత్రులు కలిసి సర్కారు జిల్లాలో విధ్వంసకాండకు దిగారు. చివరికి ఖజానాలు కొల్లగొట్టడానికి సైతం ప్రయత్నించారు. సైన్యం లేనందున సామరస్యంగా వ్యవహరించిన ఆంగ్లేయులు తమ బలహీనతను కప్పిపుచ్చుకునేందుకు సైనిక కవాతులతో పాలయగాళ్ళను భయపెట్టడానికి ప్రయత్నించడంతో వారు మరింత

రెచ్చిపోయి సర్కారు జిల్లాలలో విధ్వంసాలను తీవ్రతరం చేశారు. ఆంగ్ల పాలకులు పాలయగాళ్ల పోరాటాన్ని నిలువరించడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. పోరాట విరమణకు ఆంగ్లేయుల ప్రతిపాదనలు వారికి ఆమోదయోగ్యం కాకపోవడమే ఇందుకు కారణం. దీంతో ఆంగ్లేయులు తమ ఆధీనంలో ఉన్న సంస్థానాల నుండి సైన్యాన్ని రప్పించి పోరాటాన్ని అణచి వేయడానికి ప్రయత్నించారు. ఈ క్రమంలో జరిగిన అనేక యుద్ధాలలో ప్రతిసారీ పాలయగాళ్లు ఓటమి చవిచూసినా ఏదోవిధంగా పోరాటాన్ని కొనసాగిస్తూనే వచ్చారు. తగిన సైనిక, ధన బలం లేక పాలయగాళ్లు చివరికి పరాజయం పాలుకాక తప్పలేదు.

ఎదురుకొండ పాలయగాడు మద్దు రామప్ప నాయుడు తప్ప మిగిలిన వారంతా ఆంగ్లేయులకు లొంగిపోయారు. చార్లిల్ పాలయగాడి సాయంతో సాత్‌ఘర్ వద్ద తుదవరకు పోరాడి ఓడిన ముద్దు రామప్పనాయుడిని ఆంగ్ల సైన్యం కల్లెయ్యబండ అడవుల్లో ఉరితీసింది. లొంగిపోయిన పాలయగాళ్లలో కూడా కొందరికి మరణ దండన విధించగా మరికొందరిని ఆజన్మాంతం ఖైదులో ఉంచింది. చిత్తూరు పాలయగాళ్లు ప్రారంభించిన ఈ పోరాటంలో పలు వర్గాల ప్రజలు కూడా పాల్గొన్నారు. అనాదిగా స్వయం పోషకత్వంతో, సాంప్రదాయ పాలనతో కూడుకున్న గ్రామవ్యవస్థలో ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన మార్పులు అన్ని వర్గాల ప్రజలలో వ్యతిరేకతకు దారితీశాయి. గ్రామవారీ రైత్వారీ లాంటి విధానాల వల్ల రైతులకు పన్ను భారం పెరిగింది. గ్రామ పెద్దలు లేక మిరాసీదార్లు, కులపెద్దలు, ఆయగాళ్లు, బారబల్లూటి పేర్లతో గ్రామపరిపాలనా వ్యవస్థను నిర్వహిస్తున్న పన్నెండుమంది గ్రామాధికారుల అధికారాలను పూర్తిగా తగ్గించేశారు.

వంశపారపర్యంగా అమలులో ఉన్న అమరం, చిల్లూరు ఇనాంలు, గ్రామ మాన్యాలు, కట్టుబడి ఇనాంలు రద్దయ్యాయి. ఈ చర్యలు రాజకీయ, సాంఘిక వర్గాలను అసంతృప్తికి గురిచేసింది. గ్రామోద్యోగుల హక్కులను సైతం రద్దు చేశారు. ఆలయాలు, మఠాల నిర్వహణకు ఇచ్చిన ఇనాంలను రద్దు చేసి సాధారణ శిస్తు వసూలుకు ఆదేశించారు. చెరువుల నిర్మాణం, వాటి మరమ్మత్తు,

కాలువల తవ్వకం, తటాకాల నిర్వహణ, ఆనకట్టల నిర్వహణకు ఇచ్చిన ఇనాంలను కూడా రద్దు చేశారు. అసలు నీటిపారుదల వ్యవస్థకు ప్రాధాన్యం లేకుండా చేశారు. రోడ్ల నిర్మాణం కేవలం సైనిక అవసరాల మేరకే జరిగేది. సయర్, మోతుర్ఫా పన్నుల విధింపు వల్ల వ్యాపార వర్గాలలో అసంతృప్తి తలెత్తింది. మానవత్వాన్ని మరచి పన్నుల కోసం ప్రజలను పీల్చిపిప్పి చేయడం వారిని తిరుగుబాటుకు పురికొల్పింది. దీంతో వీరంతా రైత్వారీ విధానం రద్దుకై ఉద్యమించారు. పాలయగాళ్ల పోరాటం విఫలమైనా కూడా రైతులు పోరాటాన్ని ఆపలేదు. ఒత్తూరు, డెన్‌కెంకోటల రైతులు సుమారు 1500 మంది తిరుగుబాటుకై ధర్మపురిలో సమావేశంకాగా వారి ప్రయత్నాన్ని ఆంగ్లేయులు వమ్ము చేశారు. అనంతరం రాయకోటి దగ్గరి గ్రామాలలో పెద్ద తిరుగుబాటు జరిగినా సైనిక బలంతో అణచివేశారు.

6

క్రీ.శ. 6వ శతాబ్దం నాటికి సామ్రాజ్యవ్యవస్థ పతనమై రాజ్యవ్యవస్థ వచ్చింది. క్రీ.శ. 17వ శ. నాటికి ప్రాంతీయ రాజ్యవ్యవస్థ కూడా పతనమై పాలెగాళ్ళ వ్యవస్థ వచ్చింది. రాయలసీమలో పాలెగాళ్ళు, తెలంగాణాలో దేశ్‌ముఖ్‌లు, కోస్తాలో జమీందార్లు వీళ్ళందరూ రాజ్యం పాలిస్తూ వచ్చారు. క్రీస్తు శకం 1136 నుంచి 1650 సంవత్సరందాకా అధికారంలో ఉన్న విజయనగర సామ్రాజ్యంలో రాయలసీమ ప్రాంతం ప్రముఖ పాత్ర వహించింది.

కాకతీయుల కాలంలో ప్రారంభమైన చెరువుల ఇంజనీరింగ్ విజయనగర రాజుల కాలంలో ఉన్నత స్థాయిని చేరుకుంది. క్రీ.శ. 1650లో పెనుగొండ వద్ద జరిగిన యుద్ధంలో విజయనగర రాజ్యం ధ్వంసమైంది. ఆ తర్వాత రాయలసీమ ప్రాంతం అనేక చేతులు మారి చివరగా బ్రిటిష్ వారి అధీనంలోకి వచ్చింది. 1800 సంవత్సరంలో నిజాం ప్రభువులు దత్త మండలం (సీడెడ్ జిల్లాలు)గా రాయలసీమ ప్రాంతాన్ని బ్రిటిష్ వారికి అప్పగించారు. బ్రిటీష్ పరిపాలన భారతదేశంలో స్థిరపడి 200 సంవత్సరాలు కొనసాగి ఆర్థిక రాజకీయ మార్పులు

ఎన్ని తెచ్చినా రాయలసీమలో పాలెగాళ్ళ వ్యవస్థ కొనసాగుతూనే వచ్చింది. నిజాం ప్రభువు ఈస్టిండియా కంపెనీకి ఈ జిల్లాల్ని దత్తత ఇచ్చే కాలంనాటికే ఇక్కడ 80 మంది పాలెగాళ్ళు ఉండేవారు.

కర్నూలు జిల్లాలోనే 22 మంది పాలెగాళ్ళను గుర్తించారు. సీడెడ్ జిల్లాలకు మొదటి కలెక్టర్‌గా వచ్చిన సర్ థామస్ మన్రో పాలెగాళ్ళను అణచడానికి వ్యూహాలు చేశాడు. ఈ పాలెగాళ్ళు కొత్తకొండ, కప్పర్తల దేవరకొండ, అవుకు, కోయిలకుంట్ల ప్రాంతాల్లో ఉన్నట్లు గుర్తించారు. 1900 సంవత్సరం నుంచే కొయిలకుంట్ల తాలూకాలో ఫ్యాక్షన్ ఉండేదని రికార్డులు చెప్తున్నాయి. అప్పటి పాలెగాళ్ళ సొంత సైన్య సంస్కృతి, దాడుల సంస్కృతి, ఇప్పటి ముఠా కక్షల నాయకులకు ఒక వారసత్వంగా సంక్రమిస్తూ వస్తోంది.

మారిన కాలానికి అనుగుణమైన ఆయుధాలు కలిగి ఉండటం, అనుచరులను పెంచిపోషించడం, ఎన్నికల్లో పాల్గొనడం, కాంట్రాక్టులు, మద్యం వ్యాపారాలు, ప్రత్యర్థులపై కక్ష, రాజకీయ వ్యూహాలు వంటివన్నీ పాలెగాళ్ళ సంస్కృతి వాతావరణం నుంచి మనకు వస్తున్నట్లు గమనించవచ్చు. రాయలసీమలో రాజకీయం ప్రత్యేకమైన నేపథ్య కోణాన్ని కలిగి ఉంది. ఎన్నికల్లో వర్గరాజకీయాలు తీవ్ర స్థాయిలో ఉంటాయి. గ్రామాల్లో ఆధిపత్యపోరు స్పష్టంగా కన్పిస్తుంది. ఎన్నికల అనంతరం గ్రామాల్లో హింస, ఘర్షణ ఏర్పడుతుంది. గ్రామాల్లో పగలు, ప్రతీకారాలతో నిరంతరం భయం, అశాంతి మధ్య జీవితాలను నెట్టుకొస్తున్న పరిస్థితులున్నాయి.

వానవొక కలగా, కరువే నిత్యజీవన దృశ్యమై, వ్యవసాయం జూదమై, బతుకు రుణగ్రస్తమైన రైతుల జీవన వ్యథల్ని సీమలో స్పష్టంగా చూడవచ్చు. రాయలసీమ సామాజిక జీవిత గమనాన్ని అర్థం చేసుకోవచ్చు. గ్లోబలైజేషన్ క్రమంలో మారుతున్న మానవ సంబంధాల్ని ప్రజల జీవితాల్లో వస్తున్న మార్పుల్ని సాహిత్య కారులు ప్రతిబింబిస్తున్నారు. సీమలో కరువులకి, కక్షలకి అవినాభావ సంబంధం ఉంది. పరస్పరం సంబంధం కలిగిన కరువు, కక్షలు రాయలసీమపైన తీవ్ర ప్రభావాన్ని చూపిస్తూనే ఉన్నాయి.

హీనదశ లేక ప్రాథమిక దశ నుంచి ఉత్తమ దశకు చేరడానికి చేసే ప్రయత్నాన్ని, భౌతికంగా, మానసికంగా ఉన్నత దశకు చేరడానికి చేసే నిరంతర ప్రయత్నాన్ని 'సంస్కృతి' అంటాము. కరువు, కక్షల వలయాల నుంచి సీమవిముక్తం కావడానికి నిరంతరంగా పెనుగులాడుతూనే ఉంది. ఏకకాలంలో అనేక వలయాల్లో ఈ సంఘర్షణ ఇప్పటికీ మనకు స్పష్టంగా కన్పిస్తూనే ఉంది.

విజయనగర సామ్రాజ్య పతనం అనంతరం పాలెగాళ్ళ రాజ్యాల నుంచే ఈ గ్రామ కక్షలు ప్రారంభమయ్యాయి. పాలెగాళ్ల కాలంలో గ్రామానికి-గ్రామానికి మధ్య లేదా కొన్నిగ్రామాలకు - మరికొన్ని గ్రామాలకు మధ్య ఈ కక్షలు నడిచేవి.

ఈ పాలెగాళ్ళలో ఉన్న పంతం, ప్రత్యర్థిపై క్రౌర్యం ప్రదర్శించే మనస్తత్వం సీమ ప్రజల్లో మానసికంగా రూపుదిద్దుకున్నట్లు కనిపిస్తోంది. మరోవైపు పిలువకపోయినా వచ్చే కరువు కాటకాల వల్ల సీమలో పనిచేసేందుకు రైతులకు పని ఉండేది కాదు. ఈ భౌతిక స్థితి, మానసిక స్థితి కలగలిపిన విక్షణ కక్షల సంస్కృతికి బీజం వేసినట్లు తెలుస్తోంది. ఈ కక్షల చరిత్ర కడప జిల్లాలోని ప్రొద్దుటూరు, కమలాపురం, పులివెందుల, కర్నూలుజిల్లాలోని ఆళ్లగడ్డ, పాణ్యం, ఆత్మకూరు, అనంతపురం జిల్లాలోని తాడిపత్రి ప్రాంతాల్లోకి క్రమక్రమంగా చేరింది. 1960-70వ దశకంలో కడప జిల్లాలోని రాయచోటి, చిత్తూరు జిల్లాలోని తంబళ్లపల్లె, మదనపల్లె, అనంతపురం జిల్లాలోని పెనుగొండ, ధర్మవరం, కర్నూలు జిల్లాలోని కొన్ని తాలూకాలకు ఈ కక్షల సంస్కృతి వ్యాప్తి చెందింది.

రేనాడు ప్రాంతంలో భూమి ఏ ఒక్కరి చేతిలోనో కాకుండా చాలామంది చేతుల్లో ఉండి అందరూ రైతులమనే భావనకలిగి ఉండేవారు. అయితే భూస్వామ్య భావజాలంలో ప్రధానంగా ఉండే ఆధిపత్య ధోరణి, మాట పట్టింపు, తమ మాటే నెగ్గాలనే మొండితనం లక్షణాలు కక్షలకు కూడా ఒక కారణమైనాయి.

గ్రామాధిపత్యం కోసమే కాకుండా, కేవలం మాట పట్టింపుతో తమ మాటే గెలవాలనే మొండితనంతో గ్రామ కక్షలకు బీజం వేసుకున్న చరిత్ర సీమలో కన్పిస్తుంది. గ్రామంలోని అన్ని కులాలవారు రెండు వర్గాలుగా విభజింపబడి ఏదో ఒక నాయకునికి మద్దతు ఇచ్చిన సంఘటనలే ఉన్నాయి. 1975 నుంచి

83 దాకా దేశంలోనూ, రాష్ట్రంలోనూ రాజకీయాల్లో వచ్చిన పెనుమార్పుల నేపథ్యంలోనే రాజకీయాలలో హింసావాదులకు కూడా స్థానం దొరికింది. ఇదే సమయంలో రాయలసీమలో కొత్తగా బరిలోకి దిగిన రాజకీయ నాయకులకు గ్రామాల్లోని పార్టీ నాయకుల అండ కావాల్సి వచ్చేది. ఈ పరిణామం అనతికాలంలోనే 1985 నాటికి ఈ ఫ్యాక్షన్ నేతలే ప్రత్యక్షంగా ఎన్నికల బరిలోకి దిగే సంస్కృతి ప్రారంభమై 'రాజకీయ కక్షల చరిత్ర' బలపడడానికి మూలమైంది.

నిజానికి రాయలసీమ ఫ్యాక్షన్ అనుకునే సీమ కక్షల సంస్కృతి క్రమక్రమంగా తగ్గుతోంది. అన్ని ప్రాంతాల్లో విస్తరించుకున్న ఈ హింసా రాజకీయ పరిణామం, రాయలసీమలో 'ఫ్యాక్షన్'గా ప్రత్యేక ముద్రతో చర్చకు వస్తోంది. ఫ్యాక్షనిజం రాజీయ ప్రాబాల్యాన్ని సంతరించుకోవడంతో రాజకీయ వ్యవస్థలో ఫ్యాక్షనిష్టుల పలుకుబడి పెరిగింది. ప్రతిష్ట పెరిగింది. ఫ్యాక్షన్ పీడిత ప్రాంతంలో వెనుకబాటుతనాన్ని, నిరుద్యోగాన్ని ఫ్యాక్షనిస్టులు పెంచారు. వీటిని తమ పెట్టుబడిగా ఉపయోగించు కున్నారు.

గ్రామాల్లోని చిన్న విషయాలే కొట్లాటలుగా మారి హత్యలకు దారితీస్తాయి. ఇవి రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి వ్యక్తిగతమైన హత్యలు, రెండు రాజకీయ హత్యలు. పూలికుంట్ల గ్రామంలోని వసుదేవరరెడ్డికి, మీగడోళ్ల మల్లారెడ్డికి భూమి తగాదా వల్ల 'పార్టీ' ఏర్పడుతుంది. ఇద్దరూపగలు పెంచుకొని ఒకరి కోసం మరొకరు కాపు కాస్తూ ఉంటారు. ఒకరోజు కడప నుంచి వస్తుండే వసుదేవరెడ్డిని వేంపల్లె రోడ్డులో మల్లారెడ్డి చంపిస్తాడు. వసుదేవరెడ్డి భార్య ముండమొయ్యకుండానే తన ఏకైక కొడుకును 'నేలమాలు'లో ఉంచి పన్నెండు సంవత్సరాలు సాకుతుంది. అతనికి యుక్త వయస్సు వస్తూనే తమ ప్రత్యర్థి అయిన మల్లారెడ్డి తల తెచ్చి యిస్తే ముండ మోస్తానని కొడుకుతో అంటుంది. అతడు జీతగాని సాయంతో మల్లారెడ్డిని గుర్తించి అతని తలను తెచ్చి యిస్తూనే ఆమె వైధవ్యాన్ని స్వీకరిస్తుంది.

ఇలాంటిదే చెన్న క్రిష్ణారెడ్డి కథ కూడా. ఆయన అతని తోడల్లుడు చెంచిరెడ్డి ఆహ్వానం మేరకు కోడిపందెం వెళతాడు. ఇద్దరి కోళ్లకు కత్తులు కట్టి అల్లిలో దించుతారు. చెన్నక్రిష్ణారెడ్డి కోడి గెలుస్తుంది. అతని అనుయాయులు తాగిన

మైకంలో కోస కోడిని (ఓడిన కోడిని) చెట్టు కొ(ర్రకు వేలాడదీసి హేళన చేస్తారు. దీంతో చెంచిరెడ్డి కొడుకు నాగిరెడ్డి 'మనుషుల పందెం' ఆడదామంటాడు. ఇరు వర్గాలకు మాట మాట పెరిగి చంపుకొంటారు.

రాజకీయ హత్యకు ఉదాహరణ చింతల్‌రెడ్డి కథ. దొరిగల రంగారెడ్డి, చింతల్ రెడ్డి బావ, బావమరుదులు. ప్రజల మద్దతుతో ఎలక్షన్‌లో పోటీ చేసిన చింతల్‌రెడ్డి రంగారెడ్డిపై గెలుస్తాడు. అది గిట్టని రంగారెడ్డి నివురుగప్పిన నిప్పులా ఉండి ఒకరోజు చింతల్‌రెడ్డి ఒంటరిగా వస్తుండగా, తన అనుయాయుల చేత చంపిస్తాడు. ఈ విషయం తెలుసుకున్న చింతల్‌రెడ్డి చెల్లెలు రామకిష్ణమ్మ కోర్టుకు పోయి కేసు పెట్టదు. కానీ తన అన్నను చంపినవాణ్ణి మచ్చిక చేసుకొని పొలం పనులకు రప్పించి, ఒంటరివాణ్ణి చేసి, ఒక్కొక్క అవయవం తీసివేస్తూ చంపించడం ఆమె కక్షకు మూల్యంగా తలంచవచ్చు. పై సంఘటనలో ఇరుపక్షంలోని ముఖ్య వ్యక్తులు మరణించిన తర్వాత మరల హత్యలు జరగకుండా ఉండేందుకు ఇరుపక్షంవాళ్లు బంధువులు, పెద్దలు కలిసి రాజీ కుదుర్చుకోవడం చూడవచ్చు.

ఈ ప్రాంతం ప్రధానంగా కరువు ప్రాంతం. ఫలితంగా ఈ ప్రాంతంలోని అనేక గ్రామాల్లో వ్యవసాయ పనులు మూడు నెలలకు మించి ఉండవు. ఈ ఆర్థిక వెనుకబాటు తనం వల్ల నిరక్షరాస్యత, నిరుద్యోగం కూడా ఈ ప్రాంతంలో అధికం. ఈ పరిస్థితుల్లో నిరాశా నిస్పృహలతో ఉన్న నిరుద్యోగ యువకులను ఫ్యాక్షనిస్టులు పావులుగా వాడుకుంటున్నారు.

పేదరికం, నిరక్షరాస్యత, నిరుద్యోగం ఒకదానికొకటి తోడవడంతో పేదల కుటుంబాలకు ముఖ్యంగా బలహీ వర్గాలకు చెందినవారు హింసనే జీవనోపాధిగా ఎంచుకున్న ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. అందుకే ఫ్యాక్షనిజం సమస్య పరిష్కారం కావాలంటే ఈ ప్రాంతం యువకుల్లో ముఖ్యంగా బలహీన కుటుంబాలకు చెందిన యువకులకు ఉపాధి అవకాశాలు పెరగవలసిన అవసరం ఉంది. ఫ్యాక్షనిజం సజీవంగా ఉండడానికి ఆర్థిక కారణలే ప్రధానమైనవి. బలవంతపు వసూళ్లు, చట్టవిరుద్ధమైన మైనింగ్ కార్యకలాపాలు, చట్ట వ్యతిరేకంగా జరిపే ఇతర పారిశ్రామిక, వ్యాపార, వాణిజ్య కార్యకలాపాలు,

ప్రత్యర్థులను భయానికి గురిచేసి టెండర్లు సంపాదించడం వంటి పనులు ద్వారా ఫ్యాక్షనిస్టులు బలపడ్డారు. పార్టీలు సంకుచిత ప్రయోజనాల కోసం ఫ్యాక్షనిస్టులను అక్కున చేర్చుకోవడం ఈ సమస్య పెరగడానికి మరో కారణం.

మట్కా లాంటి గ్యాంబ్లింగ్ కార్యకలాపాలను ప్రోత్సహించడం, కల్తీ మద్యం అమ్మకాలు, కిరాయి హత్యలు, పేలుడు పదార్థాల అమ్మకాలు, ఆస్తులు, భూముల దురాక్రమణ వంటి చట్టవిరుద్ధమైన కార్యకలాపాల ద్వారా ఫ్యాక్షనిస్టులు విపరీతంగా సంపాదించారు. తమకు ప్రాబల్యం ఉన్న ప్రాంతాల్లో ప్రజలను హడలెత్తించి తామే గొడవల్లో, వివాదాల్లో తీర్పులు చెప్పడం మొదలైంది.

సీమ ప్రాంతం ఖనిజ నిక్షేపాల భాండాగారం. ఇక్కడ పలకరాయి నుంచి వజ్రాల వరకు అన్ని రకాల ఖనిజ నిక్షేపాలు ఉన్నాయి. కర్నూలు, కడప జిల్లాలో బెరైట్, అనంతపురంలో సున్నపురాయి నిక్షేపాలు పుష్కలంగా ఉన్నాయి. వీటికి రాష్ట్రంలోనే కాదు దేశ విదేశాల్లో కూడా మంచి డిమాండ్ ఉంది. ఈ ఖనిజ నిక్షేపాలు కూడా ఫ్యాక్షనిస్టుల చేతుల్లోకి మారాయి.

స్థానిక గొడవల్లో, వివాదాల్లో తామే న్యాయ నిర్ణేతలై చెప్పడంలో ఫ్యాక్షనిస్టులు సిద్ధహస్తులు. పాలనా వ్యవస్థ, చట్టం నుంచి తప్పించుకోవడానికి ఫ్యాక్షనిస్టులకు రాజకీయ ఆశ్రయం అవసరమైంది. ప్రజలను భయపెట్టే సామర్థ్యం ఉండడం, నేరాలు, ఘోరాలకు పాల్పడగలిగే యంత్రాంగం ఉండడం వల్ల ఫ్యాక్షనిస్టులు విజృంభిస్తున్నారు. ఎన్నికల సమయంలో పోలింగ్ బూత్‌లు ఆక్రమించుకోవడానికి, రిగ్గింగ్‌కు పాల్పడడానికి తమకు వ్యతిరేకంగా ఉండే ఓటర్లను, ప్రత్యర్థులను బెదరగొట్టడానికి, అవసరమైతే భౌతికంగా నిర్మూలించడానికి కూడా ఫ్యాక్షనిస్టులు నాయకులకు బాగా ఉపయోగపడుతున్నారు.

పూర్వం ఫ్యాక్షన్ అనేది పల్లెల్లో పెత్తనం కోసమే ఉండేది. ఇవాళ అది అక్రమ ధనార్జనకు, అధికార దుర్వినియోగానికి ఉపయోగపడుతోంది. పూర్వం ఫ్యాక్షన్ ప్రభావం కేవలం ఫ్యాక్షనిస్టుల మీద, వారి అనుచరుల మీద మాత్రమే ఉండేది. నేడు గ్రామాల్లోని సామన్య జనంపై కూడా ప్రభావం కన్పిస్తోంది.

ఫ్యాక్షనిస్టుల గుంపు ప్రదర్శించే నాటుతుపాకులు, వారి వాహనాలకు బారులు తీర్చి తిరగడం, బాంబులు వేసుకునే విష సంస్కృతి సామాన్యుడి మానసిక స్థితిని దెబ్బతీస్తోంది. పేదరికం, నిరుద్యోగం, ఏడాది పొడుగునా పొలాల్లో పనులు లేకపోవడం గ్రామస్థుల్ని ఫ్యాక్షనిస్టులుగా అనుచరులుగా మారేటట్లు చేశాయి. నిజానికి అలాంటి కుటుంబాలవారు ఎందరో ఊరు విడిచి వెళ్ళడం, కాలక్రమేనా వలస జీవులుగా మిగిలిపోవడం జరిగింది.

ఓట్ల కోసం రాజకీయ నాయకులు అమాయకపు పల్లెల్ని రెండు వర్గాలుగా చీల్చడం ప్రారంభించారు. కులం ఒక ప్రధాన కారణమైంది. ఫ్యాక్షన్ పెరిగింది. ముఠాలు పెరిగాయి. వ్యక్తిగతంగా సైన్యాన్ని నడుపుకునే ఫ్యాక్షన్ రాజకీయవేత్తలు పుట్టుకొచ్చారు. ఫ్యాక్షన్ రాజకీయాలలో పల్లెలు అగ్నిగుండాల్లా మారిపోసాగాయి. బాంబులు పేరే తెలియని మారుమూల పల్లెటూళ్ళలో ఇవి తప్పనిసరిగా మారాయి. ఫ్యాక్షన్ రాజకీయాల్లో చిక్కుకుని చాలా కుటుంబాలు ధ్వంసమయ్యాయి. కొన్ని ప్రాంతాల్లో ఊళ్లకు ఊళ్లు బూడిదయ్యాయి. ఈ ఫ్యాక్షన్ నాయకులకు అండగా ఒక కిరాయి గూండా వర్గం పెరగసాగింది. మద్యం చాలా సహజమైన పానీయమై పోయింది. నాలుగు బాంబులూ, రెండు నాటుతుపాకీలూ, పదిమంది అనుచరులూ ఉన్నవారంతా ఇక్కడ ఒక దళనాయకుడైపోయారు.

పల్లెల్లోని కక్షల్ని ఉపయోగించుకొని గ్రామీణ జీవితాన్ని వీళ్లు హింసాత్మకంగా చేస్తూ వచ్చారు. ఏ సిద్ధాంత బలమూ లేని, ఏ తాత్విక దృక్పథమూ లేని ఇలాంటి గ్రూపులు కొన్ని రాజకీయ పార్టీలకు వత్తాసుగా మారి గ్రామీణ ప్రజల్లో భయందోళనలు సృష్టిస్తున్నాయి. పల్లెల్లో బతకడం కష్టమైపోయి పట్టణాలకు వలస వచ్చే రైతు కూలీల సంఖ్య పెరిగింది. చిన్నకారు రైతులు భూముల్ని అమ్ముకొని కూలీలుగా మారిపోయారు. ఇరవై ఎకరాలుండే రైతులకు కూడా రెండు సంవత్సరాలు వర్షాలు రాకపోతే బతుకుతెరువు కష్టమైపోయింది. కరెంటు రేట్లూ, ఎరువుల ధరలూ ఎప్పటికప్పుడు విపరీతంగా పెరిగిపోవడం, రైతు సమస్యల్ని, కరువు తీవ్రతనూ పాలకవర్గాలు పట్టించుకోకపోవడంతో ప్రజల్లో చైతన్యం పెరిగింది. ఈ దశలోనే పట్టణీకరణ ఎక్కువైపోయింది.

ఒక గ్రామంలో లేదా ఒక ప్రాంతంలో ఆధిపత్యం కోసం ప్రారంభమైన పోరు ఆధునిక పరిస్థితులకు అనుగుణంగా మార్పులు చెందుతూ వచ్చింది. మారుతున్న రాజకీయ సామాజిక సంక్లిష్ట పరిస్థితుల మధ్య, ప్రాకృతికంగానూ, రాయలసీమ అనుభవిస్తున్న భౌగోళిక పరిస్థితులను, కరువు, తాగునీటి సమస్య, సాగునీటి సమస్య, పంటలు పండకపోవడం, పండించిన పంటకు గిట్టుబాటు ధర లభించకపోవడం, దళారీల దోపిడీ - వంటి అంశాలన్నీ సీమలో ప్రధానంగా కన్పిస్తాయి.

7

సీమ ప్రాంతంలో ఏడు వందల మి.లీ. కంటే తక్కువ సగటు వర్షపాతం కలిగి ఉంది. దీనికతోడు ఉష్ణోగ్రత 45 డిగ్రీ సెల్సియస్‌కి పైగానే ఉంటుంది. నిస్సారమైన పంట భూములు, చాలని పెట్టుబడులు, నైపుణ్యంలేని సేద్యపు పనులు, తక్కువ వ్యవసాయోత్పదకత, నామమాత్రమైన పారిశ్రామికీకరణ, తక్కువ నీటి పారుదల సౌకర్యం, అత్యల్ప వర్షపాతం, అధిక ఉష్ణోగ్రతలు సీమ వెనుకబాటుతనానికి కారణాలు. అక్షయనామ సంవత్సరంలో వచ్చిన కరువును అక్షయకరువు (1747) అన్నారు. ఈ కరువు గురించి పదకర్త సారంగపాణి (18వ శతాబ్దం) తన పదాలలో వివరించారు. ధూర్జటి శ్రీకాళహస్తి మహాత్మ్యంలో కరువు వర్ణన చేయడాన్ని గమనించవచ్చు.

కరువు అనే పదానికి సమాంతరంగా వర్షాభావం. క్షామం అనే పదాలు వ్యవహారంలో ఉన్నాయి. కరువు వర్షాభావం యొక్క ప్రథమ దశ అని, క్షామం దాని పరిణితి దశ అని సామాజిక శాస్త్రవేత్తల అభిప్రాయం. కరువు మనిషికీ మనిషికీ మధ్యసంబంధాన్ని, మనిషికి భూమికి మధ్య ఉన్న సంబంధాన్ని విచ్ఛిన్నం చేస్తోంది. కదిరి నరసింహరాయస్వామి దేవాలయంలోని ఒక శాసనం ప్రకారం 1390-91లో వచ్చిన కరువు గురించిన ప్రస్తావన ఉంది. 1803-1885ల మధ్య కరువు తీవ్రత గురించి 1886నాటి బళ్ళారి తాత్కాలిక కలెక్టర్ నికొల్సన్ కూడా రికార్డుల్లో రాశాడు.

1876-78లో సీమలో వచ్చిన ఈ కరువును పెద్ద కరువు, ధాతుకరువు, దూబకరువు, వలసకరువు, ముష్టి కరువు, డొక్కల కరువు అని రకరకాల పేర్లతో పిలిచారు. 22 నెలలపాటూ ఈ కరువు కొనసాగింది. 1891-92 మధ్య వచ్చిన కరువు కారణంగా దాదాపు 1/3 వంతుల పశువులు, జీవాలు చనిపోయాయి. 1896-97 కరువువల్ల బుక్కపట్నం, ధర్మవరం, పరిగి చెరువులు పూర్తిగా ఎండిపోయాయి. మద్రాసు నుంచి వచ్చేగడ్డి కోసం రైతులు ఎదురు చూస్తూ గడిపారు. 1900లో ఒకసారి 1901లో మరోసారి వచ్చిన కరువు మీద 'ఇండియన్ ఇరిగేషన్ కమిటి' నివేదిక వచ్చింది. 1920-21 కరువు కారణంగా గుత్తిలో ఏడు వంట శాలలను కూడా ఏర్పాటు చేశారు. 1924-25 మధ్య, 1966-68 మధ్య, 1972-73, 1979-80, 1980-81ల మధ్య కరువులు సీమను ఆవరించి నిర్వీర్యం చేశాయి.

1948-52 సంవత్సరాల మధ్యసీమలో వచ్చిన ధాతు కరువు సమయంలో ప్రభుత్వం, రామకృష్ణమిషన్ వంటి ధార్మిక సంస్థలూ నడిపిన గంజి కేంద్రాలు ఎందరికో కడుపులు నింపి ప్రాణాలు రక్షించాయి. అందుకే ఆ కరువును 'గంజి కరువు' అని కూడా పిలిచారు. ఇలాంటి ఇతివృత్తాన్ని ప్రధానంగా స్వీకరించి రాయలసీమ తొలికథకుడు అనంతపురానికి చెందిన గుత్తి రామకృష్ణ 'గంజి కోసం' అనే విశిష్టమైన కథను రాశారు. ఈ కథ 1953 సెప్టెంబర్ 9 నాటి ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రచురితమైంది. ముసలిఅవ్వ, కోడలు, మనుమరాలు, మనుమడు కరువువలన వేరే ఊరికి వలసవెళ్ళడం ఇందులోని కథాంశం.

8

స్థానిక చరిత్రలను సేకరించి అధ్యయనం చేస్తే తప్ప మనకు ఒక ప్రాంతం గురించిన అవగాహన పరిపూర్ణంగా ఏర్పడదని స్పష్టంగా భావించిన వ్యక్తి కల్నల్ కాలిన్ మెకంజీ. ఆయన ఆలోచనల నుంచి జీవం పోసుకున్న ఎన్నో అంశాలు నేటి భవిష్యత్ తరాల వారికి చరిత్రను శాశ్వతంగా అందిస్తున్నాయి. 1784-90 మధ్య ప్రాంతంలో మెకంజీ నేటి రాయలసీమ నాలుగు జిల్లాలను విస్తృతంగా అధ్యయనం చేశాడు. రహదారి మార్గాల చిత్రపటాలు తయారు చేయించాడు.

ప్రాంతాల మ్యాపులను, రేఖాచిత్రాలను గీయించాడు. 1790లో ఈ ప్రాంతాన్ని సర్వే చేయడానికి అధికారిగా నియమితుడైనాడు. ఒక్కో గ్రామానికి వుండే స్థానిక చరిత్రను ప్రత్యేకంగా రాయించి 'కైఫీయత్తు'లుగా తయారు చేయించాడు. 1793 నుంచి 1816 వరకు దక్షిణ భారతదేశంలో పనిచేస్తున్నప్పుడే తనకు లభించిన ప్రతి తాళపత్ర గ్రంథాన్ని సేకరిస్తూ చరిత్రకు వెలుగు నిచ్చాడు. 2070 స్థానిక చరిత్రలను, 8076 శాసన పాఠాలను, 79 దేశపటాలను, 2630 చిత్ర పటాలను, 6218 నాణెములను, 106 శిల్ప చిత్రాలను, 40 పురాతన వస్తువులను మెకంజీ సేకరించాడు.

ఈస్టిండియా కంపెనీలో ఇంజనీరుగా 1782లో భారతదేశానికి వచ్చాడు మెకంజీ. 1818 నాటికి ఇండియాలో మొదటి సర్వేయర్ జనరల్‌గా నియామకం అయ్యాడు. చరిత్ర అధ్యయనం పట్ల వున్న ఆసక్తితో ఏలూరులో వున్న కావలి వెంకట నారాయణ, కావలి బొర్రయ్య, వెంకటరామస్వామి, సీతయ్య గారిని - చారిత్రక సంపద సేకరణకు వినియోగించుకున్నాడు. శాసనాల అధ్యయనం, తాళపత్రాల సేకరణ, స్థానిక చరిత్రల నమోదు వంటి ఎన్నో అంశాలకు ప్రాధాన్యత ఇచ్చాడు. 1792లో అమరావతి బౌద్ధస్తూపంను వెలుగులోకి తీసుకొచ్చాడు. తన సొంత డబ్బు పదహైదువేల రూపాయలు ఖర్చు పెట్టి చరిత్ర సంపదను సేకరించాడు. వీటన్నింటిని అతడి మరణాంతరం ఈస్టిండియా కంపెనీ నుంచి వారన్ హెస్టింగ్స్ పదివేల డాలర్లకు కొనుగోలు చేశాడు. మెకంజీ సేకరించిన ఎన్నో చారిత్రక ఆధారాలు, ప్రతులు ఇప్పుడు మద్రాసులోని 'Government Oriental Manuscripts Library' లో పదిలపర్చబడి వున్నాయి.

9

తెలుగు సాహిత్యానికి జీవంపోసిన మహాశక్తి బ్రౌన్ గురించి ఎంత మందికి తెలుసు? నేడు మనం మహాభారతం, భాగవతం, కాశీఖండం, భాస్కర రామాయణం, విష్ణుపురాణం, చదువుతున్నాం అంటే దాని వెనుక బ్రౌన్ మహాశయుడి కృషి ఎంతో ఉంది. పుట్టుకతో ఆంగ్లేయుడు అయినా తన జీవితాన్ని మొత్తం తెలుగు భాషాభివృద్ధికి కృషి చేసిన మహనీయుడు బ్రౌన్.

ఇండియాలో తమ వద్ద ఉండి మరణించిన వారి పిల్లలను సర్వీస్‌లో చేర్చుకుని ఉద్యోగాలు ఇచ్చేది బ్రిటీష్ ప్రభుత్వం. ఆ నిర్ణయం మేరకు తండ్రిని కోల్పోయిన బ్రౌన్ 1817 ఆగస్టు 4న రైటర్ ర్యాంక్‌తో మద్రాసులో అడుగుపెట్టారు. అక్కడ వెలగపూడి కోదండరామ పంతులు గారి వద్ద తెలుగు అక్షరాభ్యాసం చేశాడు. మూడేళ్లు మద్రాసులో శిక్షణ ముగించి 1820 ఆగష్టులో కడపలో కలెక్టర్‌కు రెండవ సహాయకుడుగా చేరాడు. 1822లో బ్రౌన్ కడపనుంచి మచిలీపట్నం జిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా బదిలీ అయ్యాడు. అక్కడే కొంత కాలం జిల్లా జడ్జిగా కూడా పనిచేశాడు.

వేమన పద్యాలు వ్రాతప్రతుల లెన్నింటినో సేకరించాడు. మిత్రులు, అభిమానుల ద్వారా వివిధ ప్రాంతాల నుంచి వేమన పద్యాలున్న తాటాకు గ్రంథాలను తెప్పించాడు. 1829లో వేమన పద్యాలను ఆంగ్లంలో అనువదించి రెండుసార్లు సొంత ఖర్చుతో ప్రచురించాడు. సి.పి. బ్రౌన్ 1825లో రాజమండ్రి కలెక్టరుకు హెడ్ అసిస్టెంట్ మేజిస్ట్రేటుగా చేరాడు. అక్కడ ఆంధ్ర మహాభారత పఠనం ప్రారంభించాడు. తిరిగి 1826లో కడప జిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా చేరాడు. కడపను తాను సేకరించిన గ్రంథాల పరిష్కరణ శుద్ధ ప్రతుల తయారీకి స్థావరం కావాలని నిశ్చయించాడు. అందుకోసం కడపలో 1000 వరహాలకు పెద్ద బంగళా, తోట కొన్నాడు. బ్రౌన్ బంగళాని 'బ్రౌన్ కాలేజి' అని పిలిచేవారు. బ్రౌన్ ఉద్యోగరీత్యా ఎక్కడ పనిచేస్తూ ఉండినా, కడపలోని తోట, ఆస్తి పాస్తులు సాహిత్య సంబంధమైన పనులు మొదలైన వాటి గురించి ఎప్పటికప్పుడు తెలుసుకునేవాడు. తాటాకుల్లో శిథిలమైపోతూ కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్న ఎన్నో తెలుగు కావ్యాలను కాలగర్భంలో కలిసిపోకుండా పునరుద్ధరించిన ఘనుడు సి.పి. బ్రౌన్.

తెలుగు ప్రబంధాలలో అత్యంత జనప్రియమైన మనుచరిత్ర, వసుచరిత్రలను మొట్టమొదట వ్యాఖ్యానాలతో అచ్చువేయించిన యశస్సు బ్రౌన్‌కే దక్కుతుంది. కడప జిల్లా నందలూరుకు చెందిన ములుపాక బుచ్చయ్య శాస్త్రికి కడపలోని తన బంగళాలో కొలువు ఏర్పాటు చేసి 1829-30లో వసుచరిత్రకు వ్యాఖ్యానం తయారు చేయించాడు. కడపలో బంగళాతోట వ్యవహారాలు

చూసేందుకు విశ్వాసపాత్రుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డిని నియమించాడు. తెలుగు తాళపత్ర గ్రంథాలను వివిధ ప్రదేశాల నుంచి తెప్పించుకొని, వాటిని కాగితాల మీదికి ఎక్కించి, పరిష్కరింపజేసి, శుద్ధ ప్రతులను తయారు చేయించి అచ్చుకు సిద్ధంగా వ్యాఖ్యానాలు, పీఠికలు తయారు చేయడం వంటి పనులతో కడపలోని 'బ్రౌన్ కాలేజి' సాగిపోతుండేది.

మారుమూల ప్రాంతాల నుండి వ్రాత ప్రతులు సొంత డబ్బుతో సేకరించి తెచ్చేవాడు. బ్రౌన్ మహాభారత శుద్ధ ప్రతి తయారీకి రూ. 2714 ఖర్చు చేశాడు. అప్పుడు అతని నెల జీతంరూ. 500. తెలుగు భాషా సాహిత్య సముద్ధరణకు తన సర్వస్వం వ్యయంచేసి అది చాలక పోగా మరో 60 వేల రూపాయలు అప్పు తెచ్చి వేలాది గ్రంథాలను సేకరించాడు. ఇలా సేకరించి దాదాపు 5 వేల వ్రాత ప్రతులు అందించాడు. అలాగే 1215 వేమన పద్యాలు సేకరించి ఆంగ్లానువాదం చేసి ప్రచురించాడు. వసుచరిత్ర, మనుచరిత్ర వంటి ప్రసిద్ధ కావ్యాలను మొట్టమొదటి సారిగా ఆయనే ప్రచురించాడు. 1844లో వసుచరిత్ర, మనుచరిత్రల ప్రతులు సేకరించాడు. జూలూరు అప్పయ్యశాస్త్రి చేత వాటికి వ్యాఖ్యానాలు రాయించాడు. పల్నాటి వీరచరిత్ర, ప్రభావతీ ప్రద్యుమ్న, రాఘవపాండవీయ, కళాపూర్ణదయ కావ్యాలకు వ్యాఖ్య రాయించి అచ్చు వేయించాడు.

వేమన పద్యాల తర్వాత బ్రౌన్‌ను ఆకర్షించిన తెలుగు రచన 'సుమతీ శతకం'. ఈ శతకం నుంచి 85 పద్యాలను ఆంగ్లంలోనికి అనువాదం చేశాడు. బ్రౌన్ 36 పురాణేతిహాసాలను సేకరించినట్లు తెలుస్తోంది. కాశీఖండము, పద్మపురాణము, భాగవతం, భారతం, భాస్కర రామాయణం, విష్ణుపురాణం, శ్రీకాళహస్తి మహాత్మ్యం... శుద్ధ ప్రతులు రాయించాడు.

బైచరాజు వెంకటరాజు రచించిన పంచతంత్ర, హంసవిశంతులకు పదసూచికలు తయారు చేయించాడు. సింహాసన ద్వాత్రింశిక కథాసారాన్ని 43 పుటల్లో ఆంగ్లంలో సంగ్రహం చేశాడు. గౌరవ హరిశ్చంద్రోపాఖ్యానాన్ని 1842లోను, వైజయంతి విలాసాన్ని 1848లో అచ్చు వేయించాడు. కళాపూర్ణోదయం,

తారాశంశాక విజయం, విజయవిలాసం, కుచేలోపాఖ్యానాలను ముద్రింపజేశాడు. తెలుగు సాహిత్యంలో బ్రౌన్ ముద్రపడని ప్రాచీన కావ్యం లేదు. గ్రంథ సేకరణతో పాటుగా సాహిత్య సంబంధమైన ఇతర వాటిని కూడా సేకరించాడు. చాటువులు, జానపద గీతాలు, సామెతలు, పలుకుబళ్లు - వీటితో పాటు మంత్ర తంత్ర శాస్త్రాలకు చెందిన ఆనందతంత్రం, సౌందర్యలహరి, కులార్ణవం వంటి సంస్కృత గ్రంథాలను సేకరించాడు.

కావ్యాలు, ప్రబంధాలు, ద్విపదలు మొదలైన వాటినే కాక 84 శతకాలను సేకరించి పరిష్కరించినవాడు బ్రౌన్. తెలుగు నేర్చుకునే పాశ్చాత్యుల కోసం బ్రౌన్ స్వయంగా వ్యాకరణం రచించి 1840లో ముద్రించాడు. ఆయన వ్యాకరణ రచనలో వ్యవహారానికి అధిక ప్రాధాన్యత ఇచ్చాడు. 19వ శతాబ్దంలో తెలుగు భాషా స్వరూప లక్షణాలు, సంప్రదాయాలు, లేఖావతారిక విషయం లేఖాంతం ఎలా ఉండేవో తెలుసుకోవడానికి బ్రౌన్ తయారుచేయించిన 20 లేఖాసంపుటాలు ఎంతో ఉపయోగపడుతున్నాయి.

1844లో తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు ముద్రణ ప్రారంభించి 1852లో పూర్తి చేశాడు. 1982లో న్యూఢిల్లీకి చెందిన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులలోని పుటలు 1416. ఇంగ్లీషు - తెలుగు నింఘటువు, ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు 1853లో పూర్తి అయింది. మిశ్రభాషా నిఘంటువు 1854లో ముద్రింపబడింది. ఈ నిఘంటువులో అరబిక్, ఫారసి, ఉర్దూ భాషాపదాలే కాక తమిళ, కన్నడ, మళయాళ భాషాపదాలకు కూడా అర్థాలు ఇచ్చాడు. బ్రౌన్ నిఘంటువులను ఆంగ్లం సాహిత్యం మన వారికి అందుబాటులోకి రావాలనే ఉద్దేశంతో రాశాడు. బ్రౌన్ జిల్లా నిఘంటువులను కూడా తయారు చేశారు. తాతాచారి కథలను ఇంగ్లీష్‌లో 'పాప్యులర్ తెలుగు టేల్స్' అనే పేరుతో 1855లో ప్రచురించాడు. మొత్తం 34 ఏళ్ళు (1817-1834; 1838-1855) ఇండియాలో ఉండి స్వదేశానికి వెళ్ళిపోవాలని నిర్ణయించుకొని ఉద్యోగం మానేసి పింఛను తీసుకున్నాడు. బ్రౌన్ దొర లండన్ వెళ్ళిన తర్వాత అక్కడ తెలుగు సాహిత్యానికి విశిష్ట స్థానం లభించింది.

1865లో లండన్ విశ్వవిద్యాలయంలో తెలుగు భాషాచార్యునిగా నియుక్తుడైనాడు. అక్కడ తెలుగు కోర్సుని ఏర్పాటు చేశాడు. గ్రీక్, లాటీన్, హిబ్రూ, ఫ్రెంచి, ఇటాలియన్, పర్షియన్, సంస్కృతం, ఆంధ్ర, ఆంగ్లం వంటి 24 భాషలలో పాండిత్యం గడించినవాడు బ్రౌన్ లండన్ తిరిగి వెళ్ళిన తర్వాత ఇంకో 30 ఏళ్ళు తెలుగు భాషా సాహిత్యాలకు సేవ చేసి 1884 డిసెంబర్ 12వ తేదీన కీర్తిశేషు లయ్యారు.

10

1750-1810 ప్రాంతాల్లోని పరిస్థితులను ఆవిష్కరిస్తూ 'అనంతపురం చరిత్ర' రచన మొదట తెలుగులో రాయబడింది. ఈ రచన చేసినవారు ఎవరనే అంశం నమోదు చేయలేదు. దీనిని సేకరించిన కల్నల్ కాలిన్ మెకంజీ మద్రాసులోని కాలేజీ లైబ్రరీలో పదిలపర్చాడు. అక్కడ ఈ ప్రతిని చూసిన సి.పి. బ్రౌన్ 1853 సం॥లో 'WARS OF THE RAJAS BEING THE HISTORY OF ANANTAPURAM' గా ఇంగ్లీష్‌లోకి అనువాదం చేసి ప్రచురించాడు. అదే సందర్భంలోనే తెలుగు ప్రతి కూడా ముద్రించబడింది. ఇప్పుడు ఆనాటి తెలుగు ముద్రణ ప్రతిని యథాతథంగా తీసుకొస్తున్నాం.

265 సం॥ల క్రితం నాటి అనంతపురం ప్రాంతంలోని ప్రజల జీవన జీవిత విధానంను ఈ రచన ప్రతిబింబిస్తుంది. ఆనాటి సాంఘిక ఆర్థిక, రాజకీయ సామాజిక పరిస్థితులను కళ్ళ ముందుకు తీసుకొస్తుంది. తిరుమల రాయల రణభేరి, హండే హనుమప్పనాయుడి కుమారుడు హంపానాయుడు రాజ్యాభిషేకం, మలకప్ప నాయుడు బుక్కరాయ సముద్రం చేరడం, శిద్దరామప్పనాయుడి వృత్తాంతం, బళ్ళారి కోట నుంచి శ్రీరంగపట్నం చెరసాల వరకు వంటి ఎన్నో చారిత్రక సంఘటనలు చరిత్రకు కొత్త దారిని వేస్తాయి. సజీవ చరిత్రకు సాక్ష్యంగా నిలుస్తాయి. ఈ పుస్తకం ఆధారంగానే సాహితీవేత్త కట్టమంచి రామలింగారెడ్డి 'బ్రౌన్ దొరగారిచే ప్రకటింపబడిన అనంతపురం చరిత్ర' అనే గ్రంథము నుండి ఇందలి కథ గైకొంటిని అని పేర్కొంటూ 'ముసలమ్మ మరణం' అనే రచనను ప్రకటించారు.

11

చరిత్ర అంటే ప్రయాణం. మన మూలాల అన్వేషణ. చెట్టు కింద భూమిలో పైకి కన్పించనంత లోతులో ఆధారంగా నిలుస్తున్న వేర్లు. నువ్వు ఇవాళ ఇలా ఎందుకున్నావో చెప్పే ఒక విస్ఫోటనం. రహస్యం. తరాలుగా తరతరాలుగా ఈ నేలపైన, నువ్వున్న ఈ మట్టిపైన ఏం జరిగిందో చరిత్ర చెప్తుంది. గతం లేకుండా వర్తమానం లేదు. కూలిన బురుజులు, కోట నిండా పీనుగులు, చెరువుకు గండి పడకుండా తెల్లార్లూ నిరీక్షించిన కళ్ళు, కక్షల హోమంలో రగిలిపోయే ఊళ్ళు, నెత్తురు పారిన యేర్లు, కత్తులు మొల్చిన బీళ్ళు చరిత్ర నిండా కన్పిస్తాయి. మనం నడిచివచ్చిన దారిని వెనక్కి తిరిగి చూసుకుంటే గుండె ఎడారి అవుతుంది. చరిత్ర అంటే ఏమిటో కాదు... నువ్వు! నీ నేల..! మీ ఇద్దరి చరిత్ర.

12

*రాత్రికి రాత్రి ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని, తప్పించుకొని, కోటగోడలు దాటుకొని పారిపోయి వచ్చి చింత చెట్టుకింద సంకెళ్ళతో కూర్చొని వున్న యుద్ధఖైది చెప్పే మాటలు ఎలా వుంటాయి?*

***- డా॥ వేంపల్లి గంగాధర్***
***20 డిసెంబర్, 2016***



ఊరి చెరువు కట్ట కోసం ప్రాణత్యాగం చేసిన - ముసలమ్మ



Thos Munro

సర్ థామస్ మన్రో




గుత్తి కోట కు సమీపంలోని మన్రో సమాధి



లండన్ బ్రిటీష్ లైబ్రరీలో ఉన్న గుత్తికోట చిత్రం. (బ్రిటీష్ చిత్రకారుడు థామస్ ఫ్రజర్)




లండన్ బ్రిటీష్ లైబ్రరీలో ఉన్న గుత్తికోట బురుజు చిత్రం. దీనిని 1802లో బ్రిటీష్ చిత్రకారుడు థామస్ ఫ్రజర్ చిత్రించాడు.

డా॥ వేంపల్లి గంగాధర్ : 'రాష్ట్రపతి భవన్'లో విశిష్ట ఆతిథ్యం అందుకున్న తొలి భారతీయ సాహితీవేత్తగా వీరు గుర్తింపు పొందారు. 2014, సెప్టెంబర్ 8వ తేదీ నుంచి 26 వరకు వీరు రాష్ట్రపతి భవన్‌లో విడిది చేశారు. రాయలసీమ ప్రాంతానికి సంబంధించిన పలు అంశాలపై పుస్తకాలు రాశారు. వీరి కథా సంకలనం 'మొలకల పున్నమి'కి కేంద్ర సాహిత్య అకాడమి మొదటి యువపురస్కారం - 2011 లభించింది. ప్రసిద్ధ సాహితీవేత్త సునీల్ గంగోపాధ్యాయ చేతుల మీదుగా తామ్రపత్రం అందుకున్నారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి 'రాయలసీమ కథా సాహిత్యం' పై పిహెచ్‌డీ, 'రాయలసీమ ఫ్యాక్షనిజం'పై ఎంఫిల్ పూర్తి చేశారు. కేంద్ర ప్రభుత్వం వారి 'రైటర్స్ ట్రావెల్ గ్రాంట్' ద్వారా 'శాంతినికేతన్'లో పర్యటించారు. మొలకల పున్నమి, దేవరశిల, గ్రీష్మభూమి, తొలితెలుగు శాసనం, పూణే ప్రయాణం, కథనం, హిరణ్యరాజ్యం, నేలదిగినవాన, నేను చూసిన శాంతినికేతన్, పాపాఘ్ని కథలు, రావణవాహణం కథలు, కడప వైభవం (సంపాదకత్వం), అనంతపురం చరిత్ర (సంపాదకత్వం), ఎర్రచందనం దారిలో తమిళ కూలీలు, యురేనియంపల్లె నవల పుస్తకాలు రాశారు. సీమ గిరిజన తండాల నుంచి పడుపు వృత్తిలోకి తరలిపోతున్న మహిళల జీవన ఆక్రందనను 'పూణే ప్రయాణం' రచనలో చిత్రణ చేశారు. ఇదే ఇతివృత్తంతో రాసిన 'మైనం బొమ్మలు' కథకు అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) పురస్కారం దక్కింది. న్యూఢిల్లీ కథా ఫౌండేషన్‌వారి నుంచి 'శిలబండి' కథకు జాతీయ కథాపురస్కారం, 'నేలదిగిన వాన' నవలకు అంపశయ్యా నవీన్ సాహితీ పురస్కారం, 'దేవరశిల'కు రావూరి భరద్వాజ స్మారక సాహితీ పురస్కారం అందుకున్నారు. వీరి కథలు పలు భారతీయ భాషలలోకి అనువాదమయ్యాయి.




Dr.Vempalli Gangadhar of Kadapa receiving sahitya Akademi Yuva Puraskar from Akademi president Sunil Gangopadhyay . (25th August 2012, Bhubaneswar (Odisha).

